ఆ. ఒదిగి యొదిగి గురువు నొప్పుగా నొప్పించి
మదిని నిక్పి జాతిమమత విడిచి
కదియుచుండు నతఁడు కలకాల మొకరీతి, వి. 217

తే. ఔచితిం గన్నవాఁ డెపు డర్హమైన
గౌరవమ్మును బరవిని గనుచునుండు
సర్వజనులును బూజింప సంతసమును
బండి దా కీర్తి నార్జించుచుండు వేమ. 218

తే. కడఁగి సంకల్పముల నెల్ల కట్టిపెట్టి
చిత్తమున నేమి తలఁపక చిత్రరూపు
కైవడిని నుండు నాతఁడు ఘనుఁడు దలఁప, వి.

ఆ. కనఁగ బొమ్మ లెన్నొ! కనకం బదొక్కటి
పసులవన్నె లెన్నొ! పా లొకటియె
పుష్పజాతు లెన్నొ! పూజ యొక్కటె సుమీ, వి.

ఆ. కప్పురంపు మనసు గాంతిఁచు యోగికి
జ్ఞానదీపశిఖయుఁ దా నటించుఁ
గానవచ్చు నాత్మక్రమమాణమైయుండు, విశ్వ.

ఆ కల్లగురుఁడు గట్టు కర్మచయంబులు
మధ్యగురుఁడు గట్టు మంత్రచయము
ఉత్తముండు గట్టు యోగసామ్రాజ్యంబు, వి.

ఆ. కలుషమానసులకు గాన్పింపఁ గా దు
అడుసులోన భానుఁ డడఁగిసట్లు
తేటనీరు పుణ్యదేహ మట్లుండురా, విశ్వ. 223

ఆ. కస్తురి యటుచూడఁ గాంతి నల్లగనుండు
పరిమళించు దానిపరిమళంబు
గురువు లైనవారిగుణము లీలాగురా, విశ్వ...

ఆ. కాకిగూటిలోన కోకిల మనినట్లు
భ్రమర మగుచుఁ బురువు బ్రతికినట్లు
గురువులౌదు రిలను గుణు లిట్లు పత్రింత్రు,వి...

ఆ. కుండ కుంభ మన్న గొండ పర్వత మన్న
నుప్పు లవణ మన్న నొకటి గాదె
భాష లిట్లె వేరు పరతత్త్వ మొక్కటే, వి...

ఆ. గాలి లేనిదీపకళికచందంబున
నలలు సుళ్లు లేనిజలధిరీతి
నిశ్చలాత్మ యెన్న నిర్వికారంబున
నుండెనేని పండితుండు వేమ. 227

ఆ. చిత్తశుద్ధి గలిగి చేసినపుణ్యంబు
కొంచె మైన నదియుఁ గొదవకాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత? విశ్వ...228

ఆ. చినుఁగు బట్టకాదు చీనాంబరము గాని
ముఱికి యొడలు కాదు ముక్తి గాని
పరమయోగిమహిమ పరికింపనిట్టులు,విశ్వ...229

ఆ. చెఱకుతోటలోనఁ జెత్తకుప్పుండిన
గొంచెమైన దానిగుణము చెడదు
మెఱుకఁగలుగుచోట నెడ్డెవాఁడున్నట్లు, వి...

ఆ. చదువరిమతికన్న సాధకుమతి మేలు
వేదములను లేదు పాదములను
ఒడలు శుద్ధిఁజేసి యొడయుని జూచెడు, విశ్వ.
క. చూపుల చూపై తోఁచెడి
రూపములకు రూప మదియె రూపము గాకే
దాపై లోపల వెలుపలఁ
గాపగు పరిపూర్ణమూర్తి కనవలె సుమతీ. 232
ఆ. జాతి నీతి వేఱు జన్మం బదొక్కటి
అరయ దిండ్లు వేఱె యానుగాక
దర్శనములు వేఱు దైవ మానొక్కటి,విశ్వ...
ఆ. జీవభేద మెఱిఁగి చెడిపోనివారలు
బ్రహ్మభావ మొంది పరగుచుంద్రు
నీరు ముత్యమైన నీరుగా మారునా, విశ్వ...234
ఆ. జీవి యందు భ్రమలు చేరియుండుట కద్దు
జీవి భ్రమలయందె జిక్కఁ డెపుడు
జీవి జీవియైన జిన్మాత్రముగుబయల్, విశ్వ...235
ఆ. తత్త్వవాదు లుంద్రు ధర నెందరైనను
తత్త్వవేదిఁ జూడు ధరణి లేఁడు
గలిగెనేని వాఁడు కానఁగఁ బడఁడయా,విశ్వ...
ఆ. తనువులోన వెదకి దైవంబు మొనఁజేసి
ముందు కర్మములను మూలఁద్రోసి
మనసు నిజముఁజేసి మమతలన్నియు రోయు, వి.

ఆ. తనువులోని యాత్మతత్త్వ మెఱుంగక
వేఱె కలఁ డటంచు వెదుక డెపుడు
భానుఁ డుండ దివ్వె బట్టుచు వెదకునా ? వి...

ఆ. తన్నెఱుఁగనివాఁడు తానె తానైయుండు
తన్నెఱిఁగినవాఁడుఁ దానె తాను
దనువు లేనివాఁడు తానె తానౌసుమ్మి, విశ్వ...

ఆ. తప్పు నొప్పు దెలిసి దైవసంకీర్తనల్
సేయువారు హరికి సేవకాళి
నీ తెఱుఁగున వారినిందింపఁ బోవరు, విశ్వ...240

ఆ. తరువఁ దరువఁ బుట్టు దరువునం దనలంబుఁ
దరువఁ దరువఁ బుట్టు దధిఘృతంబు
దలఁపఁ దలఁపఁ బుట్టు తనువున దత్త్వంబు, వి.241

ఆ. తాను నే ననియెడు తత్త్వభేదంబును
మాని యలవివేకమహిమఁ దనరి
యూఱకుండు జ్ఞాని యుత్తమోత్తముఁడగు, వి.

ఆ. తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక
యట్టునిట్టుఁ జూచి యదరిపడక
తన్నుఁ గానియట్లు తత్త్వజ్ఞుఁడుండును, వి...243

ఆ. వెఱ్ఱివాని మిగుల విసుగింపఁగా రాదు
వెఱ్ఱివానిమాట వినఁగ రాదు
వెఱ్ఱికుక్కఁ బట్టి వేటాడగా రాదు, విశ్వ...244

ఆ. దేవపూజ సేయ దివ్యభోగము గల్గు
తత్త్వ మెఱుఁగ గలఁడు దైవసముఁడు
యేమి లేనినరుని కేగతి లేదురా, విశ్వ...245

ఆ. దేహగుణము లెల్లఁ దెలిసిన శివయోగి
మోహమందు దవిలి మోసపోఁడు
ఇంద్రజాలకుం డటెందును జిక్కఁడు, విశ్వ...

ఆ. ధ్యానివలెనె యుండు మౌనివలెనె యుండు
భోగివలెనె యుండు రోగివలెనె
సకలమును దెలిసిన సర్వజ్ఞుఁడై యుండు, వి...

ఆ. నందుఁ డగుచు జ్ఞాని యిందు నం దనకుండు
నన్నితావులందు హరునివలెనె
తెలియువారికెల్ల దేవుఁడై కాన్పించు, విశ్వ...

ఆ. పగలు రేయి మఱచి భావంబు మఱచియు
తాను నే నని యెడి తలఁపు మఱచి
యుండువాని నెంచ యుత్తమయోగిరా, వి...

ఆ. పట్టు పట్టఁబోఁడు పట్టిన విడఁబోఁడు
నెట్టిగుణవికారనిహతి నడఁచి
మిట్టిపడక లోన మిన్నందు విజ్ఞుఁడు, విశ్వ...250

క. పరగినగాలి నభంబున
నెరయంగా భూమియందు నీరుండుగ దా
దరిదాపుల వేఱొక్కటి
యిరవుకొనుం దేజ మిట్లె యెల్లెడ వేమా! 251

ఆ పరుస మినుముసోఁక బంగార మైనట్లు
కప్పురంబు జ్యోతిఁ గలసినట్లు
పుష్పమందు దావి పొసఁగినట్లగు ముక్తి, వి...

ఆ. పాలలోనఁ బులుసు లీలతో గలిసిన
విఱిసి తునుకలగును విఱివిగాను
తెలియుమనములోన దివ్యతత్త్వము తేట, వి...

ఆ. పికము వనములోన వెల్లుగాఁ బలికిన
భంగి ప్రాజ్ఞజనుల పలుకు లుండు
కాకి కూఁతఁబోలు కర్మబంధులకూఁత, విశ్వ...

ఆ. పుడమిదిరిగి బడయు పుణ్యంబు లెల్లను
గలుగు సాధుజనులఁ గన్నయపుడె
వడిని నీరు నదిని గడుఁ దేటయై యుండు, వి...

ఆ. పైరు నిడినవానిఫల మదే సఫలంబు
పైరు నిడనివాఁడు ఫలముఁ గనునె
పైరునిడినవాఁడుబహుసౌఖ్యవంతుఁడౌ, వి...

ఆ. ప్రజ లెఱుంగ బ్రదుకఁ బట్టభద్రుఁడు గాఁడు
పైఁ గిరీటముండు బ్రహ్మ గాఁడు
నోగుఁ దెలిసి పలుకు యోగీశ్వరుఁడు వాఁడు, వి.

ఆ. పృథివిమీఁదఁ బుట్టి ప్రిదులుగ హంసల
విహరణం బెఱింగి విడువక మదిఁ
దిరుగ నేర్చియుండు ధీమంతుఁ డెప్పుడు, వి...

ఆ. బంటువలెనె లేఁడ బండితంమన్యుఁడు
సాధుపండితుండు శాంతుఁ డగును
కుక్క గూయ నేమి గుఱ్ఱమునకు లెక్క? వి...

ఆ. బహుళకావ్యములను బరికింపఁగా వచ్చు
బహుళశబ్దచయము పలుకవచ్చు
సహన మొక్క టబ్బ చాలకష్టంబురా! వి...260

ఆ. బాపలన్న దొడ్డపరువునఁ జూడరు
కానిపనులు సేయ గడలుకొనరు
కులము లెక్కయేమి గుణమే ప్రధానంబు,వి...

ఆ. బ్రాహ్మణులకు సకలభాగ్యంబు లీవచ్చు
గౌరవింపవచ్చు కలయవచ్చు
జ్ఞాన మొసఁగి జనులఁ గడ తేర్చునట్లయిన, వి...

క. భువి నరకులమునఁ బుట్టియు
భువినరకులములను బెరిగి భువినరకులముల్
నవిరళముగ ఛీఛీ యని
శివకులమున దిరుగునతఁడె సిద్ధుఁడు వేమా.263

ఆ. మతములోన నున్న మతము లన్నియుఁ గోసి
ఘటములోన నున్న ఘనుని దెలసి
ఘనత నిల్పుచుండు ఘనతత్త్వయోగి యా, వి.

ఆ. మననవృత్తిలోని మహిమనె లుంగుచు
మనసునందె పూజమహిమ గనుచు
మానకుండు వాఁడె మర్మజ్ఞుఁడగుయోగి, వి...

ఆ. మనసు గుప్తపఱచి మాన్యుఁడై విబుధుఁడు
తఱచు పలుకకుంట ధర్మమండ్రు
తఱచుమాటచేత తత్త్వంబుఁ జెడిపోవు, వి...

ఆ. మనసునిల్పినట్టి మాన్యులౌ విబుధులె
గరిమ మోక్షపథముఁ గన్నవారు
చెట్టుఁ బెట్టి ఫలముఁ జేకొనకుందురా ? వి...

ఆ. మరణకాలమందు మదినిల్పు సుజ్ఞాని
పరముఁ బ్రతిభచేతఁ బట్టువిడక
వెనుకఁ గోర్కెలకును విలపించునజ్ఞాని, విశ్వ...

ఆ. మర్మవిదుఁడు గాని మర్మంబుఁ గనలేఁడు
కర్మజీవిగాని కానలేఁడు
నీరుచొరకలోఁతునిజములు తెలియునా ! విశ్వ...

ఆ. మాటలాడవచ్చు మనసు దెల్పగలేఁడు
తెలుపవచ్చుఁ దన్ను దెలియలేఁడు
సురియఁ బట్టవచ్చు శూరుఁడు గాలేఁడు, వి...

ఆ. మాలకన్నియలకు మంచిరూపం బిచ్చు
ముట్టైనే త్రిశంకుపట్టి నాఁడు
కానిపనులు సేయ ఘనులాసపడుదురా ! విశ్వ...

ఆ. ముక్తిఁ గానలేని మూర్ఖజనుల కెల్ల
బట్టబయలుచేసి పరమపదము
దారిఁజూపుబుధుఁడు దైవంబుగాఁడొకో విశ్వ.

ఆ. మున్ను నిన్ను గన్నముఖ్యు లెవ్వరో వారి
సన్నుతించి పిదప సంతతమును
జ్ఞానదాతఁగొల్వు ఘనతచే విబుధుని, విశ్వ...

ఆ. మెలఁగి జ్ఞానమయుఁడు మితిమీఱుచుండఁడు
ఉనికి విడఁడు తాను నుపమునొందు
తనువు మఱచి మించి తత్త్వజ్ఞుఁ డుండును,వి...

క. మొదటను మతముఁ బ వదలక
తుద నెవ్వరిమతము నైన దూషింపక తాఁ
బదిలుఁడయి కోర్కెఁ గోరక
ముదమునజరియించుబుధుఁడెముఖ్యుఁడు వేమా!

తే. యాత్రలంచలిఫల మొందఁ యాగములను
సూత్రసమముగఁ జేసియు సూక్ష్మమొంది
పరమహంసను గీలించి ప్రబలుచుండు
పరము గోరెడు ప్రాజ్ఞుఁ డిద్ధరను వేమ. 276

ఆ. రాజపరుల కెపుడు రణరంగములచింత
పరమమునుల కెల్లఁ బరముచింత
అల్పనరుల కెల్ల నతివలపై చింత, విశ్వ... 277

ఆ. లోను బదిలపఱచి లోనివికారముల్
తలఁచి మెట్టువారు తెలియువారు
ఆకసమున వేడ్క నరయంగ నుందురు,విశ్వ...

ఆ. వలయు నన్న రాదు వద్దన్న బో వది
తాను జేసియున్నధర్మ మనుచు

ఉల్లమందు దలంపఁ డుత్తమవిబుధుండు, విశ్వ...

ఆ. వాద మాడఁ డెపుడు వరుస నెవ్వరితోడ
జేరరాఁడు తాను జేటుఁ దేడు
జ్ఞానియగుచుబుధుఁడుఘనతనొందఁగఁజూచు, వి.

ఆ. వార్ధియందుఁ బుట్టి వశముగా రానచ్చు
పూర్ణదృష్టియందు బూననచ్చు
పూని యెఱుకగలిగి బుధుఁడుగా గాలేడు, వి...

ఆ. విద్య లేనివాఁడు విద్వాంసులకడ
నుండఁగానె పండితుండు గాఁడు
కొలని హంసలకడ కొక్కెర లున్నట్లు, విశ్వ....

ఆ. విద్య లేకయున్న విత్తము లేకున్న
మూఢుఁడైనఁ దుదకు మూగయైన
నిష్టబంధుఁడైన గష్టమే గలుగును, విశ్వ...283

తే. వివరిసేయును సద్గురు వేడుచుండు
మును భ్రమరకీటకన్యాయమునను నుండు
వాని నెన్నంగవరమె యీవసుధలోన
సాధుసన్మార్గ పరుఁడె యగుఁ జగతి వేమ. 284

ఆ. విప్రవరులయందు విబుధులయందును
నీతినుంచువాఁడె నిర్మలుండు
భక్తిగలుగువాఁడె పరమార్థపరుఁడయా, వి....

ఆ. విశ్వమనఁగ నేమొ? విచారించి చూచును
విశ్వమైదువిధులు వెలయఁ గనును

విశ్వమును మదిలోన వెదకును విబుధుఁడు, విశ్వ....

తే. విశ్వరూపము మదిలోన వెలయఁజూచి
ప్రాస్వ మమరఁగ బుద్ధిని నందిపట్టి
స్వస్వరూపము గనుచుండు సజ్జనుండు, విశ్వ....

ఆ. వీరుఁ డైన రాదు విబుధులగుణములు
చదువులంద రాదు సటల రాదు
జన్మపాకముననె సఫలమౌ నరులకు, విశ్వ...

ఆ. వెదకి కాన లేరు వేదాంతవేద్యుండు
నుత్తముండె కాంచు నుర్వి మీఁద
కలిగనే నతనిని గానంగ లేరయా, విశ్వ...

క. వేడుక మదిలోఁ జూడక
తోడగునా యెఱుకమీఁటి త్రొక్కుడుపడ కా
జాడను మఱచినవాఁడే
వేడుకఁ బరతత్త్వమంది వెలయును వేమా! 290.

ఆ. వ్యాధి కలిగెనేని వైద్యునిచేతను
మందు దినకకాని మాన దెందుఁ
జెంత దీపమిడక చీకటివాయునా, విశ్వ....291

ఆ. స్వానుభూతియందు శాస్త్రవాసనలందు
సంశయంబు లేనిసాధనమున
వెలుఁగు దీప మట్టు చిత్స్వరూపము నంటు, వి...

# అర్థపద్ధతి.

ఆ. అధముఁడైనమనుజుఁ డర్థవంతుండైన
నతనిమాట నడచు నవనిలోన
గజపతింట నెన్న గవ్వలు చెల్లవా! వి...293

ఆ. అధికభుక్తిచేత మొదటిసొమ్మును పోని
కుదువసొమ్ముకన్నఁ గొంపహాని
మొదటిపక్షమునను మూలకర్తకు హాని, వి...

ఆ. అప్పులేనివాఁడె యధికసంపన్నుండు
తప్పులేనివారు ధరను లేరు
గొప్పలేనిబుద్ధి కొంచెమై పోవురా, వి.... 295

ఆ. అరయఁ దలుచు కల్లలాడెడువానింట
వెడల కేల లక్ష్మి విశ్రమించు
నీర మోటికుండ నిలుచునిచందాన, వి... 296

ఆ. అర్థవంతుసొమ్ము నాశించు నర్థులై
యర్థికీయ సొమ్ము వ్యర్థమగును
వ్యర్థమైనసొమ్ము వ్యర్థులఁజేరురా, వి... 297

ఆ. ఆఁడువారిగన్న నర్థంబుఁ బొడగన్న
సారమైన రుచులు చవులఁ గన్న
అయ్యగారికైన నాశలు గలుగవా? వి... 298

ఆ. ఆపదందుఁ జూడు మారయ బాధుఁ
భయమువేళఁ జూడు బంటుగుణము

పేదపడ్డ వెనుకఁ బెండ్లమును తిఁ జూడు, వి...

ఆ. ఆశచేత ధనము నార్జింపఁగా నేల
పట్టి క్రిందఁ బెట్టి మఱుప నేల
ధనము పోవు వెనుక ధర్మం బదేలరా? వి...300

ఆ. ఇంటిలోని ధనము నిది నాది యనుచును
మంటిలోన దాఁచు మంకుజీవి
కొంచుబోఁడు వెంట గుల్లకాసును రాదు, వి...

ఆ. ఇరుగుపొరుగువారి కెనయుసంపదఁ జూచి
తమకు లేదటన్న ధర్మమేమి
ధర్మమన్నఁ దొల్లి తన్నుక చచ్చిరి, వి... 302.

ఆ. ఇహమునందు చాలయిడుములు పడినను
బడుగు పొందఁగలఁడె పరమపదవి
పేదకనువుపడునె పృథివిపై భాగ్యంబు, వి....

ఆ. ఇహమున సుఖియింప హేమతారకవిద్య
పరమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమవిద్య లెల్ల గల్ల మూఢులకురా, వి...304.

ఆ. ఇహమునందు సుఖము లింపార లేదట
పరమునందు సుఖముఁ బడయు టెట్లు
ధనము లేక సుఖము తన కెట్లుకలుగురా? వి...

ఆ. ఈత కన్న లోఁతు నెంచంగఁ బనిలేదు
చావు కన్న గీడు జగతి లేదు
గోచిపాతకంటె గొంచెం బికను లేదు, వి...306.

ఆ. ఉచితవంతుఁ డైన నుద్యోగపరుఁడైన
సంప దమరియున్న సమయమున నె
పరుల కుపకరించి పాలింప గల్గును, వి... 307

ఆ. ఉన్న యంత మనుజుఁ డుపకారి గా లేక
కన్ను కాన డంచు ఘనుఁడు వల్కు
దీనుఁ డైనతనకు దిక్కెవ్వరగుదురు? వి... 308

ఆ. ఉప్పు లేనికూర యొప్పదో రుచులకు
పప్పు లేనితిండి ఫలము లేదు
అప్పు లేనివాఁడె యధికసంపన్నుఁడు, వి.... 309

ఆ. ఉర్వి వారికెల్ల నొక్క కంచముఁ బెట్టి
పొత్తుఁ గుడిపి కులము పొలయఁ జేసి
తలను చేయి పెట్టి తగ నమ్మ జెప్పరో? వి... 310

ఆ. ఋణ మొసంగునాతఁ డినుఁడగు దొలుదొల్త
నదియు మరల నడుగ యముఁడుగ నగు
అప్పు జేసి తీర్ప నలయనివారికి, వి... 311

ఆ. ఎంతభూమి దిఱిగి యేపాటు పడుచున్న
నంటనీక ప్రాప్తి వెంటదిరుగు
భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా? వి...312

ఆ. ఎద్దు మొద్దువాని కేలశాస్త్రంబులు
ముద్దునాతి కేల ముసలిమగఁడు
చద్దిమిగులనిల్లు సంసార మేలరా? వి... 313

క. ఎన్నాళ్లిలఁ దానుండును

ఎన్నాళ్లిలఁ దానునేర్చి నెన్నిఁట వెలయఁగ
గొన్నాళ్లకుఁ దాఁ జనినను
నున్నాగద విద్యలెల్ల మహిలో వేమ. 314

ఆ. ఓజమాలుమగుప ఓలిమాడలచేటు
పాటులేనిమగఁడు కూటిచేటు
పనికిమాలుదాసి బత్తెంబు చేటురా, వి... 315

ఆ. కట్టెపేరు లోలిగట్టి చెప్పగరాదు
కానరాక యున్న కలిమితనము
జంగమైనవాని జాతి గన్పడదొకో, వి.... 316

ఆ. కడుపునిండ దవుడు గంపలోఁ బెట్టిన
జన్నుఁ బట్టనీకె ఁన్ను గేదె
వారకాంత లెట్లు వలతురో యూఁకక? వి...31

ఆ. కనకపర్వతమునఁ గాపురం బుండిన
ననిమిషేశ్వరునకు నాసపోదు
కనకకుండలములు కర్ణుని నడుగఁడా? వి... 318

ఆ. కనకమృగము భువిని కద్దు లేదనలేక
తరుణి విడిచిపోడె దాశరథియు
దైవమైన ధనముఁ దలఁచుచుండెను గాదె, వి...

ఆ. కనక మున్నవాఁడు కాముఁడు భీముఁడు
మిగులఁ దేజమంది మెలఁగుచుండు
విత్తహీనుఁడైన వెట్టులలోనేటు, వి... 320

ఆ. ఉన్నఘనతఁబట్టి మన్నింతురేగాని

పిన్న పెద్దతనము లెన్నఁబోరు
వాసుదేవు విడిచి వసుదేవు నెంతురా? వి...321

ఆ. కనియుఁ గానకుండుఁ గదలింపఁ డానోరు
వినియు వినకయుండు విస్మయంబు
సంపద గలవాని సన్నిపాతకమిది, వి... 322

క కన్నె మీఁది యాస కనకంబుపై నాస
లేనివాఁడు పుడమి లేనివాఁడు
కలిగెనే నతండు కానంగ రాఁడయా, వి... 323

ఆ. కమ్మరీనిదుడుకు కార్యవినాశంబు
నక్లవానిదుడుకు వాఁడిపిడుగు
కానెవానిదుడుకు కాకుత్స్థుబాణంబు, వి...324

ఆ. కర్ణుఁ డొకఁడెగాని ఘను లెవ్వరును లేరు
దానశీలుఁ డంచు దలఁపఁబడెను
తలఁప ధనము కర్ణు దాతఁ జేసెను సుమీ, వి...

ఆ. కలిగినమనుజుండు కాముఁడై సోముఁడై
మిగుల తేజమునను మెఱయుచుండు
విత్తహీనుఁడైన నుత్తసన్యాసిరా, వి... 326

ఆ. కలిగి ధర్మమీయఁ గానివారును
కలిగి తినక చాల గ్రాఁగువారు
కలిమి నెచటఁ జూడఁ గానక చెడుదురు, వి.

ఆ. కలిమి యున్నవానిఁ గని పట్టి నిచ్చిన
మనువుపొంగుపాలు మఱిగినట్లు

లోన నిగిరి కలిమి లొట్టపోయెడునో, వి...

ఆ. కలిమి కలిగియుండి కఠినభావముఁ జెంది
తెలియలేరు ప్రజలు తెలివిలేక
కలిమి వెన్నెలగతిఁ గానంగ లేదయా, వి...329

ఆ. కలిమి కలిగెనేని గాముఁగాఁ జూతురు
లేమిచేతఁ జిక్క లేమ లధిపు
మదనువంటివాని మాలఁగాఁ జూతురు, వి. 330

ఆ. కలిమి గలుగ సకలకులముల కెక్కువ
కలిమి భోగభాగ్యములకు నెలవు
కలిమి లేనివానికుల మేమి కులమయా? వి...

ఆ. కలిమిఁ జూచి యీయఁ గాయ మిచ్చినయట్లు
సమున కీయ నదియు సరసతనము
పేదకిచ్చుమనువు పెనవేసినట్లురా, వి... 332

ఆ. కలిమినాఁడు మగని గామించి చూచును
లేమిఁ జిక్కునాఁడు లేవకుండు
మానినమగనినైన మడియంగఁ జూచును, వి. 333

ఆ. కాంచనంబుపైనఁ గాంతలపైనను
బహ్మకైనఁ బుట్టు రిమ్మతెగులు
తోయజాక్షువిడుచు దొరయెవ్వఁడును లేఁడు,వి.

ఆ. కాంచనంబుమీఁది కాంక్ష మోహ మఁటండ్రు
విడువలేరు దాని విబుధులైన
కాంక్ష లేనివారు కానఁగా రారయా, వి...335

ఆ. కానవలయు ధనముఁ గాంత నెల్లప్పుడు
కావలేనివాఁడు చావవలయు
కాపులేనిదాని కాపుర మడుగనా?, వి. 336

ఆ. కుడువఁ గూడు లేక కూడఁబెట్టఁగ లేక
విడువ ముడువ లేక గడన లేక
నడువ సాగకున్న నడపీనుఁగందురు, వి... 337

ఆ. కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిఁడి గల్గువాని బానిసకొడుకులు, విశ్వ...338

ఆ. కులములేనివాఁడు కలిమిచే వెలయును
కలిమిలేనివాని కులము దిగును
కులముకన్న నెన్నఁ గలిమి ప్రధానంబు, విశ్వ.339

ఆ. కులుకుగుబ్బఁ జూపి గొబ్బున వలపించి
చేతికాసులెల్లఁ జేరదీయు
నతనుచేతికత్తు లమరంగఁ గాంతలు, వి... 340

ఆ. కూరలేనితిండి కుక్కతిండనిపించు
మాఱులేనితిండి మాలతిండి
ధారలేనితిండి దయ్యపుతిండిరా, విశ్వ... 341

ఆ. కూలినాలిఁ జేసి గుల్లాముపనిచేసి
తెచ్చిపెట్ట నాలు మెచ్చుచుండు
లేమిఁ జిక్కువిభుని వేమాఱు దిట్టును, విశ్వ...

ఆ. కోమటి మదిఁ గోరు క్షామమే యెల్లెడ
వైద్యుఁ డోరుల కెపుడు వ్యాధిఁ గోరు
ఊరివాఁడు ధనికుఁ జేరఁగాఁ గోరును, వి...

ఆ. చదువులందుఁ బాడి సౌఖ్యములందును
పెదవులందు రాజ్యపదవులందు
నాశ లుడిగినట్టి యయ్యలు గలరొకో, విశ్వ...

ఆ. చమురు గల్గుదివ్వె సంతోషముగ వెల్గు
ధనము గలుగువాని తలఁపుఁ జెలఁగు
ధనము లేనివాని తలఁపులు తీరునా, విశ్వ...345

ఆ. చావు నేఁడో రేపో జతపడివచ్చును
పెక్కునాళ్లు కూడఁ బెట్టనేల
అనుచు నాశ లుడిగినంతటివా రేరి? విశ్వ...346

ఆ. జడలు దాల్చువెల్ల జగము నీ యనువెల్ల
నొడలు విఱుచు నట్టియోగ మెల్ల
ముక్తికాంతఁబట్టి ముద్దాడుకో ననునా, వి. 347

ఆ. టంక మదుకకున్నఁ బొంకంబు గాకాడు
స్వర్ణభూషణంబు జగమెఱుంగు
భటుఁడు వెంటలేక ప్రభుఁడు శోభించునా, విశ్వ.

ఆ. డిందుపడినవాని నెందును లెక్కింప
రిందు నందుఁ గాన నెట్టు లయిన
మందమతివి గాక మహిమతో నుండుము, వి...

ఆ. డొక్క యెండిపోవు డొక్కు తానయ్యును
మమత మానఁ గలఁడె మానవుండు
కాన ధనముఁ గూర్పఁగడఁగుము జ్ఞానివై,వి...

ఆ. తమకు బంధు వనుచు తాను తోడుకవచ్చి
కలిమిఁ గలయఁ జూచి కాంక్షపడుచు
దక్షిణల నొసంగి తరుణి నీయఁగఁజూచు, వి...

ఆ. తల్లుడు కల్లలాడు ధరణీశు లిండ్లలో
వేళవేళ లక్ష్మి వెడలిపోవు
నోటికుండలోన నుండునా నీరంబు? విశ్వ...352

ఆ. తరుణి సుతులు ధనము ధాన్యముల్ సంపద
లెంతచుట్టుకొనిన నంతచేటు
పసిరికాయ పురుగుపద్ధతి గానరో, విశ్వ...353

ఆ. తలనుఁ బాగ పైని దగుపచ్చడము బొజ్జ
చెప్పులపొగు లరసి చేరు నర్థి
శుద్ధపశువు లనుచు బుద్ధిలో నరయక, విశ్వ...

ఆ. తల్లిబిడ్డలకును నగవు పుట్టించెడు
ధనము సుఖముఁ గూర్చ దని వచింత్రు
కాని గడన లేక గడచుట యెట్లురా? వి...355

ఆ. తళుకుబెళుకుఁ జూచి ధరలోనిజను లెల్ల
కద్దు లే దటంద్రు ఘనతగాను
ఇదిగొ యదిగొ యనుచు నిఁక నెక్కడందురు?వి.

ఆ. తవిటి కరయఁ బోవఁ దండులంబుల గంప
శ్వాన మాశ్రయించు సామ్యముగను
వైశ్యవరునిసొమ్ము వసుధ నీచుల కబ్బు, వి...

ఆ. తాను గుడువలేఁడు తగవేది యాప్తులఁ
జేరనీయఁ డట్టి చెనఁటి పశువు
చేనిలోన బొమ్మఁజేసి కట్టినయట్లు, వి... 358

ఆ. తాము దిరుగుభూమి ధూమడాంబరమైన
బరగు దేశమునకు జరుగవలయు
గోల నటెండిపోవ గొక్కెరలుండునా? వి...359

ఆ. తిరిపెగాఁడయినను దిరిపె మెత్తినయట్టి
తిరిపెమందె తాను దిరిపె మిడిన
తిరిపెము తిరిపెమున దిగఁబడిపోవుగా, వి...

ఆ తీపికెల్లఁ దీపి తెలియంగఁ బ్రాణంబు
ప్రాణవితతికన్నఁ బసిఁడి తీపి
పసిఁడికంటె మిగులఁ బడఁతిమాటలు తీపి, వి...

ఆ. తెలుపఁబడినవాఁడు దేవతాభక్తుండు
మాటలేనివాఁడు పోటుబంటు
కాసులేనివాఁడు కడుబ్రహ్మచారియౌ, వి...362

ఆ. తోఁటకూరకైన దొగ్గలికైనను
తవిటికుడుముకైనఁ దవిటికైన
గావమ్ములను జెపఁ ఘనులెల్ల ధనపరుల్, వి...

ఆ. దశగలారి నెల్ల తమబంధువు లటంద్రు
దశయు లేమి నెంత్రు తక్కువగను
దశయనంగను ధనదశయొప్పు నొక్కటె, వి...

ఆ. దశయనంగ మెండు ధనముంటయే యంద్రు
కూడు నిద్రలేక కుందుఁ గద
రాగ నుండఁబోవ బాగుగా నేడ్పించు, వి...

ఆ. దానములను జేయ ధర చేతులాడక
బహుధనంబుఁ గూర్చి పాతిపెట్టి
తుదను వండుగనిడి మొగలు చెడునరుఁడు, వి...

ఆ. దినము మూఁడుమార్లు తిని నిదురించుచు
సొగసుచనులవారి సొంపుతోడఁ
జేరుచుండి ధనముఁ జెడుపకు మెప్పుడు, వి...

తే. దేశదేశమ్ముఁ దిరుగుట తిండికొఱకె
పూని వేషము వేయుట పొట్టకొఱకె
మనసునందు నెగుఱిఁగాంచ సమతవిడరు, వి...

ఆ. దేశవేషములను తేటసేయఁగ చేవ్రఁ
డాత్మలోన నుండు నణఁగి పెనఁగి
వేస మరసి చూడ గ్రాసంబు కొఱకయా, వి..369

ఆ. దోసకారియైన దూసరివాఁడైన
బగతుఁడైన వేదబాహ్యుఁడైన
ధనికు నెల్లవారు తనియింపుచుందురు, వి...370

ఆ. ద్రోహబుద్ధినైన దొంగతికమునైన
సటలనైన సాహసములనైన
సంపదధికువలన సాధింపఁ దగుటొప్పు, వి...371

ఆ. ధనము లేకయున్న ధైర్యంబు చిక్కదు
ధైర్య మొదవదేని ధన మొదవదు
ధనము ధైర్య మరయఁ బగుభూమి నరులకు, వి.

ఆ. ధనము లేమి గుణము తక్కువపడవచ్చు
ధనము లేమిఁ గీర్తి తలఁగిపోవు
ధనము లేమి శుచిని తగఁ బుట్టనీయదు, వి...373

ఆ. ధనము లేనివేళ తండ్రిగర్భంబున
భాగ్యపురుషుఁ డొకఁడు పరఁగఁబుట్టి
బహుళధనముఁగూర్చుభద్రంబులొనఁగూర్చు, వి.

ఆ. ధనము లేమి యనుట దావానలంబగు
తన్నుఁ జెఱుచు మీఱి దాపుఁ జెఱుచు
ధనము లేమి పనిని తలఁపఁగా పాపంబు, వి...

ఆ. ధనము లేమి సుతులు తప్పూల నిడుదురు
ధనము లేమి పత్నిఁ దాఁకరాదు
ధనము లే మెవనికి తాళిక నీయదు, వి... 376

క. ధనమా మూలము జగమున
ధనమా మూలంబు సకలధర్మంబులకున్
గుణములు మూలము సిరులకు
ధనమా మూలంబు ముక్తి మహిమకు వేమా!

ఆ. నక్కవినయములను నయగారములఁ బల్కి
కడకు ధనముఁ గూర్పఁ గడఁగుచుంద్రు
కుక్కబోనువాతఁ గూడు చల్లినరీతి, వి... 378

ఆ. నారాయ ణనవచ్చు నమశివ యనవచ్చు
మేలువారిజూచి మెచ్చవచ్చు
కొంగు కాసు విడిచి గొబ్బున నీరాదు, వి...

ఆ. పరగ లేమిచేత బంధువు ల్పగవారు
పరగ లేమిచేతఁ బరము తప్పు
పరగ లేమిచేతఁ బరపతియును దప్పు, వి...380

ఆ. పాగ పచ్చడంబు పైకి గూపంబును
పోగు లుంగరములు బొజ్జకడుపుఁ
గలిగినట్టివానిఁ గందురు చుట్టాలు, వి... 381

ఆ. పాపపుణ్యములను పసిగా పెఱుఁగునా
ధరను బరమయోగి యెఱుఁగుగాక
పసిఁడిపొందిక గని బాగుగాఁ జూపునము,వి...

ఆ. పాలసాగరమునఁ బవ్వళించినహరి
గొల్లపల్లెపాలు గోరనేల
నెదుటివారిద్రవ్య మెల్లవారికిఁ దీపి, వి...383

ఆ. పుత్త్రడిగలవాని పుండుబాధయుఁ జూడ
వసుధలోనఁ జాలవార్తకెక్కు
పేదవానియింట పెండ్లైన నెఱుఁగరు, వి... 384

ఆ. పూర్వజన్మమందు పుణ్యంబు సేయని
పాపి తా ధనంబుఁ బడయ లేఁడు
విత్త మఱచి కోయ వెదకినచందంబు, వి. 385

ఆ. పూసపోగుఁ బసిడిపుట్టంబు విద్యయుఁ
గాయపుష్టి చాలఁగలిగెనేని
కానికులజు నైన ఘనుఁడని రమ్మంద్రు, వి. 386

ఆ. పేదవానిబాధ పెనుభూత మైయుండు
జూడలేదు బాధఁ జూడ వశమె
కలుగువానిబాధ కనులఁ జూడఁగలేమి
కేమి చేయవచ్చు నింక వేమ! 387

ఆ ప్రాప్తిగల్గుచోట ఫల మిచ్చుదైవంబు
ప్రాప్తిలేనిచోట ఫలము లేదు
ప్రాప్తిలేక పసిఁడి పరమాత్ముఁ డిచ్చునా? వి ...

ఆ. మగని కలిమిబలిమి మగువకును బలంబు
కలిమి లేనిమగఁడు కాసుగాఁడు
పనికిరానిమగని పాటించి చూడరు, వి... 389

ఆ. లేమిగల్గువాఁ డిఁకేమేమి చేసిన
కలిసిరాదు ఫలము కాసుగూడ
కలిమి గల్గుచోటఁ దులదూఁగుచుండెను, వి....

## దుర్జనపద్ధతి.

ఆ. ఆగ్ని చేతఁ బట్టి యాపరమేశుని
నిందచేసి నరులు నీఱుకారె
దక్షుక్రతువులోని తల్లడమెఱుఁగరా? విశ్వ...

ఆ. అంటుముట్టు నెంచి యదలించి పడవైచి
దూరమందుఁ జేసి దూఱుచుంద్రు
పుట్టి చచ్చు ఖలులు పూర్ణంబు తెలియరు, వి, 392

ఆ. అంతరంగమందు నపరాధములు సేసి
మంచివానివలెనె మనుజుఁ డుండు
ఇతరు లెఱుఁగకున్న నీశ్వరుఁ డెఱుఁగఁడా? వి.

ఆ. అంతరాత్మఁ గనక యల్పబుద్ధులతోడ
మెలఁగెడుద్విజులెల్ల మేదినందు
యమునినరకముఁ కు నరుగంగ సాక్ష్యము, వి...

ఆ. అధికుఁ డైనరాజొకల్పునిచేఁ బట్టి
వానిమాట చెల్లు వసుధలోన
గణకు లొప్పియున్న గవ్వలు చెల్లునా! వి...395

ఆ. అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారినెల్లఁ దొలఁగఁగొట్టు
చెప్పుఁ దినెడుకుక్క చెఱకుతీపెఱుఁగునా! వి...

ఆ. అల్పుఁ డెపుడుఁ బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచు మ్రోఁగునట్లు కనకంబు మ్రోఁగునా? వి...

ఆ. ఆదికారణముల నల్పుఁ డెట్టు లెఱుంగు
చెప్పలేఁడు గాని తప్పుఁ బట్టు
త్రోయనేర్చుకుక్క దొంతులు చేర్చునా? వి ....

ఆ. ఆల మెఱుఁగు యోధుఁ డల్పునిఁ జేరిన
మార్పుచేత బుద్ధి మరిగి తిరుగు
మ్రాను మాను దిరుగు మహి కోఁతికై పడి, వి...

ఆ. ఇచ్చకంబులాడు నిందీవరాక్షులు
మచ్చరంబు మాని మాన్యుఁ జేరి
తుచ్ఛగుణము విడక దూఱుచునుందురు, వి.

ఆ. ఇనుము విఱిగెనేని యిమ్మాఱు ముమ్మాఱు
కాఁచి యతుకనేర్చు కమ్మరీఁడు
మనసు విఱిగెనేని మఱియంట నేర్చునా? వి.

ఆ. ఎంతసేవఁజేసి యేపాటుపడినను
రాచమూక నమ్మరాదు రన్న
పాముతోడిపొందు పదివేలకైనను, వి. 402

ఆ. ఎద్దుకన్న దున్న యేలాగు తక్కువ
వివర మెఱిఁగి చూడు వృత్తియందు
నేర్పులేనివాని నెఱయోధుఁ డందురా? వి.

ఆ ఎఱుక మాలువాఁ డికేమేమిచదివిన
చదివినంతసేపె సద్గుణియగుఁ
గదిసి శావఁరందు కప్ప కూర్చున్నట్లు, వి ...

తే. ఏమికానిది పరతత్త్వ మెఱుఁగలేక
సోమయాజులు పశువుల స్రుక్కడంత్రు
సామ మేర్పడఁ జదివినఁ జావవేల
బాధకము లగుదుర్గుణపంక్తి వేమ. 405

ఆ. ఒకరినోరుఁ గొట్టి యొకరు భక్షింతురు
వారినోరు మిత్తి వరుసఁ గొట్టు
చేఁపపిండుఁ బెద్దచేఁపలు చంపును
జనులు చేఁపపిండుఁ జంపు వేమ! 406

ఆ. ఒడ్డెవానికి గుఱుతోర్చి చెప్పినఁగాని
తెలియఁబడునె యాత్మ తెలివి లేక
చెడ్డకొడుకు తండ్రి చెప్పిన వినఁడుగా, వి...407

తే. ఓటు పరులకు గల్గించు నూహఁజెంది
కుచ్చితులతోడఁ బనిఁ బడఁగూడ దెప్డు
అప్పు డెట్లైన వారలయాంక్షత దన
గౌరవంబును మాపును కాదె వేమ... 408

ఆ ఓపఁగల్గుదు నని యొక్కింత మిక్కిన
నున్నవానికూడ నున్నచుట్టి
మూలఱంకు లాగి గేలిసేయుదు రయా! వి...

ఆ. కండచక్కెరయును గలియఁ బాల్పోసిన
తఱిమి పాము తన్నుఁ దాఁకుఁగాదె
కపట మున్నవానిఁ గన్పట్టవలెనయా, వి... 410

క. కనియుండి కానలేరఁట
వినియుండియు వినఁగలేరు విస్మయ మహహా!
కను గ్రుడ్డియు విను చెవుడం
చనునది నిజమయ్యె జగమునందున వేమా! 411

ఆ. కల్ల నిజముఁజేసి కఠినభావముఁ జెంది
ప్రల్లదంబులాడు భక్తిలేక
మాయలాడు ఖలుఁడు మహితాత్మసాటియా, వి.

ఆ. కలియుగంబునందు ఘనతకు నైచ్యంబు
ఘనత నైచ్యమునకుఁ గల్గుచుండు
శ్రద్ధ భక్తు లుడిగి జనులుంద్రుగావున, వి...4!3

ఆ. కలువపూలవంటి కన్నులుండిననేమి?
చిలుకపలుకులట్లు పలుకనేమి?
తేలివిబలిమికలిగి తేజరిల్లఁగనేమి?
తులువగామి నలరు నెలఁతవేమ! 414

ఆ. కల్లుకుండ కెన్ని ఘనభూషణము లిడ్డ
నందులోనికంపు చిందు లిడదె ?
తులువ సదివికొన్నఁ దొలిగుణమే మగు? వి ..

ఆ. కల్లునీళ్లు త్రాగి కడుఁ బెద్దవారిలో
జీరె విడిచి తిరుగు చెడునరుండు
పనులు తీరువెనుకఁ బాతలుగట్టురా? వి. 416

ఆ. కసినిగలిగి పాపకర్ముల పీడింతు
కల్లప్రభులు యముని యల్లభటులు

వృశ్చికంబుఁ గన్న విడుతురే చంపక, వి.

ఆ. కానివానితోడఁ గలసి మెలంగిన
హానివచ్చు నెంతవానికైన
ఈఁగ కడుపుఁజొచ్చి యిట్టట్టు సేయదా? వి.

ఆ. కులములోన నొకఁడు గుణహీనుఁ డుండిన
కులము చెడును వానిగుణమువలన
ఎలమి చెఱకునందు నెన్ను పుట్టినరీతి, వి. 419

ఆ. కులమువలనఁ గొంత బలమువలనఁ గొంత
కలిమివలనఁ గొంత గర్వ మొదవ
అంకుచదువు చదివి అంకునచెడుదురు, వి. 420

ఆ. కుళ్లఁబోతునొద్దఁ గూడి మాటాడిన
గొప్పమర్మములను జెప్పరాదు
పేరు తీరఁదెల్ప నూరెల్ల ముట్టించు, వి. 421

క. కుమ్మరవానికి జ్ఞానము
నెమ్మదిగాఁ దెల్పవలదు నిరసించు సుమీ!
బమ్మను నే నని యప్పుడె
బ్రమ్మరియై చెడును గాని తిరుగఁడు వేమా! 422

ఆ. కూళకూళ్లమేయు గుణవంత చెడనాఁడు
నెట్టివారు మెచ్చ రట్టివాని
కొయ్య దూలమునకుఁ గుదురునా జ్ఞానంబు, వి.

ఆ. కైపు మీఱువేళఁ గసను జేరఁగరాదు
అనువు దప్పి మాటలాడరాదు

సమయమెఱుఁగనతఁడు సరసుండుగాఁడయా, వి.

ఆ. కొండగుహాలనున్నఁ గోవెలలందున్న
మెండుగాను బూదిమెత్తియున్న
దుష్టబుద్ధులకును దుర్బుద్ధి మానునా?, వి. 425

ఆ. కొండముచ్చుపెండ్లి కోఁతి పేరంటాలు
మొండివానిహితుఁడు బండవాఁడు
దుండగీడునకును గొండెఁడు పతివాయి, వి.

ఆ. కోఁతిఁ బట్టితెచ్చి క్రొత్తపుట్టము గట్టి
కొండముచ్చులెల్లఁ గొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యు లుందురు, వి. 427

ఆ. కొండెకాఁడు చావఁ గొంపవాకిటికిని
వచ్చిపోదు రింతె వగపులేదు
దూడవగచునె భువి తోడేలు సచ్చిన, వి...428

ఆ. గంగ పాఱుచుండు కదలనిగతితోడ
ముఱికి వాగుపాఱు మ్రోఁతతోడ
అధికుఁ డోర్చునట్టు లధముఁ డోర్వఁగలేఁడు, వి.

ఆ. గాడ్దె యేమెఱుంగు గంధంపువాసన
కుక్క యేమెఱుంగు గొప్ప కొద్ది
అల్పుఁ డేమెఱుంగు హరుని గొల్చువిరక్తి, వి...

ఆ. గుణికి విద్య భువిని గోరంత యబ్బినఁ
గొండ యగును వానిగుణము చేత
కొండయంతవిద్య గుణహీనుఁ డెఱుఁగఁడు, వి.

ఆ. గుజ్జుమునకుఁ దగినగురుతైన రౌతున్న
గుజ్జుము లిల నడుచు గుణముగాను
గుర్తు దుర్జనులకు గుణము లిట్లుండురా, వి...

ఆ. గోఁచి యూడె ననుచుఁ గోఁతియాటల నాడి
వెఱ్ఱియోగి నూరువెడలమండ్రు
ఎవరిగోఁచులూడ పెప్రొద్దుగ్రుంకిన? వి... 433

ఆ. చంద్రునంతవాఁడె శాపంబుచేతను
కళల హీనమందఁగలేఁగఁ గదర
పుడమి జనులకెల్ల బుద్ధు లిట్లుండురా, వి...

ఆ. చెట్టుచేమఁ గొట్టి చుట్టుగోడలఁ బెట్టి
ఇట్టునట్టుఁ బెద్దయిల్లుఁ గట్టి
మిట్టిపడునునరుఁడు మీఁదిచేటెఱుఁగఁడు, వి...

ఆ. చెఱకులోనవైనఁ జెడ్డగుణంబున్న
తీసివేయకున్న తినఁగఁబోసఁగ
వంతిపురపుద్రోహి యాలెఁ దెట్లుండురా? విశ్వ.

ఆ. చదువులన్ని చదివి చాల వివేకియై
కలుషచిత్తుఁడైన ఖలునిగుణము
దాలిగుంటఁ గుక్క తలఁచిన చందమౌ, వి...

ఆ. చంపఁగూడ దెట్టిజంతువున్నను
చంపవలయు లోకశత్రుగణముఁ
దేలుకొండిగొట్టఁ దేలేమిచేయురా? వి... 438

ఆ. చంపఁదలఁచురాజు చన వర్గలం బిచ్చు
చెఱుప నున్నపగఱ చెలిమి సేయుఁ
గఱవ నున్నపాము నెత్తిగాఁచుకొనియుండు, వి.

ఆ. ఛర్ది పుట్టినప్డు సాపడ సైఁపదు
నాతి గన్నయప్పు నీతి తగదు
చేటు మూడినపుడు మాటలునోపవు, వి...440

ఆ. జెట్టి సాముఁజేసి తితిలోనఁ జేరెత్త
దుష్టతెలివిచేత దొలఁగు తెలివి
కష్టమొకటిగాని కడతేఱుటా లేదు, వి... 441

ఆ. జంకులేనిమదిని జగదీశునుంచిన
మంకుబుద్ధిమాని మట్టుపడును
పంకమందుఁ బురువు పడి పొర్లుచుండదా? వి...

ఆ. జగడ మాడుచుండుఁ జాడీలకో రెడ్డు
సాధుజనుల మీఁఱి బాధపెట్టు
యముఁడు తప్ప వెఱ్ఱు రంపఱు వానికి, వి...

ఆ. టక్కరులను గూడి టెక్కుసక్కెములాడ
నిక్కమైన ఘనుని నీతి చెడును
ఉల్లితోటఁ బెరుగుమల్లెమొక్కకరణి, వి... 444

ఆ. డెంపమందుఁ వలఁచు డెప్పర మెప్పుడు
నోర్వలేనిహీనుఁ డొరునికట్టె
తనకు మూఁడుసుమ్తి తప్ప దెన్నటికైన, వి...445

ఆ. తనకుఁ గలుగు పెక్కు తప్పు లటుండఁగా
పరులనేరుచుండు నరుఁడు తెలియఁ
డోడలెఱుంగఁడనుచు నొత్తిచెపఁగవచ్చు,వి...

ఆ. తనకు మేలుఁ జేయఁ దాఁ దెలియఁగనేర్చు
నెలమితోడ గుక్క యెఱుక భువిని
తనకుఁ జేయుమేలు తాఁ దెలియఁగలేని
మనుజుఁ డెంతఖలుఁడొ ? మహినివేమ. 447

ఆ. తనర నృపతితోడఁ దగ దుర్జనునితోడ
నగ్నితోడఁ బరునియాలితోడ
హాస్యమాడు పెల్ల నగును బ్రాణాంతమ్ము,వి...

ఆ. తనయుఁ డోదవె ననుచుఁ దాఁ బొంగుచుండును
వాఁడు దుష్టుఁడైనఁ గోడుగూర్చుఁ
దులువవాండ్రఁగూడి మెలఁగనీఁడురా,వి...

ఆ. తేలునకు నిఁకెంత తెలియఁగొండి విషంబు
ఫణికి నుండు విషము పండ్లయందు
తెలివిలేనివాండ్ర దేహ మెల్లవిషంబు,వి... 450

ఆ. తొత్తు తొత్తెగాని దొరసాని గాఁబోదు
అడచు టింతె దానికైన ఫలము
మిత్తికూళ్లదొంగ మేలు నెన్నెఱుఁగురా? వి.

ఆ. దిక్కులేనివాని దీనతఁ బాపిన
పురుషుఁ డిహమునందె పూజ్యుఁడగును
పరమునందు వానిభాగ్య మేమనవచ్చు,వి...452

ఆ. దాసరయ్య తప్పు దండంబుతో సరి
మోసమేది తన్ను ముంచకున్న
నీచుఁడై చెడు నటు నీచులనమ్మిన, వి... 453

ఆ. దుండగీడుకొడుకు కొండీఁడు చెలికాఁడు
బండరాజునకును బడుగుమంత్రి
కొండముచ్చునకును గోతియె సరియగు, వి...

ఆ. దుష్టజనులు మీఱి తుంటరిపనులను
శిష్టకార్యములుగఁ జేయుచుంద్రు
కూడ దనెడివారిఁ గూడ నిందింతురు, వి... 455

ఆ. దూరదృష్టిఁ గనరు తూగినపనుకను
బొఱుపట్టెఱుఁగరు పడినదనుక
దండసాధ్యు లరయ ధర్మసాధ్యులుగారు, వి...

ఆ. దొడ్డవాఁడ ననుచు దొరలదగ్గఱఁజేరి
చాడి చెప్పు పాపజాతినరుఁడు
చాడిచెప్పువాఁడు సాయుజ్యమందునా? వి....

ఆ. దొంగతనమువలన ద్రోహమెంతయుఁ జేసి
యెవ్వ తెరుఁగకుండ నిముడుకొన్నఁ
దానము చేయుపనుల తగులుకోకుందుహా, వి....

ఆ. ద్రోహియైన వాఁడు సాహసంబున నెట్టి
స్నేహితునికి నైనఁ జెఱుపు సేయు
నూహఁ గలిగియుండు నోగుబాగులు లేక, వి.

ఆ. నేరనిజనులకు నేరముల్ నేర్పుచు
చక్కఁచేయ రిల నసాధు లెపుడు
ఒప్పుదుర్జనములు తప్పుగ నెంతురు, వి... 460

క. నేరము లెంచెడిప్రభువును
చేరఁగరాదయ్య నెపముఁ జెచ్చెర దెచ్చున్
వారాశిదాఁటినను శని
మారకుఁడై పట్టిచంపు మహిలో వేమా. 461

ఆ. నొసలు బత్తుఁడయ్యె నోరు తోడేలయ్యె
మనసు భూతమువలె మలయఁగాను
శివుని గాంతు ననును సిగ్గెట్లు గాదురా? ...462

ఆ. పట్టనేర్చు పాము పడగ నోరగఁ జేయుఁ
జెలుపఁజూచువాఁడు చెలిమిఁజేయు
చంపఁదలఁచురాజు చనువిచ్చుచుండురా, వి...

ఆ. పరఁగ రాతిగుండు పగులఁగొట్టఁగవచ్చు
కొండలన్ని పిండిగొట్టవచ్చు
కఠినచిత్తుమనసు కరిగింపఁగారాదు, వి.... 464

ఆ. పరులఁ దిట్టినంతఁ బాపకర్మం బబ్బు
విడువ దెన్నటికిని విశ్వమందు
పరుఁడు పరుఁడుగాఁడు పరమాత్మయౌనయా, వి

ఆ పరులు చదువఁజూచి నిరసనబుద్ధితో
పట్టిమాటలాడు వదరుబోతు
అట్టిఖలుని జూడ లరయుట దోసము, వి...466

ఆ. పాల నీడిగింటఁ గ్రోలుచు నుండిన
మనుజు లెల్లఁ జూచి మద్యమండ్రు
నిలువఁదగనిచోట నిలువ నిందలు వచ్చు, వి...

ఆ. పాలుపంచదార పాపరపండ్లలో
చాలఁబోసి వండఁ జవికిరావు
కుటిలమానవులకు గుణమేలగల్గురా, వి... 468

ఆ. పురుషుఁ డెంతయున్న పుట్టువు మొదలుగా
పాపచింతఁ జేయుపాపి నరుఁడు
మహిని కుంటికుక్క మాంసము దిన్నట్లు, వి...

ఆ. బిడియ మింతలేక పెద్దను నే నంచు
పొంకములను బల్కు సంకరునకు
ఎచ్చు కలుగ దిచటఁ జచ్చిన రాదట, వి ...

ఆ. భాష లాడనేర్చి పలుమోసములు సేసి
గ్రాసమునకు భువిని ఖలుఁడ వైతి
దోసకారి నీకు దొరకునా మోక్షము? ... 471

ఆ. మనసునఁ గృపలేని మాలలకొడుకుల
యొద్దఁ జేరినట్టియోగు లెల్ల
పనసకొడుకు చెంచుపడుచులచందమా, వి...

ఆ. మాటలాడు టొకటి మనసులో నొక్కటి
యొడలిగుణ మదొకటి నడత యొకటి
యెట్లుకలుగుముక్తి యిట్టులుండఁగ తాను, వి...

ఆ. ముష్టి వేపచెట్టు మొదలుగా ప్రజలకు

పరఁగమూలికలకుఁ బనికివచ్చు
నిర్దయుండుఖలుఁడునీచుఁడెందులకగు, వి... 474

ఆ. రామనామపఠనచే మహి వాల్మీకి
పాపి బోయఁ డయ్యెఁ బాపఁ డయ్యె
కులము ఘనము గాదు గుణమే ప్రధానము, వి.

ఆ. రేగుపచ్చకాయ రేయెల్లఁ దన్నిన
ముఱిగ దంతకంత బెరుగుఁ గాక
ఒరులు ఛీ యన్నను నోగు సిగ్గెఱుగునా? వి...

ఆ. లేనికాలమునకు లేనిమానమునొందు
ఈనినపులిరీతి నెఱుఁగకుండు
కఠినబుద్ధి కిందు కలి మెటు కలుగును? వి... 477

ఆ. వంపుకఱ్ఱఁ గాచి వంపు దీర్పగవచ్చు
కొండ లన్ని పిండిగొట్టవచ్చు
కలుషచిత్తుమనసు కరిగింప నగునొకో, వి... 478

ఆ. వల్లకాళ్లు దున్ను వాగు లడ్డమురాఁగ
తుమ్మకంప దుచ్చి త్రోసిఁ గట్టు
దండుగైనఁబెట్టు ధర్మానకోర్వఁడు, వి... 479

ఆ. వాక్కుశుద్ధిలేని వైపగుదండాలు
ప్రేమ కలిగినట్టు పెట్టనేల
నోసల బత్తిఁ జూపు నోరు తోడేలయా? వి.

ఆ. వాడ కుఱికి తిట్టు వలదన్న మొఱపెట్టు
ముందు మగనిఁ దిట్టు ముసుఁగుపెట్టు

గడుసురాలు మగని గంపతో నమ్మురా, వి. 481

ఆ. వింతచదువుఁ జదువ వివరింపఁగాలేదు
హీనుఁ డవగుణంబు మానలేదు
బొగ్గు పాలఁ గడుగఁ బోవునా మలినంబు? వి.

ఆ. వేముఁ బాలుబోసి వేయేండ్లు పెంచినఁ
జేదు విడచి తీపిఁ జెంద దెపుడు
నోగుగుణము వీడి యుచితజ్ఞుఁ డగునెట్లు? వి. 483

ఆ. వేలుపురుగు చేరి వృక్షంబుఁ జెఱుచును
చీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచు
కుచ్ఛితుండు చేరి గుణవంతుఁ జెఱచును, వి. 484

ఆ. శుష్కబుద్ధిచేత శుశ్రూష లొల్లని
నిష్ఠఁబట్టి యేమి నిజ మెఱింగె
కష్టమైనవిద్య ఖలులకు నబ్బునా? వి. 485

ఆ. సజ్జనస్నేహముఁ జాలింపఁగా రాదు
ప్రకృతి నెఱుఁగకున్న భక్తిలేదు
పలువ లెట్టిరీతి భక్తి నిల్పుదురయా, వి. 486

ఆ. సారవిద్యలందు సరణి దెలియలేక
దూరమందుఁ జేరు దుర్జనుండు
పరముఁ దెలియ నతఁడు భావజ్ఞుఁ డెట్లగు? వి.

ఆ, హీనమనుజులతోడ నింతులతోడను
పడుచువాండ్రతోడఁ బ్రభువుతోడఁ
బ్రాజ్ఞజనులతోడఁ బలుకంగ రాదయా, వి. 488

## సజ్జనపద్ధతి.

ఆ. అచట నిచటఁ జూడఁ జమరఁగా గురుభక్తిఁ
ప్రచురముగను నాత్మ బయలు చేయు
రుచిరముగను సుజనుఁ డచలమై కన్పడు, వి.

ఆ. అంటి యంటకుండు నమలుని తెఱఁగున
మింటిమింటినడుమ మెలఁగుచాని
నొంటిస్తంభమందు జంటించి చూచును, వి. 490

ఆ. అండ దప్పిన నరుఁ డతిధార్మికునియిల్లు
చేరవలయుఁ బ్రదుకఁజేయు నతఁడు
ఆవిభీషణునకు నతిగౌరవం బీడె? వి... 491

ఆ. అడుగడుగునఁ జిత్ర మఖిలవస్తువులను
భోగభాగ్యములను బొలుపు మిగుల
తానె తిరుగుచుండు తనతోడునీడయై, వి...

ఆ. అంతరంగ మెఱుఁగ హరుఁ డౌను గురుఁడౌను
అంతరంగ మెఱుఁగ నార్యుఁ డగును
అంతరంగ మెఱిఁగినతఁడెపో శివయోగి, వి...

తే. అంతరాత్మను గుర్తించి యాశ లుడిగి
చింతలను ద్రొక్కి మదియందు సిద్ధుఁ డగును
వింతలను జూచి భ్రమయఁడు వెఱ్ఱివలెను
సందుగొందుల పూర్ణత నందు వేమ. 494

తే. అంతరాత్మానుభవ మంది యార్యమతిని
సంతతార్చన మది నిష్ఠ సలుపఁ గోరి

పంతు కెక్కినవాఁడె పో వరుఁ డనంగ
వానికెవ్వఁడు సరి గానరాఁడు వేమ. 495

తే. అతులవైరాగ్యబోధోపరతుల నెఱిఁగి
సతులవలపునఁ జిక్కక సత్య మెఱిఁగి
మతిని జెదరక పట్టుట మాన్యరీతి
ఇద్ది కుదిరినసజ్జనుఁ డిలను వేమ. 496

ఆ. అధిహితమగునట్టు లాడినమాటకు
సంతసింతు రెల్ల సత్పురుషులు
అధికభాషణంబు లాయాసదంబులు, వి.... 497

ఆ. అనల మించుకైనఁ గనలి మండును గాని
చనువుగాని యెఱుక మనికి విడదు
తనువు మఱచువాఁడె తత్త్వజ్ఞుఁడగునుమీ, వి.

ఆ. అనువు గానిచోట నధికుల మనరాదు
కొంచె ముండుటెల్ల కొదువకాదు
కొండ యద్దమందుఁ గొంచెమై యుండదా? వి.

ఆ. అన్యులకును వచ్చు నాపదఁ దనదిగా
నెన్నువాఁడు భువిని నున్నవాఁడు
ఎన్ని దానిలోనియిహపరంబుల లెస్స
గన్నవాఁడు మిగుల ఘనుఁడు వేమ. 500

ఆ. అమలమైనపలుకు లభిషేకవారిధి
తనువు దేవళంబు తాల్మి నొంది
ఆత్మ శివుని జేర్చు నాతఁడే శివయోగి, వి...501

ఆ. అలలు లేనిజలధివలె నుండి మదిలోన
తెలివిగూడి తన్ను తెలియునతఁడె
తలఁప సజ్జనుఁ డన ధరఁ జెప్పఁబడునయా, వి.

ఆ. అల్పుఁ డెన్నిపలుకు లలయక పల్కిన
నధికుఁ డూరకుండు నడిరిపడక
కంచు మ్రోఁగునట్లు కనకంబు మ్రోఁగునా? వి.

ఆ. అసువినాశ మైన యానందసుఖకేళి
సత్యనిష్ఠపరుని సంతరించు
సత్యనిష్ఠఁ జూడ సజ్జనభావంబు, వి... 504

ఆ. ఆత్మనున్నవాని ననుదినంబును జూచి
యతనిమహిమవలన నతనుఁ దెలియు
నతఁడు సజ్జనుండు నవనీతలంబున, విశ్వ... 505

ఆ. ఆత్మశుద్ధి గలిగి యధికుల మనఁబోరు
ధీరవృత్తి గలిగి తిరుగఁబోరు
రూపు కుదురనుంచి రూఢి గావింతురు, వి...506

ఆ. ఆదిశక్తి గూడి యనుభవ మొందును
వేదవిద్య మఱఁగి విడువఁబోఁడు
సాధువృత్తి విలను స్థైర్యము నొందును, వి...

ఆ. ఆర్యు లైనవార లనుభవరూఢిని
తెలియఁ జెప్పుచుంద్రు తేటపడఁగ
గుఱుతుఁగననివాఁడు గుఱి యెప్పుఁ జెప్పునా? వి.

ఆ. ఆడితప్పువార లభిమానహీనులు
గో డెఱుఁగనివారు కొద్దివారు
కూడి కీడుసేయఁ గ్రూరుండు దలపోయు, వి...

ఆ. ఇల్లు కొల్లఁజేయ రిహపరములఁజూచి
దీనవృత్తిచేతఁ దిరుగుచుంద్రు
భక్తి కలిగియుండి ప్రాజ్ఞులౌ సజ్జనుల్, వి...510

తే. ఉక్కుగత్తిని చేఁబూని యున్నవాఁడు
కుక్కనక్కలు బెదరింపఁ గొంకుపడఁడు
దృక్కుదృశ్యంబులను మించ తెలియుచుండు
చక్కగా నొప్పుమనమున జరుగు వేమ 511

ఆ. ఋషులు గానిపింత్రు హీనులయట్టుల
వారిబోధ పెద్దమేరువంత
లోన నున్న యట్టిజ్ఞానంబుమహిమరా, వి....

ఆ. ఎండచీఁకటులకు నిమ్మాయినుండెడు
నిండుకుండలోన నిద్ర మఱచి
పండిగాను పరమతత్త్వంబుఁ దెలియును, వి...

ఆ. ఏకమైనవర్ణ మెఱిఁగినయోగికి
పరము నెఱిఁగి చూడ భావ మొందు
నాకృతులను జేరి యన్నిటఁ దానౌను, వి...514

ఆ. ఒకటిక్రింద నొక్కటొగి గుణకముఁ బెట్టి
పరగున గుణియింప బరుసఁ బెరుగు
నట్టిరీతి గుణులు నరయ సజ్జనులీల, వి... 515

ఆ. ఒక్కమనసుతోడ నున్నది సకలము
తిక్కఁబట్టి నరులు తిరుగుచుంద్రు
ఇక్క నెఱిఁగి నడవ నొక్కఁడె చాలఁడా? వి...

ఆ. ఓగుబుద్ధి విడిచి యోగి గావలెఁ జుమీ
భోగ మమరు యుక్తిఁ బూనరాదు
సద్గుణంబు మొదలఁ జవి గాని చూడరా, వి...

తే. ఓర్పు లేనట్టివారల కోరులయశము
విన్న కోలఁదిని బెంపొందు వెఱ్ఱితెవులు
దానిపరిహారమునకు నై మానవుండు
తమఘనంబును చాటింత్రు ధరణి వేమ. 518

ఆ. ఓర్పు లేనిభార్య యున్న ఫలం బేమి
బుద్ధి లేనిబిడ్డ పుట్టి యేమి
సద్గుణంబు లేనిచదువరి యేలరా? విశ్వ... 519

ఆ. కంటిదృష్టిచేతఁ గను విశ్వ మెల్లను
దర్పణంబు గల్గఁ దన్ను గనును
నాత్మతత్త్వమార్గ మారీతిఁ గనవలె, వి. 520

ఆ. కంటిలోన మిన్ను కలయిక నగుముక్తి
నంటి తిరుగువాఁడె యమలుఁడగును
వంటకంబుకొఱకు వార్ధాటిఁ జూపఁడు, వి...521

ఆ. కంటిలోనివాని గఱకంఠు నెఱుఁగుము
కంటిలోనివాని మింటఁ జూడు
కన్ను మిన్ను హృదయకమలమం దెఱుఁగుము, వి.

ఆ. కడఁగి గాలిలేని గగనంబుభంగిని
బలుతఱగలు లేనిజలధిమాడ్కి
నిర్వికారమునను నిశ్చలుఁడై యుండు, వి....523

ఆ. కడుపుచిచ్చుచేత కామానలముచేత
క్రోధవహ్నిచేఁ గుతిలపడక
యుక్తమనసుతోడ నుండును సుజనుఁడు వి.524

ఆ. కడుపుకేల మీరు కళవళపడెదరు
కడుపుచల్లవడఁగఁ గలదు భుక్తి
కడకు రాతిలోనికప్పకు లేదొకో? విశ్వ... 525

ఆ. కనులు పోవువాఁడు కాళ్లు పోయినవాఁడు
ఉభయు లరయఁ గూడి యుండినట్లు
వేదవేదఁ గూడి పెనఁగొని యుండును, వి...

ఆ. కప్పవీడి మనసు కాంతిఁంప దెద్దియు
జ్ఞానతపము నూని కదలకుండు
మెచ్చునాత్మక్రమము మిన్నంటి యుండును, వి..

ఆ. కామమోహములను గలిగియుండు నరుండు
ఇష్టదేవగురుల నెఱుఁగలేఁడు
ఇష్టు నెఱుఁగునతఁడె ఇలసజ్జనుం డగు, వి...

క. కాలము తెలియక చాలఁగ
కాలము గల దంచునున్న కాలమునందున్
కూళఁడు తనుఁ దాఁ దెలియఁడు
కూలెడు తొలిజాములందు గొబ్బున వేమా!529

ఆ. కాలునికిని జిక్కి కక్కసపడ నేల
మేలుగాను గురుని మెప్పు వడసి
ప్రాలుమాలకుండ పరమార్థ మందుము, వి....

ఆ. కూళ కూళ మెచ్చు గుణవంతు చెడనాడు
నట్టిహీను మెచ్చ రెట్టివారు
మ్రానిదూలమునకు జ్ఞానంబు దెలియునా? వి...

ఆ. కూళతోత్తుపొందు కుజనునకే కాక
సజ్జనునకుఁ గాదు సమ్మతంబు
పేడఁ దిన్నపురుగు బెల్ల మే మెఱుఁగును? వి...

ఆ. కూర యుడుకు వెనుకఁ గూడునా కసవేర
నెఱుకగల్గి మును పె యేరవలయు
స్థలము తప్పు వెనుక ధర్మంబు పుట్టునా? వి...

ఆ. కోటిదాన మిచ్చి కోపంబు నొందుచోఁ
బాటిసేయ రతనిఁ బ్రజలు మెచ్చి
సాత్త్వికగుణముల సజ్జనుం డగు నయా, వి...

ఆ. కొంపలోన నున్న కోర్కుల భేదించి
పరఁగ హృదయ మట్టె పదిలపఱచి
గృహము నిల్పువాఁడు బహుతత్త్వవేదిరా, వి.

ఆ. కోపమునను ఘనత కొంచెమై పోవును
కోపమునను గుణము కొఱతపడును
కోపమునను బ్రదుకు కొంచెమై పోవును, వి...

ఆ. ఖలులు తిట్టిరంచు కలవరపడనేల
వారితిట్ల నేమి వాసి చెడును
సజ్జనుండు తిట్ట శాపం బదౌనయా, వి. 537

ఆ. గంగిగోవుపాలు గంటెఁడైననుజాలుఁ
గడవెఁడైన నేమి ఖరముపాలు
భక్తి గలుగుకూడు పట్టెడైనను చాలు, వి...

ఆ. క్రొవ్వుపాట్టిపారలుఁ గ్రూరకర్ములు పొరల్
నొవ్వఁ జేసినట్టిరవ్వపొరలు
ఎవరివైన నేమి యినజువాఁకిటఁగాక
యవ్వలికిని బోవునటర వేమ. 539

ఆ. గట్టిసాధువిద్య కాసంతె యనుకొని
గాఢవిద్య నేర్చి కనుము ఘనత
సాధుసజ్జనముల సాంగత్య మెఱుఁగుము, వి...

ఆ. గుణగణంబు లెల్లఁ గుచ్చితమును బొంద
తగిలి భ్రమలఁ జిక్కి దండధరునిఁ
దోడి తెచ్చుఁగదర తొలఁగింపకున్నను, వి...

ఆ. గుణములు గలవాని కులమెంచఁగా నేల
గుణము కలిగనేని కోటి సేయు
గుణము లేకయున్న గ్రుడ్డిగవ్వయు లేదు, వి...

ఆ. గుణము కల్గియున్నఁ గులసతి నెవ్వారు
నిందఁ జేయలేరు నీతిఁ జూచి
గుణము లేకయున్నఁ గులహీనురాలయా, వి...

ఆ. గుణయుతునకు మేలు గోరంతఁజేసినఁ
గొండయగును వానిగుణముచేత
కొండయంత మేలు గుణహీనుఁ డెఱుఁగునా? వి.

ఆ. గుణముతీరు లేక కులమెల్లఁ జెడిపోయె
స్త్రీలనడతవలన సిగ్గుపోయె
చవిటినేలవలన జలమెల్ల చెడిపోయె, వి...545

ఆ. గురువు వచ్చుచున్నఁ గూర్చుండి లేవని
తుంటరులకు నెట్లు దొరకు ముక్తి
మగని లెక్కగొననిమగువకు గతియున్నె? వి...

ఆ. గువ్వకొఱకు మేనుఁ గోసి యాశిబిరాజు
వార్త విడువరాక కీర్తికెక్కె
నోగు నెంచఁ బోవ రుపకారి నెంతురు, వి...547

ఆ. చిత్తశుద్ధి యొకటి శ్రేష్ఠలాంఛన మగు
నిఖిలపుణ్యకార్యనిర్వహణము
సద్ది లేక చేయ ననువుగా దేరికి, విశ్వ... 548

ఆ. చిన్నెలంతె కాని సృష్టి లౌకిక మగు
నందువల్ల నేమి యాశ కద్దు
ఒక్కఁడైనవాఁడె యుత్తమపురుషుండు, వి...

ఆ. చెడ్డవాని మిగులఁ జెఱుచును దైవంబు
అడ్డపడఁడు వాని కాపదైన
చెడ్డచేనుఁ జూచి రెడ్డి తా మెచ్చునా? వి.

ఆ. చెడిన మానవులను జేపట్టి రక్షించి
కడకుఁ జేర్చునట్టి ఘనులు తలఁప
విబుధజనులు గాంత్రు విశ్వేశుసన్నిధి, వి...551

క. చేకొని పరోపకారం
బేకొలఁగా మహిమ లెల్ల నెఱిఁగెడువిధమై
ధీకాదికులను జేయును
సాకారముగాఁగ నతఁడు సాధువు వేమా. 552

ఆ. చేకొనుచును తమకు చేసాచి నంతలో
చెడినప్రజల రక్ష సేయకున్న
తనదు సాగు టేమి తనతనువది యేమి,వి...553

ఆ. చచ్చువారిఁ జూచి చావని పుట్టని
తత్త్వ మెల్ల నాత్మఁ దలఁపుఁ జేసి
యరసి చూచినట్టియతఁడె పో సుజనుఁడు, వి...

ఆ. చదివినయ్యకన్న చాకలయ్యే మేలు
గృహము వెల్పుకన్న గేదె మేలు
బాపనయ్యకన్న బైనీఁడు మేలయా, వి... 555

ఆ. చదువులన్ని చదివి చాలవివేకియై
కపటి కెన్నఁడైనఁ గలదె ముక్తి
నిర్మలాత్మకునకె నిశ్చలంపుసమాధి, వి... 556

ఆ. చంపఁదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చాలు, వి... 557

ఆ. చూడఁగానుము దొడఁగు సుజ్ఞానమెల్లను
పారవేయుమెల్ల పాపగుణము
దారిఁ దెలియ బుధుల దాపున మెలఁగుము, వి....

ఆ. చదలుభంగిఁ గంద్రు సాధువు మూఢులు
తాను వారనట్టె కానగును
దీని కెంతపనో దానికి నిదియంతె, వి... 559

ఆ. చాయ నొసఁగు చెట్లు సాధువు బోధలు
అడిగి దరిని జేరఁ బడయవచ్చు
నట్టు నిట్టుదాఁట నదిపోవ దిది రాదు. వి...560

ఆ. జఠరమందు జ్యోతి చాల దేదీప్యము
కానలేరు నరులు కలుషమతులు
కన్ను విచ్చిచూచు ఘనుఁడగును జనుఁడు, వి ...

ఆ. జనుఁడు తేటవినొంద చంచలింపదు మది
దయయు నీతిగలుగఁ దగులుబుద్ధి
తీవ్రరుభానుఁజూచి తిమిరంబునిల్చునా? వి...562

ఆ. జక్కి నక్కి వీథిఁ జక్కగా వెలువడఁ
గుక్క లన్ని వెంట కూయఁదొడఁగు
ఘనుని కోర్వలేని కాపురుషులు నిట్టె, వి...563

ఆ. డాగుపడిన వెనుక డాఁగ నశక్యము
అరసి చేయుమయ్య యన్ని పనులు
తెలియకున్న నడుగు తెలిసినవారిని, వి.... 564

ఆ. తట్టునెక్కి తిరుగ నట్టె నేటయ్యెనా
యెపుడొ క్రిందఁబడిన నేదొ విలుగు
చెల్లియుండి యోర్పుఁ జెందిన భూమింత్రు, వి.565

ఆ. తండ్రికన్న సుగుణి తనయుఁడై యొప్పెనా
పిన్న పెద్దతనము లెన్న రెవరు
వాసుదేవు విడిచి వసుదేవు నెంచిరా? వి...566

ఆ. తనసతి నపథమునఁ దనుదానె చొనుపఁగా
సాటిపూరుషుండు సరగు దెలుప
నెఱుఁగలేనినరుఁడు నరమాత్రుఁడును గాఁడు,వి.

ఆ. తనను బోలె నవియు ధరఁ బుట్టినవి కావొ
పరఁగఁ దన్నుఁబోలి బ్రదుకుఁ గాదె
జ్ఞాని జ్ఞానిఁ జంపఁ గారణ మేమిరా? వి...568

ఆ. తప్పు లెన్నువారు తండోపతండము
లుర్వి జనులకెల్ల నుండుఁ దప్పు
తప్పులెన్నువారు తమతప్పు లెఱుఁగరు;వి...569

ఆ. తమకుఁ గలుగు పెక్కుతప్పు లటుండఁగా
నొరుల నేర మెంచు టొప్పు గాదు
చక్కిలంబు విడచి జంతిక లేరుటా? వి... 570

ఆ. తల్లి కెదురుకొనుట తండ్రి కెదురుకొనుట
యన్న కెదురుటయును ననఁగ మూఁడు
పాతకముల నెఱిఁగి వర్జింపఁగావలె, వి... 571

ఆ. తివిరి లేమియింటి తెరువ రేమెఱుఁగును
తెచ్చుఁబెట్టి నెత్తి మొత్తుఁగాని
ప్రథితధర్మ మధమభట్టు లెఱ్గుదురొకో? వి...

ఆ. తేనెతెరలజాడ తేనెటీఁగ యెఱుంగు
సుమరసంబుజాడ భ్రమర మెఱుఁగు
పరమయోగిజాడ భక్తుఁ డెఱుంగును, వి... 573

ఆ. దూలముల న కెక్కి దొమ్మరిగడ నెక్కఁ
జాలుదు నన డెప్పు సజ్జనుండు
వీలుమాలుపనుల వెఱ్ఱియై చేయునా? వి...

తే. దేవతార్చన జపతప స్తీర్థయాత్ర
దానధర్మక్రతువులును దలఁచి చూడఁ
బుణ్యసాధనవృత్తులు పుడమిలోన
కల్మషము లేనిహృదయము కలుగ వేమ! 575

ఆ. దోషరాశిఁ బుట్టి దోషంబుఁ దెలియక
దూషణములు సేయుదుష్టజనులు
నరకకూపమందు నాటియుండెదరయా, వి...

ఆ. ధార్మికునకుఁ గాని ధర్మంబు గనరాదు
కష్టజీవి కెట్టు కానఁబడును
నీరు చొరమి లోఁతు నిజముగా తెలియదు, వి.

క. నది నుదకంబులు చనుక్రియ
మదిఁ బొడమెడుతత్త్వవిధులమహిమాన్వితులై

పృథివిని గలనరు లాదవఁగఁ
బదపడి సద్గతుల నొంద బాగగు వేమా. 578

ఆ. నీచగుణము లెల్ల నిర్మూలమై పోవు
కొదవ లేదు సుజనగోష్ఠివలన
గంద మలద ఘేనికం పడంగినయట్లు, వి... 579

ఆ. నేర నన్నవాఁడు నెఱజాణ మహిలోన
నేర్తు నన్నవాఁడు వార్త కాఁడు
ఊరకున్నవాఁడె యుత్తమోత్తముఁ డయా, వి.

ఆ. పరగ ఋషులు భువిని పరమపవిత్రులై
మించి లోకమునకు మేలుఁ జేయ
సంచితార్థములను సమసింపఁ జేయరే, వి...581

ఆ. పట్టరానిపట్టుఁ బట్టి యుండినవాఁడు
పుడమిలోన కీర్తిఁ బొంద లేఁడు
సుగుణలక్షణముల సుజ్ఞాని యౌనయా, వి...

ఆ. పదిలపడఁగ మనసు పట్టనేరనివాఁడు
కదియఁబోఁడు పూర్ణ కలితుఁడుగను
గుదురుకొనెడివాఁడు కోవిదుఁడగునయా,వి...

ఆ. పాలు పెరుఁగు నేయి పరగు నన్నము తిని
స్త్రీలఁ గననివాఁడు శీలవంతుఁ
డొక్కఁడైనవాఁడె యుత్తమశివుఁడయా,వి...

ఆ. ఫక్కి దెలిసి పలుక నొక్కవాక్యమె చాలు
పెక్కులేల వట్టి ప్రేల్పులేల

దిక్కు కలిగి మ్రొక్క నొక్కటి చాలదా? వి.

ఆ. మఱతు నేమొ యనుచు మది సుజనుం డెప్డు
నెవరొనర్చు మే లదెంత దైన
మాఱుమేలుఁ జేసి మర్యాదగాంచును, వి...586

---

## దైవపద్ధతి.

---

ఆ. అండమందు నుండు నఖిలమాజనులార
ఎందు లేకయుండు నెఱుఁగుఁ డతఁడె
యతనిపూజఫలము నందెనా శివయోగి, వి...

ఆ. అందు నిందు నుండు నఖిలుండు చూడఁగా
నెందు దానె నిండి యెఱుఁగుచుండు
నతనిపూజఫలము నందఁగవలె నయా? వి...

ఆ. అల్పుఁ డైనను నేమి యధికుఁ డైనను నేమి
చెప్పవలయురీతిఁ జెప్పినాఁడ
హరుని యెఱుకలేక యాకు లల్లాడునా? వి...

ఆ. ఆకుమీఁది వ్రాఁత యందఱికిఁ దెలియుఁ
జేతిలోనివ్రాఁతఁ జెప్పవచ్చు
తోలుక్రింది వ్రాఁత దొడ్డవాఁడెఱుఁగునా? వి.

ఆ. ఆకులందుఁ జదివి యందఁగ రానిది
ఏక మమర యుక్తి నెఱుఁగవలయు
దాకి పూర్తిగాను తన్మయమొందుఁడీ, వి...591

ఆ. ఇంటియింటిలోని యీశ్వరు నెఱుఁగక
అంటిచూడలేక యడవులందు
నుండఁ గోరుదైవ ముండనీయఁడు వాని, వి...

ఆ. ఇయ్యనతని చేత నిప్పించుతనప్రాప్తి
ఇచ్చువాని చేత నీయనీదు
ఇయ్యఁ గైకొనంగ నీశ్వరుఁడే కర్త, వి... 593

ఆ. ఇష్టలింగ మేది యిల శిల లింగంబె
నిష్ఠమీఱ మెడను నీల్గఁ గట్టి.
కష్టపడుటగాని కలుగదు దైవము, వి... 594

ఆ. ఈనినట్టిపులిని బూని చంపఁగవచ్చు
మనసు మర్మ మరసి కనఁగవచ్చు
దైవమాయ తెలియఁతన కసాధ్యం బగు,వి...

ఆ. ఉదకమందు పాచి యున్నది చూడరా
మదిని నున్న మాయ మట్టుపడక
సదనమందు బ్రహ్మ సాక్షిగా నెంచును,వి...

ఆ. ఉన్నవార లెవరొ చన్నవా రెవ్వరో
కన్నవార లెవరొ కానరారు
ఉన్న చన్న కన్న నొక్కఁడే చూపరా, వి... 597

ఆ. ఊరు కాడు పెరిగి యున్నది గనలేక
పోరి గురులఁ గనక పొందుపడక
తాఱుమాఱుగాను తత్తరపడ నేల? వి... 598

ఆ. ఎచటనుండి వచ్చు నెచటికిఁ దాఁ బోవు
నిద్రచంద మెఱుఁగ నేర్చెనేని
ఆత్మ రాకపోక లతఁడపో శివయోగి,వి... 599

ఆ. ఎంత వింత మదికి నేమేమి తోఁచినఁ
జింత సేయరాదు చిక్కు బెట్టు
వింతలోనిగుట్టు వివరింపఁ దానగు, వి... 600

క. ఎన్నాళ్లు బ్రతికిచచ్చిన
దన్నెఱుఁగని మర్త్యులకును దలఁగును బరమా
పున్నమచంద్రుని విమలపు
వెన్నెలలో బయలు సేరి వెలయుము వేమా!

ఆ. ఎన్నిభూములఁ గని యేపాటు పడినను
నంటనీక శనియు వెంటఁ దిరుగు
భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా,వి...

ఆ. ఎఱుక గలుగునాతఁ డేయూర నుండక
తిరుగ నేలఁ దనకు దివ్యమైన
పండు పండ వెనుక భక్షింపకుండునా? వి...

ఆ. ఎవ్వ రెఱుఁగకుండ నెప్పుడు పోవునో
పోవు జీవ మకట బొంది విడిచి
యంతమాత్రమునకె యపకీర్తి గనలేక,వి...604

తే. ఏడ్వ మది నోవ ఫలమేమి యొసరు విన్ను
దిట్టఁగా నేమి లేక నుతింపనేమి

కలుగుభువి లాభలోభము ల్గాలమహిమ
ననుచు సరిపెట్టికోరాదె యరయ వేమ. 605

ఆ. ఏది కులము నీకు నేదిమతంబురా
పాదుకొనుము మదిని పక్వమెఱిఁగి
యాదరించుదానియంతము దెలియుము, వి...

క. ఏదేశముఁ దిరిగినఁ బని
లేదట తనమనసుకుదురు లేకుండినచో
నాధారం బిఁక నింతియ
తా దెలియుట మనసు శుద్ధి తత్త్వము వేమా!

క. ఏనాఁడు సుభిక్షము తన
కేనాఁ డిరవయ్యె నచటికి కేఁగుమృగంబుల్
తానున్నచోట విసికిన
మానవులని పలుకనేల మహిలో వేమా! 608

ఆ. ఒకరి కీడు వేఱె కొక్కరి కీయఁడు
ఒకరిమేలు వేఱ యొకరికీడు
కీడు మేలు వారు పోఁడిమి దెలియరు, వి... 609

ఆ. కంకుభట్టనంగఁ గాపాయములు గట్టి
కొలిచె ధర్మరాజు కోరి విరటుఁ
గాలకర్మగతులు కనిపెట్టవలెనయా, వి... 610

ఆ. కట్టె పైననున్నఁ గట్టెకు ఘనమేమి
చెట్టుపైన ఘనముఁ జేరఁగలఁడె
కట్టె చెట్టు రెండు గలసె ద్వైతంబులో, వి...

ఆ. కట్టెయందు నిప్పు గానని చందమీ
తనువునందు నాత్మఁ దగిలియుండు
మెలుగు దెలిసినపుడ మార్గ్యాననలెనయా, వి...

ఆ. కడక నఖిలములకు నడినాళమందున్న
వేగుఁజుక్కవంటి వెలుగుదిక్కు
వెలుగుకన్న దిక్కు వేఱెవ్వ రున్నారు? వి...613

ఆ. కడగి పట్టియాస కడ తేఱనీయదు
ఇడుములందుఁ బెట్టి యీడ్చుఁగాని
పుడమిజనులభక్తి పొసఁగంగ నీయదు, వి...

ఆ. కడుపు కేల మనస కళవళపడియెదు
కడుపు కేడ దృష్టి కలుగుచుండు
కరపరాతిలోనికప్పకుఁ గలుగదా? వి... 615

ఆ. కనకమృగము భువిని గలుగ దంచెఱుఁగఁడా
రాముఁ డెఱుక గల్గురాజు గాఁడొ
చేటుకాలమునకు చెడుబుద్ధి పుట్టెడు, వి...616

ఆ. కలియుగమునఁ బుట్టి కడ తేఱఁగా లేక
మొదలు జడలఁజేసి యుగ్రతపము
తమరుచేసి యేమి తత్త్వంబు గనలేరు, వి...

ఆ. కనుపుఁ బసికి చేసె గాలి ఫణికిఁ జేసె
మన్నెరలకుఁ జేసె మేఱ కెట్లొ
కుంభినీజనులకుఁ గూడ నట్లు చేసెరా, వి...618

ఆ. కాఁగలపనులెల్ల కా కెట్లుపోవును
కానిపనులు కాన కావు భువిని
మహిమ వేఱ గలదు మనతోడ నున్నదా? వి.

ఆ. కానలేదు నుదురు కర్ణముల్ వీపును
నెఱుఁగ గాన లేదు నెత్తిమీఁద
తన్నె కానలేదు దైవము నెఱుఁగునా? వి...

ఆ. కానలేరు గాని కలియుగంబున నున్న
మనుజులందఱికిని మాన మొకటె
దార్ఢ్యమున్న యెడల దైవంబుఁ జూచును, వి...

క. కాలగతి యెంతవారికి
వాలాయము చులకఁదనము వచ్చుట యరుదా
వ్రేల గిరినెత్తు కృష్ణుఁడు
తెలఁడె వటపత్రమందు తెలియుము వేమా!

ఆ. కాలచక్ర మెఱుఁగఁగా లేక యెప్పుడు
సంధ్యజపము చేయుజాణలార
సంధ్యజపములోనిజాడ లెట్లుండును? వి...

ఆ. కాలచక్ర మెల్లఁ గలవారిమన సెల్ల
సాగి తిరుగుచుండుఁ జంచలించి
చక్రగతిని విడువ స్తంభించు మన సప్డు, వి...

ఆ. కాల మధికమైనఁ గడచిపోవఁగ రాదు
ధర్మరాజుఁ గొల్చె తగనిచోటఁ
కంకుభట్టనంగఁ గటకటా యేమన? వి... 625

క. కాలము కాల మటనకను
మేలుగ తా నొక్కరీతి మితిమీఱంగఁ దాఁ
గాలు నెదుర్కొను జ్ఞప్తిని
వాలాయము శివుని గూడి వర్ధిలు వేమా! 626

ఆ. కాళ్లముంద తేరు కడ కీదఁగా లేక
ముగ్గు రీఁతగాండ్రు మునిఁగినారు
నరుఁడె యీఁదు నన్న నగుబాటు గాదొకో? వి.

ఆ. కీలకము లడంచి బైలెఱింగినవాఁడు
సింధుపుత్రి మాయఁ జిక్కె నతఁడు
శౌరియంతవాఁడె జనులకు శక్యమా? వి...

ఆ. కుక్క యే మెఱుంగు గురులింగజంగంబు
చిక్కఁ బట్టి యొడిసి పీకుఁ గాక
సంతపాకతొత్తు సన్నాసి నెఱుఁగునా? వి...629

ఆ. కూటవాసి యగుచు గుణములఁ బచరించి
నీటనీకపలెను నిలిచియుండు
నుదకఘటములందు నుపరిసూర్యునిబోలె, వి...

ఆ. కొండచండిమామ కొండకూతురె యాలు
కొండమేటివిల్లు కొండయిల్లు
కొండవంటిదొరయు గుండయిపోయెరా, వి...

ఆ. కొండరాళ్లఁ దెచ్చి కోరకఁ గట్టిన
గుళ్లలోన దిరిగి కుళ్లనేల
పాయరాని శివుఁడు ప్రాణమై యుండఁగ, వి...

ఆ. కొడుకును బ్రతికించుకొనలేఁడు శంభుండు
కొడుకును బ్రతికించికొనఁడు శౌరి
దైవబలము లెల్ల దానసే గనుపించె, వి ...633

ఆ. కోరిద్రుపదుపుత్రి కొప్పుప ట్టీడ్చిన
సింహబలునిచావుఁ జెప్పఁదరమె
ముగియుకాలమునకు మొనగాఁడు నీల్గఁడా? వి.

ఆ. గతము చేసినట్టికర్మబంధము లెల్లఁ
బరిసిపోవు సత్యగురునివలనఁ
కుమ్మరి కొకయేఁడు గుదియకు నొకనాఁడు, వి.

ఆ. గతముఁ జూతమన్నఁ గలగన్నయర్థంబు
నడచుకాలమేని నమ్మరాదు
క్షణములోని బ్రదుకు సంసారవిభ్రాంతి, వి...

ఆ. చక్రధరుని వేఁడి జలధి దాఁటఁగవచ్చు
వికృత మైనబుద్ధి వెతలఁబెట్టు
నక్ర మెన్న గజము నయమార భక్షించు,వి...

ఆ. చర్మమునకు స్పర్శ చక్కఁగా తెలియదు
కర్మముల్ పొసఁగుటఁ గానఁ గలఁడె
చర్మకర్మలుండు జగతిని నరులకు, వి... 638

ఆ. చిప్పలోనఁ బడ్డచినుకు ముత్యం బయ్యె
నీటఁబడ్డ చినుకు నీళ్ల గలసె
ప్రాప్తము గలచోట ఫలమేల తప్పురా? వి...

ఆ. చిలుకగర్భమందు శ్రీశుకుఁ డుదయించి
మునివరేణ్యులందు ముఖ్యుఁ డయ్యెఁ
బ్రత్తికాయఁ జిత్రపటములు పుట్టవా, వి... 640

ఆ. చీమ కుట్టెనేని జీవు కనుపించును
చీమ యెంత దాని సృష్టి యెంత
చీమవంటివాని సృష్టిలో నాలుఁగుము, వి...

ఆ. చుట్టుగోడఁ బెట్టి చెట్టుఁ జేమయుఁ గొట్టి
యిట్టునట్టు పెద్దయిల్లుఁ గట్టి
మిట్టిపడును మీఁదిపట్టేల యెఱుఁగఁడో, వి...

ఆ. చూపు కొంచెమైనఁ జుక్కలు కాన్పించు
ప్రాపు వెలుగు లేదు పరువు గాదు
జ్ఞానదీపమువలెఁ గన్నులకును దోఁచు, వి...

ఆ. చేయఁదగినవేళఁ జేసెడికార్యంబు
వేగపడి యొనర్ప విషమ దాను
బుడమకాయచేఁదు ముదిసిన తీపయ్యె, వి....644

ఆ. జ్ఞానవంతుఁ జూచు సరికర్మబుద్ధులు
వెఱ్ఱియండ్రు ప్రకృతి విడువలేక
వెఱ్ఱి కవనిఁ బ్రకృతి వెదకినఁ గల్గునా? వి....645

ఆ. జ్ఞానుల మని యెంచి చపలాత్ము లగువారు
తెలివిలేమి తమ్ముఁ దెలియ లేక
కష్టగహనమందు గట్టిగాఁ జిక్కిరి, వి... 646

ఆ. తనకు లేనినాఁడు దైవము దూఱును
తనకుఁ గలిగెనేని దైవ మేల
తనకు దైవమునకుఁ దగులాటమే శాంతి, వి.

ఆ. తనకు ప్రాప్తిలేమి దాత తీయక యున్న
దోషబుద్ధిచేతఁ దూఱు టెల్ల
ముక్కువంకఁజూచి ముకురంబు దూఱుట, వి...

ఆ. తనదుమనసుచేతఁ దర్కించి జ్యోతిష
మెంతఁ జేసె ననున దెంచిచూడ
తనయదృష్ట మెల్ల దైవంబ యెఱుఁగును, వి...

ఆ. తనువు తను ఘటించుఁ దపియింత్రు జనులార
తనువు లస్థిర మని తలఁపరాదె
తనువు కానఁబడమిఁ దలఁగునా మోక్షంబు, వి.

ఆ. తన్నుఁదా నెఱుఁగఁడు తా నెవ్వరికి నేర్పు
ప్రాలుమాలి తిరుగుపశువుకొడుకు
కాసులకొఱకైన గర్మముల్ గట్టునా? వి...

ఆ. తలఁప వశము గాదు దైవంబు బ్రహ్మంబు
తెలియరాదు బ్రహ్మదేవుకైన
నిసుకబావి త్రవ్వ నెవ్వరివశమయా, వి... 652

ఆ. తల్లితండ్రిపూజ దారిఁ గనక కొంత
పాపకూపమందుఁ బడుట యేల
దానధర్మములకు దైవంబు తానా యె, వి...

ఆ. తాము నిలుచుచోట దైవము లేదని
పామరజనులు తిరుపతుల కరుగ
జోగిఁ జేయు చేతిసొమ్మెల్ల బోఁజేయు, వి...654

ఆ. దశరథుండు రామధరణీశుపట్టంబుఁ
గట్టఁజేయఁదలఁచఁ గట్టె జడలు
తలఁపు మనదిగాని దైవిక మదివేఱు, వి... 655

ఆ. దాచినధనమునకుఁ దానును కొడుకులు
వాంఛపడుట కాని వట్టిభ్రమలు
భాగ్యహీనునకును ఫలము లభించునా? వి...

ఆ. దానధర్మములకుఁ దగు తేపు తేపని
కాలవ్యయము సేయుకష్టజనుఁడు
తాను నేమి యౌనొ! తనబ్రదు కేమౌనొ? వి...

ఆ. దైవమతుల నరులు తమనంటివా రని
యరసి శాస్త్రతత్త్వ మెఱుఁగలేరు
ఇల్లు మూయఁబడిన నెట్లు మర్మ మెఱుంగు? వి.

ఆ. ధనమదంబుచేత దైవంబు నెఱుఁగరు
కుటిలభావ మొంది క్రూరజనులు
మదము మించినంత మన్నన లేదయా, వి... 659

ఆ. ధరగ్రహములు రాశి చరియించు చుండిన
మంచిచెడుగు గానుపించుచున్నఁ
బురుషయత్నమనుచు బొంగుదు రేలరా? 660

ఆ. దైవకంటకుండు ధనముచే గర్వించి
సకలసంపదలను చాలఁ దనిసి
కడకు తాను మేలు గానక చెడిపోవు, వి...

ఆ. ధర్మబుద్ధిచేత దైవంబు తెలిసినఁ
గాలుఁ డేమిసేయఁగలఁడు ప్రజల
ధర్మమంటి వెంట దైవంబుగా నుండు,వి... 662

ఆ. నక్కనోటికండ నదిలోనిమీనుకై
తిక్కపట్టి విడిచి మొక్క చెడఁగ
మక్కువపడి గ్రద్ద మాంస మెత్తుకపోవు, వి...

ఆ. నీళ్లమీఁద నోడ నిలచి తిన్నఁగ సాగు
బైట మూరెఁడైనఁ బ్రాక లేదు
నెలవుఁ దప్పుచోట నేర్పరి కొఱగాఁడు, వి...

ఆ. నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగుఁ బట్టు
బయలకుక్కచేత భంగపడును
స్థానబలమి కాని తనబల్మి కాదయా, వి...665

ఆ. నొసట వ్రాయవాని నొసలు కొంచెము సేయు
నొసటికంటె వాని నొసలు వ్రాఁత
నొసటిమీఁదివ్రాఁత నులిమినఁ బోవునా? వి...

ఆ. పరభృతమ్ము కాకపాలితమైనట్లు
దారిఁ జూపవలయుఁ దద్‌జ్ఞుఁ డొకఁడు
తొంటిజన్మఫలము తుద కెట్టు లొప్పిన, వి...

ఆ. ప్రళయకాలమందుఁ బ్రమథులచేతను
నష్టమైరిగాదె నాటిజనులు
తెలియనేరరైరి దేవుని ద్విజు లెల్ల, వి. 668

ఆ. బల్లిపలుకులు విని ప్రజ లెల్ల తమపనుల్
సఫలము లగు ననుచు సంతసించి
కానిపనులకు తమకర్మ మటందురు, వి... 669

ఆ. మరణమున్న వెఱచి మది కలఁగఁగ నేల
నిరుఁడు ముందటేఁడు నిన్న మొన్న
తనువువిడిచినతఁడు తనకన్న తక్కువా? వి...

ఆ మఱియు దధిని ఘృతము మ్రానులం దనలము
సౌమ్యసుమములందు సౌరభంబు
తిలలతైల మట్లు తేజరిల్లు చిదాత్మ, వి... 671

ఆ. మన్ను మెత్తి కడిగి మఱిరూపు గావించి
గుంటనిండఁ బూడ్చి గుఱుతు నిల్పి
మనుజు లెల్లఁ గూడి మఱి దేవుఁడందురు, వి...

ఆ. మాయ జగ మటంచు మనుజుఁ డెఱుఁగ లేక
మాయలోనఁ దాను మగ్నుఁడయ్యె
మాయఁ దెలియునరుని మర్మజ్ఞుఁ డందురు,వి...

ఆ. ముద్ర చేతఁ బట్టి మొదటిఁ దెలియ లేక
విశ్వకర్మఁ బట్టి విడువలేక
విశ్వకర్మ దిట్టు వెఱ్ఱులువడుదురు, వి... 674

ఆ. మునిఁగి మునిఁగి మునిఁగి ముద్దయై ముద్దయై
పనరి పనరి పనరి పక్కి పక్కి
తిరిగి తిరిగి తిరిగి దిమ్మరై యుందురా, వి...675

తే. మెక్కఁ జేసెడువాఁడును మేను మఱవ
నిద్రబోఁ జేయువాఁడును నిఖిలగతులఁ
జూపి యిల బద్ధులను చేయు సూక్ష్మరూపుఁ
డా మహాదేవుఁడే కదా యపని వేమ! 676

ఆ. మెలఁత నడవి నుంచి మృగమువెంటనె-పోయె
రామచంద్రుఁ డన్న రసికుఁ డేఁడి
చేటుకాలమునకుఁ జెడుబుద్ధి పుట్టును, వి...677

ఆ. మ్రాను తగిన దైన మహితమౌనస్తువు
గా నొనర్తు రట్లుగాక యున్న
కాల్తు రట్టె కాదె కర్మలకును పాట్లు, వి...678

ఆ. మృగములకు నరులకు మేలుఁగాఁ బశువులు
తినగ దున్నఁ బాలుకొనఁగఁ బుట్టి
కష్టపడును వానికర్మ మీఁడేరదే, వి... 679

ఆ. రాళ్లఁ బూజచేసి రాజ్యముల్ తిరిగియు
కానలేరు ముక్తికాంత నెపుడు
తానయుండుచోట దైవంబు నుండఁడా! వి...

ఆ. లంకపోవునాఁడు లంకాధిపతి రాజ్య
మంత కీశసేన లాక్రమించె
చేటుకాల మైన జెఱుప నల్పుఁడె చాలు, వి...

ఆ. వర్ధనంగఁ బోదు వలె ననఁగా రాదు
తాను జేసినట్టి దానఫలము
ఉల్లమందు వగవకుండుటే యోగంబు,వి...682

ఆ. విత్త మొకరి కిచ్చి వితరణగుణమునఁ
జిత్త మొకరి కిచ్చి చెఱచినాఁడు
బ్రహ్మచేఁత లన్ని పాడైనచేఁతలు, వి... 683

క. విధికృత మందురె యన్నియు
విధికిని విధి లెస్స యయ్యె విష్ణు నుతింపన్
విధి యెవ్వఁ డందు రావల
విధి బ్రహ్మము తఁలఁపఁదలఁప వెలయుర వేమా!.

ఆ. విప్రవరుముహూర్తవిభవము నమ్ముచు
పెద్దల నొగి గూర్చి పెండ్లి చేయు
సువిద ముండయౌముహూర్తము నిజమెట్లు?వి.

ఆ. వెళ్లివచ్చునాఁడు మళ్లిపోయెడి నాఁడు
తేను లేఁడు కొంచుఁ బోను లేఁడు
తానదేడఁబోనొ ధనమేడఁబోవునో, వి...

ఆ. వీరుఁ డైన లేదు విద్య నేర్చిన లేదు
సత్కులమున లేదు సటల లేదు
జన్మఫలమె కాని జపియించినను రాదు, వి...

ఆ. వెండికొండ పసిడికొండయుఁ నన కుండ
దేవుఁ డేలఁ బోయి తిరిపె మెత్తె
దైవబలము కాని తనబల్మి కాదయా, వి... 688

ఆ. వేలకోలఁది భువిని వేషము ల్దాల్తురు
ప్రాలుమాలి బువ్వఫలముకొఱకు
మేలు కాదు మదిని మిన్నందియుండుము, వి...

ఆ. వ్యాధిపీడితంబు వ్యసనసంతాపంబు
దుఃఖసంభవమునఁ దొడరు భయము
లేనివార లుండ రేనాటి కైనను, వి... 690

ఆ. శాంతమానసమునఁ జల్లనై శీతల
భాతి నున్న వాఁడు పరమయోగి
అట్టివాఁడు ముక్తి నతివేగఁ గైకొను, వి...691

ఆ. శిలలు దేవతలని స్థిరముగా రూపించి
మంటిపాలె నైరి మనుజు లెల్ల
మంటిలోనిరాళ్ల మదిలోన తెలియరు,వి...692

ఆ. శివునియనుభవంబు సృష్టిలోపల లేక
సంశయం బుడుగదు సాధకులకు
చెలఁగు దివ్వె లేక చీఁకటి వాయదు, వి...693

ఆ. శుద్ధదృష్టి లేక శుక్రునంతటివాఁడు
పట్టు లేక మనసు పారవిడిచి
కన్నుపోవఁ బిదప గాకిచందం బయ్యె, వి...

ఆ. శూలి నెంచి మదిని శుద్ధాంతరంగుఁ డై
కాలకర్మములను గాలఁ ద్రొక్కి
మేలుపూర్ణపదవి మెచ్చునుశివయోగి,వి....695

ఆ. సకలతనువు లెత్తి సంచరించును జీవి
కలిమిఁ బలిమి తగిలి కలవరించు
నాత్మ తేజ మూని యచ్చుగాఁ జూడరా, వి...

ఆ. సకలవస్తువులను సంతతతనువుల
వుసురి కేడ పంచభూతములను
దానిదానిచేతఁ దగుభూషణము చేయు,వి...

ఆ. సగరుఁ డుర్వి రాజచక్రవర్తియు నయ్యె
పరులు తన్నుఁ బొగడ బ్రదుకుచుండె
నిట్టిఘనత వీరి కెందున కయ్యెరా? వి... 698

క. సర్వము తానని తెలిసిన
నిర్వాణికి గాక ముక్తి నిలువఁగ వశమా?
యుర్విల్లఁ దాను దిరిగినఁ
బర్వతబిలజలధులందు బడినను వేమా! 699

ఆ. సర్వ మొకటఁ జూడు సమకూరును ధ్రువంబు
రెప్ప వేయఁబోకు రేయిఁ బవలు
పగలులోనిపగలు పరమాత్మ [illegible]ము, వి...700

ఆ సాటివారు నిన్ను సాధింపఁగా లేరు
దైవ మెపుడు నీకు తప్పకున్న
భారతంబులోనిపరమార్థ మిదె కదా! వి...

ఆ. సౌఖ్య మరయునట్టి సౌఖ్యంబు కలుగును
హరునికృపను సౌఖ్య మమరియుండు
సుఖ మసుఖములకు మూలి కారణుఁ డగు, వి...

ఆ. సూదినంటుదారి సూత్రముగా నాత్మ
సాధనంబుమీఱి సంతరించి
పాదుకొల్పునరులు పరమాత్మరూపులు, వి...

ఆ. స్వాతి మెఱుపుఁ జూచి సంతోషపడుదురు
స్వాతి మెఱుపులేమి సఫల మన్న!
మెఱుపునుఱుము లేక మేఘంబుగురిసెయునా? వి.

ఆ. హరికి దొరకె నందుఁ సిరి యప్పుడే
దొరకెఁ గాదె విషము హరున కరయ
నెవని కెట్టు లగునొ ఎవ్వఁ డెఱుంగును? వి...

క. హరివిధి సురమును లాదిని
మెఱసియు జన్మించి పిదప మేలుల కెసఁగా
జరయందు మరణమందును
వరుస న్వర్తిలిరి దైవవశమున వేమా! 706

క. హరివిధులు కనుట వినవా?
హరుఁడు నిమిత్తంబులందు నాకుట వినవా?
గురిగల చదువులు వినవా?
తఱివచ్చినదైవ మనుచు తలఁపుము వేమా! 707

ఆ. తీఁతి వెలఁదికిఁ బగు శృంగారములు నున్న
విభునికరుణ లేక వెలయనట్లు
దైవకృపలు లేక తలఁపులు చెల్లవు, వి... 708

## కర్మపద్ధతి.

ఆ. అడవి దిరుగఁ జిక్క దాకసమున లేదు
అవని తీర్థయాత్ర లందు లేదు
ఒడలుశుద్ధిచేసి యొడయనిఁజూడగా, వి... 709

ఆ. అండమండముఁ గన నన్నియు నటుపిండ
మండమెట్లొ బ్రహ్మయండ మట్లె
కర్మబంధమునను గానరు బూసరుల్, వి ...710

ఆ. అతిథిరాకఁ జూచి యదలించి పదవైచి
కఠినచిత్తు లగుచు కానలేరు
కర్మబద్ధు లగుచు ధర్మంబు సేయరు, వి.... 711

ఆ. అపుడు నాదుమాట ననుసరింపఁగలేక
ఇపుడు నమ్మటన్న నేమికలదు
మదము నిల్చునను మనసులు నిల్చునా? వి...

ఆ. అరయ కర్మమునను నాహరిశ్చంద్రుండు
ఆలిబిడ్డ నమ్మి యతఁడు కూడ
మాలవాని కెపుడు పఱి లోకువై యుండె, వి.

ఆ. అరయ నాస్తి యనక యడ్డమాటాడక
తట్టుపడక మదిని తన్నుకొనక
తనది గా దనుకొని తాఁ బెట్టునది పెట్టు, వి...

ఆ. అలను బుడగ పుట్టినప్పుడే క్షయమౌను
కలను గాంచులక్ష్మిఁ గనుట లేదు

ఇలను భోగభాగ్య మీతీరె కానరు, వి...715

ఆ. అష్టకష్టి బ్రదుక దగ్నిపాలై పోవు
నిర్దయాత్ముబ్రదుకు నీటఁ గలియుఁ
గ్రూరకర్ముబ్రదుకు చోరులపాలౌను, వి...716

ఆ. ఆఁకలి గొని వచ్చె నని పరదేశికి
పట్టె డన్నమైనఁ బెట్టలేఁడు
లంజెదానికొడుకు లంజెల కిచ్చును, వి... 717

ఆ. ఆదితుదల నరయ కల్పుడై దినమెల్ల
మార్పుచేత బుద్ధి మరఁగి తిరుగు
మ్రానుమ్రాను దిరుగు మహిఁ గోతికైవడి, వి.

ఆ. ఆలుమగనిమాట కడ్డంబు వచ్చెనే
నాలుగాదు నుదుటివ్రాలు గాని
యట్టియాలి విడిచి యడవినుండుట మేలు,వి...

ఆ. ఆలు సుతులు ధనము లరయంగ మీరని
మొనసి కర్మమునను మోసపోయి
కాలుఁ గన్న యపుడు కడ తేరఁజాలఁడు,వి...720

ఆ. ఇంచుకంతబోన మీశ్వరార్పణ మన్న
పుణ్యలోకములకుఁ బోవుసతఁడు
కర్మసూక్ష్మములను గనవలె ఘనులెల్ల, వి...721

ఆ. ఇంచుకంత సుఖమె యీరేడుజగములు
కంచమునకు బిల్లి కాచినట్లు
పంచబాణుబారిఁ బడలుచునాసింత్రు,వి...722

ఆ. ఇంటిమగని జూచి యిల్లాలు దుఃఖించి
వెంట విటుని వగిచి వెతలఁబడును
తుంటరైనదానిఁ దోలఁగింప మేలురా, వి...723

ఆ. ఇమ్ముదప్పువేళ నెమ్మె లన్నియుఁ దప్పు
గాల మొక్కరీతి గడపవలయు
విజయుఁ డనువు దప్పి విరటుని గొల్వఁడా, వి

ఆ. ఇఱుకువచ్చువేళ నీశ్వరుఁ దలఁతురు
గరుణఁ గనునె నట్టిగానిగాక
సుఖము వచ్చువేళ చూడంగ నొల్లరు, వి...725

ఆ. ఇసుగుపొరుగులందు నిమిడికతో నుండి
తనకుఁ దానె మెలఁగి తలఁపుఁ జూపి
ధర్మమన్న యెఱుక తన్నుఁదాఁ బొడసూపు
కర్మఫలమువలనఁ గలిగి వేమ! 726

ఆ. ఇసుకబొగ్గు రాయి యినుముఁ జర్మంబును
కసవు పొల్లుగట్టి కట్టెపెట్టి
పల్లుఁ దోమినంతఁ బరిశుద్ధులగుదురా, వి....727

ఆ. ఉచ్చ వచ్చుచుండు నిచ్చకు సరిగాను
మచ్చికైన మనసు మర్మ మెఱిఁగి
హెచ్చుకర్మములయు ముచ్చట లిట్లురా, వి...

క. ఉచ్చసరి తూగి పుట్టెడు
నెచ్చట వేమనుజుఁ డైన నేర్పడ భువిలో

నిచ్చట కులజుం డెవ్వఁడు?
విచ్చలవిడి కర్మ మగును వినరా వేమా! 729

ఆ. ఉండఁడే సుశీలి యుండును గొన్నాళ్లు
ఉండి యుండి యుండి యుండలేక
ఉండువెఱపుఁ దెలిసి గండి దొంగనుబట్టి
చెండి చెండి తావుఁ జేరు వేమ! 730

ఆ. ఉన్నతావు వదలి యూరూరుఁ దిరిగినఁ
గన్న దేమి నరుఁడు గ్రాసమునకు
దన్ను లోనఁ జూడఁ దమమెల్ల వీడును, వి...

ఆ. ఋతువు ననుసరించి స్థితికాలమున నొప్పు
గతిని బట్టి మనుజు మతియు నొప్పు
స్వేచ్ఛఁ బట్టి యువిద చెల్లాటమును నొప్పు, వి.

ఆ. ఎదటికలిమిఁ జూచి యేడ్చెడువారికి
భాగ్య మెటులఁ గూర్చుఁ బరమగురుఁడు
తనదుపూర్వకర్మ దైవ మెఱుంగఁడా? వి...

ఆ. ఎద్దుకన్న తెలియ నెనుబోతు తక్కువ
వివర మెఱిఁగి చూడు వృత్తియందు
నేర్పులేనివాని నెరయోధుఁ డందురా, వి...

క. ఎన్నఁగ కర్మము కారణ
మన్నిటికిని జూడ జూడ నాత్మఁడు తానై
యున్నంతకాల మిలలో
నన్నా యిదె తెలియవలయు ననినిని వేమా! 735

ఆ. ఎన్నితపము లేర్చి యెన్నినోములు నోచి
యెంతకష్టపడిన నేమిఫలము
కర్మఫలము గాని కలుగ దెందును ముక్తి, వి.

తే. ఎన్ని దేవత లైనను నీరహస్య
చిహ్నలను బట్టి కనలేరు చిన్మయంబు
తన్ను తనలోనఁ గనుటయే తన్మయంబు
చెన్ను మీఱంగ నిదె మేటితెన్ను వేమా! 737

ఆ. ఎన్నిఫలము లున్న నీఫలం బెక్కుడు
అన్నిసుఖములందు నధిక మగుచు
కన్నది కననిదయి కనుపించు కర్మము, వి...738

ఆ. ఎఱుకకన్నను సుఖ మేలోకమున లేదు
ఎఱుక నెఱుఁగ నెవని కెఱుకలేదు
ఎఱుకసాటి దెఱుకె యెఱుకయే తత్త్వము, వి.

ఆ. ఎల్లలోకమందు నేమస్తు వున్నదో
తల్లిపిల్లసందు తగులు నదియె
నిస్తరంగవార్ధి నియతిని జూపుము, వి... 740

ఆ. ఎసఁగువేత్త యనుచు నెఱుఁగరే యీనరుల్
వేయిమార్గములను వేలు పజుఁడు
అవని సృష్టికర్త యంతకు గురుఁడౌను, వి...

ఆ. ఏమి గొంచువచ్చె నేమి తాఁ గొనిపోవు
బుట్టువేళ నరుఁడు గిట్టువేళ
ధనము లెచటి కేఁగు తానేఁగు నెచటికి? వి...

ఆ. ఒక్కతోలుదెచ్చి యొకర బొమ్మను చేసి
ఆడునట్లు చేసి యట్టె వైచె
దన్నుఁ ద్రిప్పువానిఁ దానేల గానఁడో, వి...

ఆ. బల్ల నన్నుఁ బోది కొల్లైన నన రాదు
తొల్లి చేయుకర్మ ధూర్తఫలము
ఉల్లమందు నగనకుండుటే యోగ్యంబు, వి...

ఆ. కంటికంటి ననుచుఁ గర్మాధికారంబు
వెంట గొనుచుఁ జెడును వెఱ్ఱిజనుఁడు
బట్టబయల ముక్తిఁ బాటించి జూడుఁడు, వి...

ఆ. కంటిమంటచేతఁ గాముని దహియించి
కామమునను కడకు గౌరిఁ గూడె
నట్టి శివునినైన నంటును కర్మము,వి... 746

ఆ. కర్మమయుఁడు గాక కర్మంబు దెలియఁడు
కర్మజీవి మేలు గానలేఁడు
నీరుసారక లోఁతునికరము తెలియదు, వి...

క. కర్మము జ్ఞానికి దవ్వగుఁ
గర్మమునకు జ్ఞాని దవ్వ కలనిజ మిదె యా
కర్మజ్ఞానము లుడిగిన
నిర్మలునకుఁ గలుగు ముక్తి నిజముగ వేమా!

ఆ. కర్మఫలము లన్ని కపటంబుగాఁ జూచి
ధర్మఫలము లన్ని తగిలియుండి
ధర్మమర్మములను దాఁటుటే ముక్తిరా, వి.

ఆ. కర్మమునను బుట్టి కర్మంబులోఁజేరి
కర్మ మేరుపడుటఁ గాన లేరు
కర్మబంధమునను కడతేఱ లేరయా, వి... 750

ఆ. కర్మవశమున సంసారకష్టములను
జెంది మోహాతిశయమునఁ జెడును నరుఁడు
కర్మరహితత సుజ్ఞానకలితతయును
జెంద మోహాదు లేటికిఁ జేరు వేమ! 751

క. కర్మాకర్మలకొఱకును
నర్మిలి నొకఁ డుండు లోన నాత్మయుఁ గర్తై
ధర్మాధర్మములకు నది
నిర్మలమతి యైనవాఁడు నిలుచును వేమా! 752

క. కర్మాకర్మము లెఱుఁగని
మర్మంబులు నింద్రజాలమహిమలు విద్యల్
కర్మలమర్మము ప్రాణులు
నిర్మలమతిఁ దెలియవలయు నిజముగ వేమా!

క. కర్మనివృత్తైనప్పుడు
నిర్మలుఁ డగుభవ్యుఁడు వాసి నిక్క మెఱుంగున్
కర్మము తీఱెడు వేళను
ధర్మమె తనదేవుఁ డనుచు తలఁతురు వేమా!

ఆ. కాడు సేరి యున్న గతిలోన యున్నను
వీటినడుమ నున్న విధము లొకటె
జాడ విడనిమదిని జర్చించి చూడరా, వి....755

ఆ. కూడ దేమి చేసెఁ గులమేమి చేసెను
భూమి యేమి చేసె బొందికట్టె
నరుఁడు పడెడుపాట్లు నగుబాట్లు చూడఁగా, వి.

ఆ. కొడుకును వరియింపఁ గోరి వచ్చినదానిఁ
దండ్రి పెండ్లియాడ ధర్మమగునె ?
తప్పని తెలిసియు దాఁ జేయుకర్మంబు
తప్పదెపుడు భువిని దగులు వేమా! 757

ఆ. శ్రోత్రసుద్దులైనఁ గురుబోధచే విన్నఁ
గర్మయుక్తియోగ కాండతతులు
ప్రాఁతసుద్దులైన పాయునా కర్మముల్, వి...758

ఆ. చిఱుతనాఁడు నీవు చేసినకర్మంబు
మఱతువేమొ మదిని మల్లడించి
తఱిమిముట్టుఁజావు తలపడినప్పుడు, వి... 759

ఆ. చేటు వచ్చెనేని చెడనాడు దైవంబు
మేలువచ్చెనేని మెచ్చుకొనును
గరిమ మేలుకీళ్లు కావడికుండలు, వి... 760

ఆ. చదివిచదివి కర్మసారముఁ గనలేక
తిరిగి తిరిగి తిరిగి దిమ్మరాయె
మరిగితిరిగి మొఱిగి మత్తిల్లి చచ్చెరా, వి....

ఆ. చాకి కోక లుదికి చీకాకుపడవేసి
మైల దీసి లెస్స మడిచినట్టు
బుద్ధి చెప్పువాఁడు గ్రుద్దిన మేలయా, వి...

ఆ. తనకు ప్రాప్తిలేక దానము చిక్కదు
దైవనింద వెఱ్ఱితనము గాదె!
కర్మజీవు లేలఁ గర్మంబుఁ దెలియరు?వి .... 763

ఆ. తనకు ప్రాప్తిలేదు దాత యీలేదంచు
నొరుల దూఱు టెల్ల నోగుబుద్ధి
కలిమిలేమి కతనఁ గష్టమై తోఁచురా, వి...764

క. తనప్రాప్తి తనకు నుండఁగఁ
దనదుఃఖము తనకె కాక తగులునె యొరులన్
తనచేయుమంచి తనకే
యనుకూలించెడిని జేసి దన్యుల వేమా! 765

ఆ. తనకుఁ బ్రొద్దువోనితరుణం బదైనచో
వినక దీర వధికవిద్యలైన
గరిత వినదె ప్రియునికొఱకు కాకధ్వని, వి ....

ఆ. తనదుకర్మచేతఁ దాను లోకములోన
తనదుతల్లి గర్భమునను బుట్టె
తనదుకర్మ మఱచి తగనివి చేయునా? వి...

ఆ. తనదునీడ శిశువు తాఁ జూచుచుండును
తనదునీడఁ జూచి తన్ను మఱచి
పను లొనర్చుచుండు భ్రాంతుల నేమందు? వి.

ఆ. తనదుభ్రాతలెల్ల దానంబు సేయంగ
తనకుఫల మటంచు మిణుకరాదు
తనదు కాలుఁ గోయ తనతమ్ముఁ డేడ్చునా? వి.

ఆ. తెలివి నొందలేక తిరమును బడయక
తిరుగు నస్థిరుఁడయి దేహి జగతిఁ
దిరుగనేల ? కర్మఁ దెలియఁ డయ్యజ్ఞాని, వి...

ఆ. ధర్మమార్గములను దప్పఁగాఁ జూచును
కర్మజీవి మేలుఁ గానలేఁడు
నిర్మలహృదయుండు నీరూపమున నుండు, వి.

క. ధర్మార్థకామమోక్షము
లర్మిలి మదిఁ దెలిసినంత నామోటం బా
నిర్మలగతిఁ దాఁ గనవలె
కర్మలకును లేదు ముక్తి గదరా వేమా! 772

క. నరజన్మముఁ దా నెత్తియుఁ
బరమాత్మ నెఱుంగలేక పాపాత్ముండై
కొఱగాని పను లొనర్చినఁ
దిరిగి యధోగతికి నేఁగుఁ దిరముగ వేమా! 773

ఆ. నరుఁడయినను లేక నారాయణుం డైన
తత్త్వబద్ధుఁడైన ధరణి నరయ
కర్మభావములను ఘనత నొప్పఁగవలె, వి...774

ఆ. నింగి నెగయువాఁడు నెఱి లోకమున లేఁడు
బంగిఁ ద్రాగువాఁడు బలియఁబోఁడు
కొంగయోగములను కోర్కు లడంగునా? వి...

ఆ. పదియసంగతములు పదిసార్లు చేసినఁ
దప్పుదారిఁ ద్రొక్క దార్ఢ్య మొదవు

కూడదేల యట్టి కుదిరిక మంచికి? వి... 776
ఆ. పరగ నింతవఱకుఁ బడినపా టెఱుఁగరు
ఘనత నొప్పుమనుజుఁ డనఁగఁ బుట్టి
కీడు మే లెఱుఁగక క్రిందా యెఁ జూడరా, వి...
ఆ. పరగ నిలను ముందు బ్రదుకురీ తెఱుఁగక
సకలసంపదలును సతము లనుచు
కర్మధర్మములను గనలేరు మూర్ఖులు, వి...
ఆ. పాపమనఁగ వేఱె పరదేశమున లేదు
తాను జేయుపనులఁ దగిలియుండు
కర్మజనుఁడుగాక కనుగలిగినయెడఁ
బాపభయము లేదు పరగ వేమ! 779
ఆ. పుట్టువుఁ దెలియనిపురుషాధములు భూమి
బుట్టనేమి లేక గిట్టనేమి?
పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా, వి ...780
ఆ. పుట్టుముద్ధ తిరిగిపోయెడు నీముద్ధ
తేరముద్ధ తన్ను తెలియలేఁడు
ఉన్ననాటికైన నుపకారిగా లేఁడు, వి... 781
ఆ. పుట్టుటకు ముదంబు గిట్టుటకును వెత
యంద తెలిఁగినట్టి యల్పవిద్య
చచ్చుఁ గానఁ బుట్టఁ జప్పున నేడ్వరే!, వి...782
ఆ. పుడమి గర్మవశతఁ బురుకుత్సుఁ డనుమేటి
ధర్మమనుసరించి ధాత్రి నేలి

తనకు గాని వేళఁ దాఁ బడెఁ గష్టముల్, వి...
ఆ. పురుషు లరసి కొన్ని పుణ్యభూము లటంద్రు
బుద్ధిలేదొ యిదియు భూమిగాదొ
పుణ్య మనఁగ నేమి పురుషునికర్మమే, వి... 784
ఆ. పూతగడ్డి కేల పుట్టించె వాసన
కనకము తన కేమి కల్లఁ జేసె
బ్రహ్మచేత లెల్లఁ బాడైన చేఁతలు, వి... 785
ఆ. పెక్కుజనులఁ గొట్టి పేదల వధియించి
డొక్కకొఱకు నూళ్ల దొంగలించి
యెక్కుడి కరిగిన నెఱిఁగి యముఁడుచంపు, వి...
ఆ. కర్మజాల మనుచు ఘను లెల్ల బల్కెరు
కర్మమేమి? దానిఘనత యేమి?
తెలుపొ నలుపొ యెఱుపొ తెలిసినఁ బల్కుఁడు, వి.
ఆ. ప్రాణ మాత్మ మెన్న ప్రాణిజీవిత మగు
జీవిప్రాణ మాత్మ చేరి యొకటె
కర్మబంధమునను గట్టువడుండును, వి... 788
ఆ. మంచిగంధముఁ గన మనసు రంజిల్లును
ఎంతొ వాస ననుచు నెన్నుచుంద్రు
తా మెఱుంగ లేరు తమపూర్వవాసన, వి...
ఆ. మంచినీరుపోయ మల్లె పూచును గాని
ఫలిత మొనరు టెట్లు పని జొరమిని
వంట చేయ కెట్లు వంటక మబ్బును, వి... 790

ఆ. మంచిరుచులఁ గోరు మంచిస్త్రీలను గోరు
మనుజుఁ డెంత చెడ్డమనసొ చూడుఁ
డించుకంత యైన నేలని విడువఁడు, వి... 791

ఆ మంచిశకునములని యెంచి పెండిలి సేయు
వారలొకరు లేరు వసుధలోన
జనులకర్మములను శకునముల్ నిల్పునా? వి.

ఆ. మంటిలోనఁ బుట్టి మంటిలోనఁ బెరిఁగి
మన్ను జూచి నరులు మన్నులైరి
మన్ను మన్ను జేర మది నిల్పలేరయా? వి...

ఆ. మతపుభేదము గలమాయసంసారియై
దారిఁ దెలియలేఁడు తమక మొంది
దారితెలియు నతఁడు ధన్యుఁడు గాఁడొకో! వి.

ఆ. మతము లెన్నియైన సతములు కావవి
సతము కర్మ మగును జగతియందు
అన్నిమతములందు నరయ నొక్కటి లేదు, వి.

ఆ. మద్యమాంసరుచిని మాదిగడై వాల
యెంగిలిఁ దినఁగానె నింగి కలదె?
భక్తిని హరుఁ గొల్చి భవ్యులు గండయా, వి.

ఆ. మధురసంబు గోరి మక్షికంబులు చేరి
చొచ్చి వెడలలేక చొక్కినట్లు
మునిఁగి విడువలేఁడు మూఢుఁడు కర్మల, వి...

ఆ. మనసులోనిముక్తి మఱియొక్కచోటను
వెదుకఁబోవువాఁడు వెఱ్ఱివాఁడు
గొఱ్ఱెఁ జంకఁ బెట్టి గొల్ల వెదకినరీతి, వి...

ఆ. బ్రదుకులన్ని మాయ భవబంధములు మాయ
తెలివి మాయ తన్నుఁ దెలియ మాయ
తనదుకర్మ మొకటె తనరును స్థిర మయి, వి...

ఆ. మర్మ మెఱుఁగలేక మతములు గల్పించి
యుర్విజనులు దుఃఖ మొందుచుంద్రు
గాజుటింటికుక్క కళవళపడురీతి, వి... 800

ఆ. మాట చెఱుపుమాట మర్మమే కర్మము
ఆశలు కడగండు లప్పుముప్పు
పాపకారణములు పలుకులు ములుకులు
లేమలకును దెలియలేరు వేమ! 801

ఆ. మాట నిలుపలేనిమహితుండు చండాలుఁ
డాజ్ఞ లేనినాథుఁ డాఁడుముండ
మహిమ లేనివేల్పు మంటఁజేసినపులి, వి...

ఆ. మాటలోనివానిమహిమ తాఁ దెలియక
మాట తెలియలేక మమతఁ జిక్కె
మాట తెలిసెనేని మహితుఁడు యోగియౌ, వి.

ఆ. మానసమున మంచి మల్లెపూవుల చవికె
బావితోటఁ జేసి బాలఁ గూడి
భోగి నయ్యెద నని బోయెఁ బో కాలంబు, వి

ఆ. మాయజగ మటంచు మనుజులు సెప్పేరు
మాయగాదు కర్మమయము గాని
మాయమైన జగము మఱి యేడనున్నదో? వి.

ఆ. మాయజగములోని మమకారవృత్తిచే
మాయఁ దగిలి మనసు మంకు విడక
మదపుసేత చేత మహితు లెట్లౌదురు? వి...

ఆ. మాయయన్ చెఱసాల మన సను గొలుసును
ఖేదమనెడి బొంద బెరసియుండు
నిట్టికర్మబద్ధుఁ డెన్నఁడు ముక్తుఁడౌ? వి... 807

తే. మాయమమకారమును ద్రుంచి మఱగినంత
కర్మకడగండ్లు చెప్పను కాలుఁ డెఱుఁగు
దీనిఁ గని మెలఁగెడివాఁడు ధీజితుండు
నాయతుల్ లేనిచో గతుల్ మాయు వేమ!

ఆ. మాలయం టనుచును మఱినీళ్ల మునిఁగిరి
మాలకర్మచేత మాలఁడాయె
ఏల తెలియలేరొ! యీనరపశువులు, వి...808

ఆ. మాలదానియంటు మంచినీళ్లను బోవు
తుఱకవానియంటు త్రుళ్లిపోవు
మ్రుచ్చువానియంటు చచ్చిన పోవునా? వి...

ఆ. ముక్కుపట్టి యీడ్చుముండను చేపట్టి
తిక్కయెత్తి నరుఁడు తిరుగుచుండు
నెక్కడితలిదండ్రు లేమియుఁ దనకేల? వి...

ఆ. మీఁదియీఁకఁ దీసి మిగులఁ బెద్దల మని
కానరాక తిరుగుఁ గర్మజనులు
బయలుకోరినట్లు భావంబుఁ గోరరు, వి... 812

ఆ. ముక్తి యెవ్వరిసొమ్ము ముక్కుమీఁదుగఁజూడ
భక్తి యెవరిసొమ్ము భజన సేయ
శక్తి యెవరిసొమ్ము యుక్తిచే సాధింప, వి...

తే. ముక్తులకు నేలఁ బెట్టెఁడు మూఢజనుఁడు
దూదిమూటనఁ జాలినఁ దొడ్డకడుపు.
నించుచుండును సతమని నిత్యముగను
కడుపు తన్నుద్ధరించునే కడకు వేమ! 339

ఆ. ముండఁ జూచినంత మొగమోటమిని గంద్రు
ముండకూడు దినక ముక్తి లేదు
ముండకూటికెల్ల మూలంబె కాదయా? వి...

ఆ. ముండలదగుగోష్ఠి మునుఁగుచుఁ దేలుచు
విడువలేరు సుమ్మి వెఱ్ఱినరులు
అండఁ బాయు వెనుక నన్నియుఁ బోవురా, వి.

ఆ. ముదిత నడవినుంచి మునులేడి వెన్నంటె
రామచంద్రుకంటె రసికుఁడేడి?
పొలుపు తొలఁగువేళ బుద్ధు లట్లుండురా, వి.

ఆ. ముందుజ్ఞాన మెల్ల మోసమై శిశువులు
కర్మబంధమునను గాచలేక.

జననమరణములకు సాదృశ్యమై వచ్చి
ఇహామునందుఁ బుట్టు టెఱుఁగు వేమ! 818

ఆ. మునిజనములు కలఁగ మునిఁగి వెళ్లినబావి
బ్రహ్మకుఁ దలలెత్తరానిబావి
మొలలబంటిగాను మించు నెవ్వరినైన, వి...

ఆ. మును తెలిసినవారు మొగి నష్టమై రిల
తిరిగి చెప్పి తనుచుఁ దిట్టవలదు
తెలియఁ జెప్పువాఁడఁ దెలియుము కర్మంబు, వి.

ఆ. ముఱికికొంపలోన నిఱికించి జీవుని
కర్మపాశములను గట్టివేసె
నిట్టికర్మజీవి కెట్లొకో! మోక్షంబు, వి... 821

ఆ. ముఱికితోలుకంత మూలంబె మదిచింత
నరక మబ్బుఁ జెంతనలుగు డెంత
పరము గోరినంత బయలగు నీవింత, వి... 822

ఆ. ముఱికిలోనఁ బుట్టె ముఱికిలోనఁ బెరిగె
ముఱికితనువు కింత మురిపెమేల?
ముఱి కెఱుంగునతఁడు ముఱికిలోఁ బుట్టునా?వి.

ఆ. మూఁటి నీషణముల మొదలంటఁ జెఱుపక
చిత్తమేల నిలుచు స్థిరముగాను
చిత్తశుద్ధి లేక శివుఁడు కాన్పించునా? వి...

ఆ. మూఁడుగుణము లొకట మొదలనె యుండఁగా
కలిపి మూలఁ బెట్టి తెలివిలేక

భ్రమలఁ జిక్కి కర్మి బలువెఱ్ఱివాఁడురా, వి...

ఆ. మూఢభక్తిచేత ముక్కంటిఁ బూజింప
మొన్న బోయ నరుఁడు ముక్తిఁ డాయె
పూజకేమి తనదుబుద్ధి ప్రధానంబు, వి... 826

ఆ. మూల మెవ్వ రనుచు ముగ్గురిలోఁ గల
మూల మెఱుఁగలేరు మూఢజనులు
మూలమంతటికిని ముఖ్యము కర్మము, విశ్వ...

ఆ. మూలవిద్యయందు ముఖ్యతేజములోన
మెలఁగుచిత్పరుండు మిహిరుపగిది
కాలకర్మములకు గాలుండె సాక్షిరా, విశ్వ...

ఆ. మాట లుడుగకున్న మంత్రంబు దొరకదు
మంత్ర ముడుగకున్న మది కుదురదు
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి

ఆ. మైథునమునఁ బుట్టి మానవులందఱు
తిరుగుచుంద్రు రెపుడు తెరువులేక
యెందులోన బుట్టు కందులోనె గతి, వి...

ఆ. మొదటితరువునందు మూఁడుకొమ్మలు పుట్టె
అనలుకొనలు తీఁగలాకు లమరె
పువ్వుపిందెపండ్లు భువనము ల్నిండెరా, వి. 831

ఆ. ముచ్చు యాత్ర కేఁగ ముల్లె విడుచుఁ గాని
మ్రొక్కఁ బ్రొద్దు లేదు మొనసి యెపుడు
కుక్క యిల్లుచొచ్చి కుండలు మోయునా? వి.

ఆ. యోనిబంధుఁ డగుచు నొనర జన్మము నొంది
హానివృద్ధిచేత నలసుఁ డగును
కానిదానిమహిమఁ గడమొదల్ దెలియదు. వి.

ఆ. యౌవనమున మదిని నీశునిధ్యానము
నిలుపనపుడు ముందు నెగ్గఁ గర్మ
చేయనియతనికి క్షితిసౌఖ్య మేదయా? విశ్వ.

ఆ. రాయియైన యహల్య రాముపాదము సోఁకి
యాడుదయ్యె నందు రవనిజనులు
చేయుసుకృతము లిల శిలలైనఁ దప్పవు, విశ్వ.

క. లోకము తను ఛీ యన నా
యాకీడులొనర్చుచుండు నధముఁడు ధర్మం
బేకోలఁది యెఱుఁగు నౌ?
కాకులు మడినస్సు వెఱుఁగఁ గలవా వేమా!

క. వచ్చునది పోవునది మఱి
చచ్చెడిదియుఁ గానలేరు సహజములనుచుం
విచ్చలవిడిగాఁ దిరుగుట
బిచ్చునఁ బడునట్టిమిడుతచెలువము వేమా! 838

ఆ. వలపుఁ జూప మదిని వర్ణించి కానక
వెతలఁ జిక్కుచుండు వెఱ్ఱివాఁడు
కులముఁగోరువాఁడుగుణహీనుఁ డగువాఁడు, వి.

ఆ. వలలు పన్ని దుష్టవన్యమృగంబులఁ
బట్టవచ్చుఁ గాని పాడుకర్మ

గురునిబోధ లేక కుదుట నొందదు సుమీ, వి.

ఆ. వాక్కుచేతఁ దప్పు వావులు వరుసలు
వాక్కుచేతఁ దప్పు వనితగుణము
వాక్కుచేతఁ గలుగు వరకర్మములు భువి, వి.

ఆ. వాగు లడ్డుగట్టి పల్లకాడులు దున్ని
మున్ను నడచుత్రోవ ముండ్లు గొట్టి
పైరుఁ బెట్టునట్టిపాపులు గలరొకో! వి... 842

ఆ. వాడ కులము లేక వర్తిల్లు మనుజుండు
కర్మబద్ధుఁడగుచు ఘనత లేక
లేనివాని బోలి దీనవాక్యము లాడు, వి...843

క. వాదమున నడచు నరుఁడగుఁ
గాదనఁగా భూమి దిరుగు గడుసరి యైనన్
యేదైన హానివచ్చిన
సాధనవాదంబు నడపఁ జరుగదు వేమా! 844

ఆ. వానరాకడ మఱి ప్రాణంబు పోకడ
కానఁబడదు కాలకర్మవశతఁ
గానఁబడిన మీఁదఁ గలి యిట్లు నడచునా? వి.

క. విడుదని మాయాకర్మము
గడుసఁగ లేరైరి జనులు కడుఁ జిత్రముగా
సుడివడి పుట్టుచుఁ జచ్చుచుఁ
గడతేరుట గాంచు రిట్లు ఖలులకు వేమా! 846

ఆ. వితరణుండు తానె విజ్ఞానతప మూని
మతికి గతి యటంచు మాన్యబుద్ధి
సతతమాత్మఁ గర్మసందేహములు రోయు, వి.

ఆ. విత్తనంబు గురువు విశ్వంబునకు నెల్ల
బ్రణవమంత్ర మరయఁ బరమగురువు
కర్మగురువు సుమ్ము గాయత్రిమంత్రంబు, వి...

క. విత్తును సుముకయుఁ దమలో
బొత్తున పుట్టగను పొట్టుపోయినభంగిన్
వేత్తగు నాతనికర్మం
బత్తెఱఁగునఁ గడచి చనును నసువుగ వేమా!

ఆ. వ్రాత వెంటఁ గాని వర మీడు దైవంబు
చేతకొలఁదిఁ గాని వ్రాత కాదు
వ్రాత కజుఁడు కర్త చేతకుఁ దాఁ గర్త, వి.

ఆ. శనియె చాల దనుచు ననిరట కొందఱు
శనికి చాలనిదది కనఁగ లేరు
కర్మఫలమె మిగులఁ గష్టముల్ గుడుపురా,వి...

ఆ. సతిని చూచి చూచి సౌఖ్యంబు తాఁ గోరు
గతిని కానలేఁడు కర్మజీవి
గతులు సతులః లనఁ గానంగ లేరురా,వి...852

ఆ. పతులఁ జూడఁ జూడ సంసారి కాఁగోరు
సుతులు పుట్టఁబుట్ట వెతలఁబడును
గతులు చెడఁగ చెడఁగ గర్మమం చేద్చును, వి.

ఆ. సుతులచేతఁ బుణ్యసుఖము నొందుదు నని
మనుజుఁ డుండు కర్మమతముఁ దగిలి
ఏనుఁగు పడియున్న నెత్తునా మశకంబు, వి...

ఆ. సేతువందు మునుఁగ శీతిఁ గాకి తెలుపౌనె?
కాశికేఁగ గ్రద్ధ గరుడుఁ డగునె?
బదరి కరుగ వృద్ధు బాలుండు గాఁడయా, వి...

ఆ. స్థిరులు గాక క్షుద్రజీవులలోఁ జేరి
యెచ్చుతగ్గులందు హీనమతులు
గాడ్దెపిల్ల లగుచుఁ గ్రక్కునఁ జెడుదురు, వి...

క. హరివిధి సురముని లాదిని
మెఱసియు జన్మించి పిదప మేలుల కెడఁగా
జరయందు మరణమందును
వరుసఁ బ్రవర్తిలిరి కర్మవాసన వేమా! 857

ఆ. హంస మానసోద మంటక తిరిగిన
యట్లుగర్మచయము నంటకుండు
యోగి తిరుగు సకలభోగముతోడను, వి. 858

ఆ. హేమనగము చేతనెప్పుడు గలవాఁడు
వెండికొండపైని వెలయువాఁడు
ఎత్తవలసె బిచ్చ మేమన వచ్చురా? వి... 859

# ధైర్యపద్ధతి.

ఆ. అచ్చుపడఁగ మనసు మచ్చికఁ జేఁబట్టి
ముచ్చటించి శివునిమూర్తిఁ జూచి
కుచ్చితంబు మాని చొచ్చుట యోగంబు, వి.

ఆ. అరసి ధైర్య మూని యతిశయకాముఁడై
నిన్ను నమ్మి నిష్ఠ నెగడుచుండి
నిన్ను గొల్వ ముక్తి నిశ్చయముగ గల్గు, వి....

ఆ. అంతరంగమందు నభవు నుద్దేశించి
తలఁపఁ దలఁప ముక్తి తనకుఁ గలుగు
బాహ్యరంగమందు భయమెంచ ఫలమేమి? వి.

ఆ. అదరిపడక మనసు నానందమును గోరి
మదిని మెలఁగువాఁడు మాన్యుఁ డరయ
సదమలత్వమునను శాశ్వతేశ్వరుఁ డగు, వి...

ఆ. అందరానిపండ దడవి వెన్నెలబైట
ఉండుఁ జూడఁ బెద్దపండుగాను
పండుపడినఁ జెట్టుఁ బట్టంగ లేరయా, వి... ౮౬౫

ఆ. అరుణునుదయసంఖ్య యస్తమానపుసంఖ్య
జననమరణసంఖ్య జాతిసంఖ్య
దీని నెఱిఁగి యోగి ధీరుఁడై యుండును, వి...

క. అష్టాంగయోగసాధన
కష్టంబుల కోర్వలేఁడు కనలేఁడు గదా

చేష్టలు విడువనిజీవికి
కష్టంబగు పుట్టఁ జావ గతి యగు వేమా! 866

ఆ. ఆత్మలోనిజ్యోతి యమరుట లింగంబు
తెలివిచేతఁ గాని తేటపడదు
అది యధైర్యపరుని కంటదు మదిలోన, వి...

ఆది నెవరు పుట్టి రది తెలియంగోర
సోది యగును పిదప సుఖము లేదు
ఆది శక్తి యన్న నది బయలని నమ్ము, వి...868

ఆ. ఇంతి వగప నేల? ఏకాంతబుద్ధితో
హరిహరాదులందు నాశ లుడిగి
శాంతబుద్ధి నుండ సమకూడును సుఖంబు, వి.

ఆ· ఇలను జ్ఞాన మనెడి యీఁత నేర్చినవాఁడు
జడధి యనెడితమము జడియక విడి
విలయ మనెడిగట్టు వెఱవక దాఁటును, వి...

తే. ఉచితమిత్రులు సతి సుతు లూరు పేరు
ధనము ధాన్యంబు పాడియు ఘనమతములు
నాశ మొందును ధీరుఁడై నమ్మఁబోకు
నీవె స్థిరుఁడ వెఱుంగవో నిన్ను వేమ!. 871

ఆ. ఉడుముతోఁకఁ బట్టి యురిదిగా లాగిన
అడుగువిడక పూని యాని యుండు
ముఱికి పైనఁ జేర ముద మొంఁదవలెనట్లు, వి.

ఆ. ఊఁతకట్టఁ బట్టి యురిదిగాఁ బోవుచుఁ
గోఁతి కొమ్మలందుఁ గుదిరినట్లు
జ్యోతియందు పొంచి సోహంబు గనుమయా,వి.

ఆ. ఊఁపఁబోయి కొంత యూఁగించి విడిచిన
నూఁగు గాని గమ్య మొంద లేదు
పట్టుపూన్కి కొలఁది పని సేయులక్ష్యంబు, వి....

ఆ. ఎండనీడవన్నె యేక మౌనట్టుగ
నిండుకుండలందు నిలువఁజేసి
దండితత్త్వ మెల్ల తలపోసి చూడరా, వి...875

ఆ. ఎదుటి తనబలంబు లెంచుకోనేఱక
దీకొని చలమునను దీర్చునేని
యెలుఁగుడివిటిసేవ కేర్పడుచందము, వి...876

ఆ. ఎఱిఁగిన శివపూజ యెన్నఁడు చెడిపోదు
మొదలఁ బట్టుపట్టి వదలరాదు
మొదలు విడిచి గోడ తుదిఁ బెట్టఁగల్గునా?వి...

ఆ. ఎఱిఁగి మనసుఁ బట్టి యేకాంతమునఁ జేర్చి
పరుగులిడక భావపదమునందు
తరముగానిబయలు దాకుట పరమగు,వి...878

ఆ. ఏకరూప మమర నెంచాఁకఁ జూచినఁ
బోక యెఱుకవలనఁ బొందుపడదు
తాఁకి మదిని నిల్పు తత్త్వఱ మంధకు, వి... 879

ఆ. కట్టువార లేరి కట్టనివా రేరి
కట్టికట్టనట్టి కర్మ లేరి
గట్టిపఱచి లెస్స కనుగల్గి చూడుము, వి...880

తే. గుణవికారంబులను ద్రొక్కి గుట్టు తెలిసి
ధణధణాన్వితప్రణవంబు దాటఁ గాని
తృణము సర్వం బటంచును దృష్టి గలిగి
గణుతిఁజేయును మిన్నక ఘనుఁడు వేమ!. 881

ఆ. గుఱుతు గూడు చేసి గుణము వత్తిగఁ జేసి
సరవిఁ గర్మసమితిఁ జమురు సేసి
మూల నొక్కజ్యోతి ముట్టించి చూడరా!' వి.

ఆ. చీఁకటింటఁ జేరి చింతింపఁ బనిలేదు
రాకపోక లెఱిఁగి రంగుమీఱ
నేక తేజమునను నిలఁ ద్రొక్కి చూడరా, వి...

ఆ. చుట్టుపరిజనంబు సుఖలీల చెలువంబు
నడుమ నాయకతయు నర్తనంబు
బ్రహ్మపదము మీఱ బ్రదుకుఁడీ జనులార, వి.

ఆ. ఛేద్యమైనదానిఁ జేపట్టినాఁ డని
మూలవస్తు వెట్టి కేలఁ బట్టి
దాని నూనఁ గలుగు దార్ఢ్యంబు లేకున్న, వి...

ఆ. జాతివేఱు లేక జన్మక్రమంబున
నెమ్మదిని నభవుని నిల్పె నేని
నఖిలజనులలోన నతఁడు ఘనుండయా, వి...

ఆ. తనువనఁ దగునింటఁ దగుశత్రుమిత్రులఁ
దెలియలేని వానితెలి వదేల?
తెలిసి చక్కఁబఱుప దివ్యామృత మ్మదే, వి...

ఆ. తాము వెలయునూర ధూమంబు వాటిల్ల
నట్టియూరు విడిచి యవలఁ బోరె?
కోలఁకు లెండినంతఁ గొక్కెర లుండునా? వి. 888

ఆ. తారకంబుఁ జూచుదారి వేలుగఁ గద్దు
సమముగాను జూడఁ జక్కఁబడును
వెఱ్ఱిగాను జూడ వెలుఁ గెల్లఁ బాలురా, వి...

ఆ. దేవుఁ డనఁగ వేఱుదేశమం దున్నాఁడె?
దేవుఁ డనఁగఁ దనదుదేహముపయి
వాహనంబు నెక్కి వడిఁ గదలును జూడు, వి...

ఆ. ధైర్యయుతున కితరధన మైన నదురేమి?
దాన మిచ్చినపుడె తనకుఁ దక్కె
నెలమి మించుపనికి నెవ రేమి నేతురు, వి...

ఆ. నియమితాసనమున నిలచినచిత్తంబు
తామసంపునిద్రఁ దలఁగఁ ద్రోయు
నిద్ర దొలఁగినంత నిర్భీతి యుదయించు, వి...

ఆ. పట్టుఁ బట్టినతఱిఁ బరవాదము లవేల?
నెట్టుకొన్నతలఁపె నిలుపవలయు?
నట్టిపలుకుల విడ నవనిలో నగుదురు. వి...893

ఆ. పంద నధిపుఁ జేసి బవరంబునకుఁ బంపఁ
బాఱిపోవుఁ గార్యభంగ మగును
బాఱునట్టిబంటు పనికిరాఁ డెందును, వి ...894

ఆ. పొంకములకు మనసుఁ బోనీక సర్వేశు
పంక నిల్పువాఁడు వంశపరుఁడు
వంక నిల్పకున్న వచ్చునా పదవులు? వి... 895

ఆ. ప్రజ లెఱుంగ బ్రదుకఁ బట్టభద్రుఁడు గాఁడు
పైఁ గిరీటముండఁ బ్రభుఁడు కాఁడు
నోగుఁ దెలిసిపలుకు యోగీశ్వరుఁడుగాఁడు, వి.

ఆ. బంటుతనము గాదు బలముతోఁ గట్టిగా
వెంట నుండి మనసు వెతలఁ బఱచు
నింట గెల్చి రచ్చ నిల గెల్వవలెనయా, వి...

ఆ. బోనులోని యెలుక పోఁజూచునట్టుల
జ్ఞానమొంద యెలుక చనును మీఁదఁ
గాన మేను మఱచి ఘనతత్త్వమందరా, వి... 898

ఆ. మంటిమింటిసంధి మన్నవా రెందఱో
యెన్నగాను దరమె యేరికైన?
నున్నవారు చావ నున్నవారే సుమీ, వి...899

ఆ. మట్టు వెట్టి కోర్కి మది నిల్పి చూచిన
గుట్టు మిగుల దానిగుణము దొరకు
నట్టు నిట్టు చెదర నమరదు తత్త్వంబు, వి...

ఆ. మత్సరంబు మదము మమకార మనియెడి
వ్యసనములను దగిలి మసలఁ బోక
పరుల కుపకరించి పరముండ వగు పొమ్ము, వి...

ఆ. మత్తచిత్తులు కలమర్మంబుఁ దెలియక
చిత్తచలన మంది చెడిరి భువిని
చిత్త మచట లేక చిక్కునా పరమాత్మ? వి...

ఆ. మదిని గానవచ్చు మఱి బ్రహ్మమూర్తిని
మదిని గన్న యతఁడె మహితుఁ డగును
వెసకి తనువులోన వేడ్కతో నరసిన
నతఁడె యోగివరుఁ డ టంద్రు వేమ, వి... 903

ఆ. మననవృత్తిఁ బూని మౌనసమాధిలోఁ
దనదుజ్ఞప్తి మఱచి తాల్మితోడఁ
బెంపుఁ జెందువాఁడె ప్రియభక్తుఁ డగునయా,వి

ఆ. మనసునంటి నిలిచి మనసున సుఖియింపఁ
గడకు మోక్షపదవిఁ గనక పోఁడు
చెట్టుఁ బెట్ట ఫలము చేకూరకుండునా,వి...905

ఆ. మనసులోన నున్నమర్మ మంత నెఱింగి
స్థిరముఁ జేసి యాత్మ తేటపఱిచి
ఘటము నిల్పవలయు ఘనత లింకేటికి?,వి...906

ఆ. మర్మ మంతఁ గనక మన సైక్య మందక
పరమగూఢ మింత బయలుపడదు
పడినమాత్ర మెన్న బయలుపడినయంతె, వి...

ఆ. మాయ పోవువిధము మనుజుండు తలఁచిన
మంచిమార్గ మబ్బు మానవులకు
మాయ దాఁటలేని మనుజుండు వ్యర్థుండు, వి.

తే. మాయ మమకారములఁ ద్రుంచి మరగినంత
కర్మకడగండ్లఁ జెప్పను గాలుఁ దెలుఁగు
దీనిఁ గని మెలఁగెడివాఁడె ధీరు డరయ
మాయఁ గనకున్న గతు లెల్ల మాయు వేమ. 909

క. మాయలసంసారమ్మున కై
మాయలనే తిరుగుచుండు మనుజుఁడు లోనై
మాయలఁ దెలిసినయంతట
మాయలనే ముక్తి గలుగు మహిలో వేమా!.

ఆ. మాయభయము లేని మనుజుఁడే మనుజుఁడు
మాయలో మునుంగ మనుజుఁ డగునె?
కాయ మడుగునపుడె మాయయునుడుగును, వి.

ఆ. మింట నంటియున్న మినుకుఁ జూడఁగఁ బూని
యంటలేక కొంద అవిధిపడిరి
కంటి నంటుజ్యోతిఁ గానంగలేరయా, వి... 912

క. ముక్కోణశిఖరమున గుటి
దక్కఁగఁ బరిపూర్తిఁ జెంది ధైర్యము విడకే
సొక్కియు సోలకయుండిన
నిక్కపుఁగైవల్య మదియె నిజముగ వేమా!. 913

ఆ. ముదిత వలపుఁ జూడ మోహింత్రు వారల
చెంతఁ జేరఁగానె చెడును మనసు
వింత భ్రమగుణంబు కాంతఁ జూచినఁ జాలు, వి.

ఆ. మరిగి తిరిగి నరుఁడు మరులుకొన్నను గాక
యందువలన నేమి యాశ గలుగు?
నంతరాత్మ నిలుపు నతఁడె పో తానగు, వి...915

ఆ. మూఁడుగుణములందు ముఖ్యగుణంబును
దెలియలేనివాఁడు వెలయు నెట్లు?
భ్రమల బడినవాఁడు బలువెఱ్ఱియగు ధర, వి.

ఆ మూఁడుగుణము లంటి మూలంబు గనవలె
వీలుగాను త్రిపుటి వెలయ నొక్కి
త్రాడుద్రొక్కఁ బాముఁదలఁచినచందమా, వి...

క. మూఢాత్ములైనమనుజులు
గూఢంబును దెలియ లేక గుఱి గనలేరా?
గాఢాంధకారదూరుని
రూఢిగఁ జేరంగఁ గలుగు రూఢము వేమా! 918

ఆ. మూఁడులోకములను మొనసి యొక్కటిఁ జేసి
యారుతావరముల నంటఁ గూర్చి
స్థిరముగాను యుండుశివమూర్తిగురుఁడయా, వి.

ఆ. మూఁడువేళలందు ముదముతో శివు నాత్మఁ
బూజసేయువాఁడు పుణ్యమూర్తి
పూజలేక మోక్షభోగంబు దొరకునా? వి...

ఆ. మొదట నతఁడు జ్ఞానముద్రాంకితుఁడు గాక
యావిధమును దెలియ నజ్ఞుఁ డగును
నడుమ జ్ఞాన మొదవ నగుబాటు గాదయా?, వి.

తే. మానిని నిజకేళిలోపల మనసుఁ ద్రొక్కి
పూనినంతటఁ బరిపూర్తిఁ బొందుఁ గలుగు
వానిభక్తికి సాటిది వసుధఁ గలదె?
డాంబికము లైన నడుమ నడంగు వేమ. వి.922

ఆ. యాత్ర వోయినాతఁ డెన్నాళ్లు దిరిగియుఁ
బాదమైన ముక్తిపదవిఁ గనఁడు
మనసు నిల్పునతఁడు మహనీయమూర్తిరా, వి.

తే. యుక్తమైనది బయ లని యూహఁ జేసి
రక్తితన్మయ మనియెడి ముక్తి నెఱిఁగి
భుక్తిశక్తులు మఱచుట పూర్ణపదవి
సక్తి పరమాత్మ యందుంచ జగతి వేమ. 924

ఆ. రక్తిలేనిపనులు రమ్యమై యుండునా
రక్తి గలిగెనేని రాజు మెచ్చు
రాజురక్తినందు రమణులు మెత్తురు, వి... 925

ఆ. రాముఁ డొకఁడు పుట్టి రవికులం బీడేర్చెఁ
గురుపతియును బుట్టి కులముఁ జెఱిచె
నిల నధర్మధర్మములరీతు లిట్టివి, వి... 926

ఆ. ఱాయి ఱాయిఁ గూర్చి రాయఁగా రాయఁగా
నున్ననైనయట్టు లన్నిపనులు

పాటుచేసినంతఁ బరిపాటి యగునయా,వి...927

ఆ. రూపు నడకఁ జూడఁ దాపంబు పుట్టిన
భ్రాంతు లంకురించు నంతలోనె
బుద్ధి మఱలకున్న రద్దికి నెక్కురా, వి... 928

తే. లగ్నచిత్తము లోనైన లఘువుఁ దెలిసి
విలయమగు నిచ్చలోపలివిధము నూని
యున్నవాఁ డగు ముక్తుఁ డీయుర్విలోనఁ
బాటుపడ లేమి నెట్లబ్బు ఫలము వేమ? 929

ఆ. లింగ మంగమునను లీలఁ దెలియువెన్క
మనసు లింగమందు మఱలుకొనును
మనసు నిల్పనందె మఱిలింగ ముండురా,వి...

ఆ. వార్తలోని వార్త వైభవ మరయక
మిట్టిపడుదు రిలను మిడుతరీతి
గట్టిచేసి నిలుపు ఘనుఁడెపో శివయోగి, వి...

ఆ. వితరణంపుఁజూడ్కి విశ్వరూపముఁ జూచి
మతిని గడకుఁ ద్రొక్కి మౌన మూని
సతత మెన్నువాఁడు సరసుఁ డీయిలలోన.వి.932

క. విదితం బగు ఘట మవిసిన
నుదితం బగునాకసంబు నుప్పర మొకటౌ
నదెవిధము విదేహం బను
పదమలరె వల్యసరణిసంపద వేమా!. 933

క. వినుమా నిటలముఁ జేరఁగ
ఘనమగు నాకశక్తి కలదు కడుఁ జిత్రముగాఁ
గనుఁగొన దానికి నవ్వలఁ
గనకం బనుజ్యోతి గలదు కనుమా వేమా! 934

ఆ. వీరశైవధర్మవిధము లెఱింగియు
బ్రహ్మవిద్యమీఁదఁ బరగె నేనిఁ
జెలఁగి పులికి బంటు సింగపుఁబిల్లయౌ, వి. 935

ఆ. వేఁడుచున్నయట్టి వినయంబుఁ జూపుచు
గోఁత దింపు సుమ్ము కొండెగాఁడు
చేర్పరాదు వానిఁ జెఱుచును దుది నెట్లొ, వి.

తే. వేయుఁగ్రతువులు పనిలేదు వేడ్క మీఱఁ
జేయుక్రియలెల్ల గురుభక్తి చిత్తమందుఁ
బాయకుండుట ముక్తికి బాట యగును
న్యాయమగుమార్గ మిద్దియౌ నవని వేమ. 937

ఆ. వేముచెక్కఁ దిన్న విషరోగములు పాయు
దేహకాంతి కలుగు దృఢము కలుగుఁ
దినఁగఁదినఁగ నదియె తీయగా నుండును, వి...

ఆ. వ్యాధివచ్చినపుడు వైద్యునిచే మందు
దీసి తినక కాని తీఱ దెందు
మందువంటి మనసు మనుజుండు కనవలె, వి...

ఆ. శ్వాస లాగి పిడిచి సాధింప నేర్చిన
మోహపోక ముక్తి మూటఁగట్టు

దోసకారిగుణము గానిఁ జెందకపోదు, వి...940

ఆ. షోడశాక్షరముల శోధించి మది నెంచి
గూఢభావ మూని కుదియఁ బట్టి
వేడు కలర ముక్తి విన్నంది చూడరా, వి...941

ఆ. సకలజీవములను సమముగా నుండెడి
యతనిక్రమముఁ దెలియునతఁడె యోగి
యతఁడ వీవెయనుటనన్యుండు గాఁడయా, వి...

ఆ. సకలవిద్యలఁ గని సంతోషపడవచ్చుఁ
జేయి సాఁచి కాసు నీయలేఁడు
చెలఁగి యొరుల కైనఁ జెప్పవచ్చును గాని
తాను జేయలేఁడు ధరను వేమ. 943

ఆ. సకలవిద్యలందు సంపన్నులై యున్న
నట్టివారు పరిచయమునఁ జౌక
పెరటిచెట్టుమందు పరికింప మెచ్చరు, వి...944

ఆ. సక్తిగలుగు పనులు చక్కఁగా నెఱవేఱు
భక్తిగలుగు పూజ ఫలము నిచ్చు
యుక్తికలుగు మాట యొప్పునురా భువి, వి.945

ఆ. సంతలోనిసరకు సరసమాఁ గొనవచ్చు
వింతలంది పొంద వివర మేది?
చింత దీర్చి చూడఁ జిన్మయజ్యోతిరా, వి...946

క. సంతతసమాధిఁ బ్రజ్ఞను
వింతలు తలపోయకుండ వివరించినచో

నంతరమునఁ బరమాత్ముఁడు
వంతవ్యుఁడు వెలుఁగుచుండు మదిలో వేమా!

తే. సచ్చిదానందమగు జ్ఞప్తి సరవిఁ జేరి
మెచ్చి చిన్మాత్రమా శక్తి మేను మఱచి
నిశ్చలత నున్నవాఁడె పో నిత్యయోగి
నిశ్చలాత్ముని శివుఁ డనవచ్చు వేమ. 948

ఆ. సరవితోడఁగూడు స్వాధిష్ఠచక్రంబు
ప్రాణపవనములను బందు చేసి
వెడలకుండువాఁడె వేదాంత వేత్తయా, వి....

ఆ. సవతితల్లిఁ జూడ సాకుల నెఱపును
స్వంతతల్లివలెను నైఁప దెపుడు
వింత లడచి లోని విజ్ఞాన మందరా, వి.... 950

తే. సాధుసాంగత్య మమరిన శాంత మమరు
శాంత మమరినఁ జిత్తంబు శక్యపడును
శక్యపడిన మనంబె యొసంగుఁ బరము
పరము గాంచిన శివుఁ డనఁ బరగు వేమ. 951

ఆ. సాముఁ జేసి జెట్టి సాహసియై యుండు
సాముఁ జేయకున్న సరణిఁ గనఁడు
సాముఁజేయువాఁడు చావక యుండునా?, వి....

ఆ. సాహసమున నైన సత్యముచే నైన
మోహబుద్ధి విడిచి ముక్తి నెఱిఁగి
చేర్చి మదిని గురుని జెలరేఁగి యుండరా?, వి.

ఆ. సుఖము లెల్లఁ దెలిసి చూడంగ దుఃఖముల్
పుణ్యములును బాపపూర్వకము లె
కొఱత వేయ దొంగ కోరినచందమా, వి...954

ఆ. సేవఁ జేసి గురుని స్థిరభావ మందెడు
త్రోవ నంటి జ్ఞప్తిఁ దొలఁగనీక
భావమందె పరము బరికించి చూడరా, వి...

తే. స్వాత్మతన్మయ మనసంబు సంగ్రహించి
నిర్గుణబ్రహ్మపదవికి నెఱయ బుద్ధి
నొక్కి నిర్భయ మందుటే నుడువుటండ్రు
వేదవేదాంతసారార్థవిదులు వేమ. 956

ఆ. స్త్రీలమాయచేతఁ జిక్కుఁబాఁ గొన్నాళ్లు
తగులుగోసు నట్లు తగిలిపోవుఁ
దనిసిపోనిసి తుదను దైవంబుచేఁ జెడు,వి...957

క. హయ మఱి పరువు లిడుగతి
రయమునఁ బాఱెడిని మనసు ప్రతికూలముగా
నయమో భయమో చూపుచుఁ
బయనము సాగింపనీక పట్టర వేమా!.... 958

ఆ. హరుఁడు గురువు గాదె? యఖిలంబు తాఁగాదె?
యనుభవింపరాదె? హరునిఁ గూర్చి
యతికినంతలోన నంధకారం బేల? వి...., 959

ఆ. స్థూల మగును గుర్దు సూక్ష్మమాఁ గన్నాప
పాపలోనిజ్యోతి పరమపదము

మాపు రేపు నాక పదవి నంటి చూడరా, వి....

ఆ. హరిహరాదులందు నాశను దిగనాడి
శాంతబుద్ధి గూడి సగుణమందుఁ
జింత మాని పిదపఁ జిన్మయ మందరా. వి,....961

ఆ. హానిచేతఁ గలుగు నధికదుఃఖంబులు
హానిచేతఁ దప్పు నరయ సుఖము
హానిచేతఁ గొంత యలమట గలుగురా, వి,...

ఆ. హేమకారవిద్య నెఱిఁగినవా రెల్ల
వెతలఁ బడనియట్లు విద్యచేత
దత్త్వ మెఱుఁగువెనుకఁ దనకుఁ జింతేలరా?,వి.

ఆ. హేమనగము చేత నెప్పుడుఁ గలవాఁడు
వెండికొండమీఁద వెలయువాఁడు
ఎత్తవలసె బిచ్చ మేమనవచ్చురా, వి... 964

ఆ.హృదయమందు శివునిఁ జెదరక నిల్పిన
పదిలుఁ డగును భవుఁడు ప్రాపు గాను
గదిసి నొక్కి మదిని గ్రక్కునఁ జూడరా, వి...

ఆ. క్షమగలట్టియతఁడు సాధువై శోభించు
నోర్పుఁబోలునట్టి దుర్విఁ గలదె?
వన్నెవచ్చు మేలు లెన్నియైనను గూడు, వి...

ఆ. క్షుత్తు దప్పి నిద్ర క్షుభితములై యుండు
రిత్తలోకమాయ రీతి గాదె
సత్తు పూర్ణసుప్తి సాధింపవలెనయా, వి...967

ఆ. అంగ మెల్ల వదలి యటు దంతములు నూడి
తనువు ముదిమిచేతఁ దఱచు వడఁక
ముప్పుత్రిప్పులఁబడి మోహంబు విడువఁడు,వి.

ఆ. అగ్నిచక్ర మనఁగ నాకర్ణలింగంబు
అగ్ని గుండమందు నంటఁ గూర్చి
భవునిధ్యాన మిఁకను బాటింప ముక్తిరా,వి.969

ఆ. అగ్నిగుండమందు నమరంగ ఘటియించి
యవని నీరు బియ్య మందునుంచి
అది పచనము గాఁగ హరుని కర్పించుము, వి....

ఆ. అగ్నిశిఖలయందు నమరంగ మమకార
మభవుమీఁద ధ్యాన మమర నునిచి
యాహుతి యగువెనుక హరుని కర్పించుము,వి.

క. అజ్ఞాన మనెడియడివిని
సుజ్ఞానపుఖడ్గమునను జూచి నఱకరా
యజ్ఞాన మాత్మఁ దెలుపుట
సుజ్ఞానపుదివ్యపదము చూడర వేమా!... 972

క. అంతయు బ్రహ్మామయం బని
మంతనములు మాని మనసుమర్మము గనినన్
వింతలు బయటను నున్నగుఁ
జింతలు విడినట్టివాఁడె సిద్ధుఁడు వేమా!... 973

ఆ. అంతరంగమందు ననువుగా శోధించి
తలపఁ దలఁప ముక్తి తనకుఁ గలుగు

బాహ్యరంగమందు భావింపఁ దెలియునా! వి...

ఆ. అంతరంగమందు నభవు నుద్దేశించి
నిల్పి చూడఁ జాడ నిచ్చుఁగాక
బాహ్యమందు శివుని భావింప నిలుచునా, వి...

ఆ. ఆది యొకటి దెలిసి యాదిని మది నిల్పి
యాది పాయకున్న నభవుఁ డగును
ఆది పాయువాఁడి కంధునిరీతిరా? వి... 976

ఆ. అధరసుధను జూచి యన్నియు మఱచును
దరుణిరూపుఁ జూచి తన్ను మఱచు
నుక్తు లాలకించి యోగంబు మఱచురా, వి...

ఆ. అరసి సూక్ష్మమైన యానంద మెఱుఁగక
మతియు లేక చదివి మందుఁ డయ్యె
నలరహస్య మెల్ల నాతఁ డె ట్లెఱుఁగును, వి...

ఆ. అన్నరసమువలన నలబిందురస మయ్యె
బిందురసమువలన బీజ మయ్యె
బిందుబీజములను భేదించి చూడరా, వి...979

ఆ. అభవుననుభవమును నార్గు రరులు నీల్గ
సంశయంబు లేదు సాధకులకుఁ
జెంత దీప మిడక చీఁకటిపోవునా? వి... 980

క. అమలాత్ముని మానసమున
విమలాంతర్గతుని గాఁగ వివరింపవలెం

గ్రమమైన చాయలందున
మమకారము నెట్టవలెను మహిలో వేమా!...

ఆ. అమృతసాధనమున నందఱు బలిసెవ
రమృతమెంచి చూడ నందలేరు
అమృతము విషమాయె నది యేమిచిత్రమో, వి.

ఆ. అరయఁ గంటిదృష్టి గుఱిగను ముక్కుపై
రెప్పపడక గుడ్లు త్రిప్పిపట్టి
వివర మెఱుఁగ శాంభవీముద్రయదియండ్రు, వి.

ఆ. అలవిగాని బయలు నందిన మదిఁ జూడఁ
గూడి మెలఁగుచుండఁ గోచరించుఁ
జూడఁ జూడ నెఱుక చోద్యమై తోఁచురా, వి.

ఆ. అష్టకష్టములకు నాలయమై యుండి
గతులు దుర్గతులను గన్న దెదియొ
కానకుండఁబోయె గగనస్వరూపమై, వి... 985

ఆ. అక్షయాత్మకంబు నర్థింప గుఱి గని
నిశ్చయంబుగాను నిలిపి మనసు
రక్ష గట్టినట్లు రట్టడి మాన్పరా, వి... 986

ఆ. అస్థిరమగు మేని కదరుపాటులఁ బొంది
పెక్కువిధములందుఁ బెంచి పెంచి
యగ్ని కిచ్చు లేక యడవినక్కలకిచ్చు, వి...987

ఆ. ఆకు కానవచ్చు హరిహరాదులకైనఁ
గొమ్మ కానరాదు కోరిచూడఁ

గొప్ప కానరాకకొనియాడకుందురా? వి...988

ఆ. ఆఁడు దనఁగ రోఁత యది చూడఁగా రోఁత
తలఁచిచూడఁ దనకుఁ దానె రోత
ఎంతవారి కైన నింతియే బలఘాత, వి.... 989

ఆ. ఆత్మబుద్ధివలన నఖిలంబు తా నయ్యె
జీవబుద్ధివలన జీవుఁ డయ్యె
మోహబుద్ధివలన ముదితల దర్శించె, వి... 990

ఆ. ఆత్మలోనిజ్యోతి యమరుట లింగంబు
తెలిసి చూడకున్న తేటపడదు
అదియుగురువులేకయబ్బునా తెలియంగ? వి...

ఆ ఆది మూలమేది యాధార మెయ్యది
సోది జెప్పఁదరమె సుద్దులరసి
తోడు లేక లోనితుల్యముఁ గనుమయా, వి...

ఆ ఆపగాళివెంట నడవులవెంటను
కొండరాలవెంట గొడవ యేల?
నుల్లమందు శివుఁడటుండుట తెలియవే? వి...

ఆ. ఆఱువేషములను నరయంగఁ గడువింత
యాత్మయందు ధ్యాన మమర దెందు
భీకరంబు గాని బిరుదు లేదు విరక్తి, వి.... 994

ఆ. ఆలి నమ్మి భువిని నాచారహీనుఁడై
ప్రాలుమాలె నొక్కప్రతినకొఱకు
ఆడి తప్పకుండ కాడుకాఁచినవాఁడు

వాఁడె పరమగురుఁడు వసుధ వేమ! 995

ఆ. ఆలు బిడ్డ లనుచు నతిమోహమున నున్న
ధనముమీఁద వాంఛ తగిలియున్న
నట్టినరుల కెల్ల నవని ముక్తియె లేదు, వి....996

ఆ. ఆలుబిడ్డలు ధన మరయఁ దల్లియుఁ దండ్రి
కలమనుజుఁడు మిగుల గష్టపడును
తనకు నెవరు లేరు తాను బ్రహ్మముగన్న, వి...

ఆ. ఆలుసుతులు మాయ యన్నదమ్ములు మాయ
తల్లిదండ్రిమాయ తాను మాయ
తెలియనీదుమాయ దీనిల్లు పాడాయె, వి...

ఆ. ఆవుచన్నుఁ బితికి ఆపాలు గాచినఁ
బేరి పెరుగు చల్ల పేర్లుగలుగు
తవిలి లోనఁ గలదు నవనీత మిట్లురా, వి...

ఆ. ఆవుపాలు శివుని కభిషేకమున కౌను
ఆవుపాలఁ జూడ నౌషధంబు
నావుపాల నున్న యతిశయ మెఱుఁగుఁడీ? వి.

ఆ. ఆశలనెడి త్రాళ్ల నఖిలజంతువులెల్లఁ
గట్టుపడును గాన నిట్టిలమున
జ్ఞానమనెడిచురియఁబూనికోయఁగరాదె, వి.

ఆ. ఆశలనెడిత్రాళ్ల నమరఁగోయఁగఁజేసి
పారవైవఁగాని పరము లేదు
కొక్కుతిండియాసఁ జిక్కి చచ్చినయట్లు, వి.

ఆ. ఇచ్చువానికంటె నింద్రియనిగ్రహుం
డజియ నతనికంటె నధిపుఁ డగును
వాఁడు వానికంటె వీడును పాపముల్, వి...

ఆ. ఇట్టికనుల బ్రహ్మ మెట్టు చూడఁగవచ్చుఁ
జూచుకనులు వేఱు చూపు వేఱు
చూపు లోన నుంచి చూడంగ వలవదా? వి.

ఆ. ఇట్టితనువు గలిగి యీలోకమందునఁ
బుట్టి చచ్చు భ్రమను గట్టిగాను
తెట్టతెరవుఁజేరి తెలివంటి చూడరా, వి....1005

ఆ. ఇంటిలోనికోఁతి యిరవు గానఁగ లేక
తిరుగఁ బోవువారు తీఱకుంద్రు
కోఁతి నొకటి నిల్పి కుదురుండలేరయా, వి...

ఆ. ఇంటివెనుక తీఁగ యింగ్లీక ముండంగ
పారదంబు గలుగ బసిఁడియేల?
సత్తు పొత్తుఁజేసి సాధింపవచ్చురా? వి... 1007

ఆ. ఇంతకాలముండి యెఱుకమాలినజీవి
చచ్చి పుట్టుచుండు సహజమనుచు
నెఱుకమఱచుచోట నెఱుఁగునా బ్రహ్మంబు? వి.

ఆ. ఇంతిగన్నఁ జన్ను లింతింతలని చూచి
మోహమొందు బుద్ధి మోసపోయి
గరితలేనివాని కానలేదాయెరా, వి... 1009

ఆ. ఇంతిఁ జూచెనేని యింతింత యనరాదు
కాలవహ్ని లక్క గరఁగినట్లు
వట్టిమోహ మిట్లు రట్టులఁ జేయురా, వి.... 1010

తే. ఇంతి యాకృతిపైనాస కెదురుసూచి
చింతలోఁ బడి ప్రాణముల్ చిక్కఁబట్టి
యంతు గనలేక చచ్చెద రవనిలోన
కాముకులగతి యీరీతి గాదె వేమ! 1011

ఆ. ఇంతులఁ గనఁగానె యింతింత యనరాదు
నగ్గి లక్కఁ గరఁగ నైనరీతి
వెలయుమోహ మిట్టి వింతలు చేయురా, వి...

ఆ. ఇంద్రలోక మనఁగ నింద్రజాల మనఁగ
నింద్రపదవి యనఁగ నిన్ని యొకటె
కలియుగమున నరులు కానరు భ్రమచేత, వి....

ఆ. ఇంద్రియములచేష్ట లెన్నక భువిలోనఁ
దన్నుఁ దెలిసి మదిని తమక ముడిగి
మింటిమంటినడుమ మిత్తినిఁ ద్రొక్కరా, వి...

ఆ. ఇంద్రియముల భ్రాంతి నీరేడుజగములు
మందు బెట్టినట్టు మరులు గొనుచుఁ
బొందు సుఖముచేత పుత్రులఁ గాంచిరి
సకలజనులు నిట్లు జగతి వేమ! 1015

ఆ. ఇంద్రియముల విడిచి యేకతతో నిల్చి
ఎఱిఁగి పిదప తన్ను నెఱుఁగవన్న

యతఁడె మౌని జ్ఞాని యగునని యందురు, వి.

ఆ. ఇంద్రుఁ డాయె కామి హీనుఁడై పోయెను
మారుఁ డాయె కామి మడిసి పోయె
బ్రహ్మ మయ్యె కామి బయిసిపోనాడెను, వి...

ఆ. ఇంద్రుఁడైనఁగాని చంద్రుఁడైనను గాని
నంద దుర్గ మెక్కి నాతితోడఁ
బొందుఁ బడక ముక్తి పోరాడవలెనయా, వి...

ఆ. ఇన్ని నాళ్లనుండి యెనసినమోహంబు
చెలిమిఁ జుట్టతికము చెల్లె లక్క
తల్లి దండ్రి బిడ్డ దాయాదు లనునిట్టి
భ్రాంతిచేతఁ జిక్కుఁబడుర వేమ! 1019

క. ఇల్లసుమీ సంసారమె
యిల్లసుమీ యాయుధంబు నీఁక చాలంగా
దల్లీసుమీ పంచాక్షరి
కల్లసుమీ సతులసలపు గనుఁగొన వేమా! 1020

ఆ. ఇష్టసిద్ధికొఱకె యీరారుబీజముల్
కష్టమునను జదివి కానలేరు
నిష్ఠలోన నిష్ఠ నిజమని కనవలె, వి... 1021

ఆ. ఇహమునందు సుఖము లీడేరఁగాలేదు
పరము నమ్మెనేని బ్రదుక నగునె
మొదట లేనిసుఖము తుది నెట్లు కల్గును? వి...

ఆ. ఈఁతరానివాఁడి కెగరోజి యెగరోజి
యేరు దాఁటఁగలఁడె యీఁదఁబోయి
పరుఁడు గానివాఁడు పరలోక మందునా? వి.

క. ఈమాయ జగము జూడఁగఁ
బ్రేమాస్పదదృష్టిలోనఁ బెంపగుచుండున్
కామాంధకారమునఁ బడి
దీమసమునఁ దెలియలేరు దేవుని వేమా! 1024

క. ఈలోకచిహ్న లన్నియు
మేలుగ గురుశక్తి గూడి మిన్నందినచోఁ
గాలుఁ దెదుర్కొనఁ జాలఁడు
చాలును జన్మంబు లనుచుఁ జాటర వేమా! 1025

ఆ. ఈశున కియ్యది యిసుమంత యగుపొద్దు
బ్రహ్మాలే నొసఁగితి పాడుపొద్దు
విష్ణుదేవున కిది విపరీతముగ పొద్దు, వి... 1026

ఆ. ఈశుమీఁద భక్తి యిసుమంతయును లేక
పాశమందుఁ జిక్కి ఫలముఁ గనక
కాశియాత్రఁ బోవఁ గాలుఁ దెలుంగఁడా? వి...

ఆ. ఈషణత్రయంబు నెడపంగ నేరక
మోహరాశిలోన మునిఁగియుండు
జనుల కెట్లు మోక్షసౌఖ్యంబు కల్గును? వి...

ఆ. ఉచ్చచెలమ గోరి యున్నది జగమెల్ల
పిచ్చిపట్టి తిరిగి వెనఁగుచుంద్రు

తుచ్ఛసుఖము దీని ద్రుంపఁగలేరయా, వి...

క. ఉచ్ఛను పుట్టిన తనువట
హెచ్చేమి యోఁగొంచెమే మొయేర్పడఁదెలియన్
మచ్చరము మాని సత్యం
బచ్చున నిల్పినను బ్రహ్మ మతఁడే వేమా! 1030

ఆ. ఉచ్చలోనె పుట్టి యుచ్చలోనె పెఱిగి
యుచ్చ కాసపడుట యుచిత మగునె
యుచ్చరోయువాఁడె యుత్తమయోగిరా, వి...

ఆ. ఉయ్యెలందుఁ జేర్చి యూహించి నిద్రింప
నెయ్య మమర మదిని నిలుపినపుడె
దయ్యవంత బ్రహ్మ తన్మయమందును, వి...

ఆ. ఉఱుము మెఱుఁగురీతి నొప్పెడి మదియందు
మరులు సేరి దాని మహిమ నెరుప
నరులు మరులఁ దగిలి నరక మందెదరయా, వి.

ఆ. ఊరు కొండవీడు నునికి పశ్చిమవీథి
మూఁగచింత లెల్ల మొదటియిల్లు
ఎడ్డెరెడ్డికుల మదేమని తెల్పుదు, వి... 1034

ఆ. ఊసరిల్లి పిచ్చి యుపమున రసమును
జేర్చి నూరి సతులు చెలువముగను
వశ్య మనుచు మగని వరియించి పెట్టంగ
రోగ మమరి నీల్గు రూఢి వేమ! 1035

ఆ. ఋషు లటడవినుండి రుచులఁ గోరుట రోఁత
నరులు కలిగి తినమి యరయ రోఁత
భార్య లనుచు వారి భరియింపమియు రోఁత, వి.

ఆ. ఋత మనృత మెఱుంగ నెవ్వరితర మగు
స్థితియు గతియుఁ దెలియ తేటపడును
విన్నమాత్రముననె వివరింపఁగా రాదు, వి...

ఆ. ఎంగి లెంతపట్టు హీతవుగా నెంచక
యొగ్గియుందు రంత నుర్విజనులు
కన్న యెంగి లెంత కను నెంగి లధికమౌ, వి...

ఆ. ఎగ్గుసిగ్గులేని దేకమై తోఁపఁగా
మొగ్గి చూచు టల్ల మూలవిద్య
తగ్గి యొగ్గ కెపుడు తాఁకుట పరమురా, వి...

ఆ. ఎచ్చుకులము నొంది యెన్నాళ్లొ బ్రదికినఁ
జచ్చి పుట్టి జన్మశతము లగును
మెచ్చునట్టి పూజ మెప్పుగాఁ బూనరా, వి...

ఆ. ఎట్టియోగికైన నిల మన్మథావస్థ
తెలియవచ్చునేని తేటగాను
యోగ మెల్ల నుండి జోగియై పాడగు, వి...

ఆ. ఎట్టివాఁడొ తా నదెఱుఁగఁడు తొలిపుట్టు
నీచజీవనమున నీమమేల
ఎఱుఁగుఁడయ్య లోక మీశ్వరమయ మని, వి.

ఆ. ఎంతకష్టముండు నంత పాపపుఁజింత
చింతచేత. మిగులఁ జీవుకు మనసు
చింత లేకయున్నఁ జెడనిసంపదఁ గాంచు, వి...

ఆ. ఎంతకాల మున్న నెఱుక లేకయె జీవి
చచ్చి పుట్టుచుండు సహజముగను
ఎఱుక మఱపు గలుగ నెఱుఁగునా బ్రహ్మము,వి.

ఆ. ఎంతనాఁటినుండి యెనసిన మోహమో
చెలిమిచేతఁ దల్లి చెల్లె లక్క-
యన్న దమ్ము లనెడి యాభ్రాంతినే పడు, వి....

ఆ. ఎంత నేర్పుతోడ నేమేమి చదివినఁ
జింత లేనివిద్య చిక్కఁబోదు
పంతగించి మదిని బరికించి చూడరా, వి...

ఆ. ఎన్ని వేషములకు నెఱుకయే మూలంబు
యముని గెలువవలెను సమయ మెఱిఁగి
దొంగ వసతి గాక దొరకునా సౌఖ్యము, వి...

ఆ. ఎఱిఁగి మరిగి తిరిగి యేకాంతమును గోరి
పరుగులిడక యోగపథము పట్టి
పరము గోరి మించఁ బరిపూర్తి నెందురా, వి.

ఆ. ఏకచక్రధరుఁడై యెల్లలోకంబులఁ
బాక మెఱిఁగి యేలు ప్రభుఁడు గాఁడు
రాకపోక లడవి రాజిల్లు మదిలోన, వి... 1049

ఆ. ఏకసమమునందు ఎఱుక గల్గినయోగి
పరుల నెఱిఁగి చూడ భావమందు
ఆశలేక మించి యన్నిటఁ దానగు, వి.... 1050

ఆ. ఏడు నైదు నాలు నెనిమిది తొమ్మిది
యేమి కట్టునుండి యెట్లు తిరుగు
వాడి వాడి నంత వాడద దేమొకో, వి...1051

తే. ఏదికోరిన నీకోర్కె యెఱుక యగును
ఏది కోరిక నిండెనో యిరవు నగును
సాధువిద్యకు ధరలోన సమము లేదు
కోవిదుల కిది దెలిసిన గుఱుతు వేమ! 1052

ఆ. ఒడలిమెఱుఁగుఁ జూచి నడసొబగును జూచి
వంకకొప్పుఁ జూచి వనితఁ జూచి
విటులు కడుపులోన వెత నొందకుందురా, వి.

ఆ. కడుపులోన నున్న ఘనమైనపిండంబు
ముందు కష్టమెల్ల మొదలరోసె
ఇంక నైనబుద్ధి యేర్పడ పుట్టదా, వి... 1054

ఆ. కల్మషంబు పోక కనుపింప దెందును
రూప మెవ్వరికిని రూఢితోడ
దామసం బుడిగినఁ దగ గల్గు జ్ఞానంబు, వి...

ఆ. కాంత కుంక యైనఁ గానికులం బైన
పాయలేక విటుఁడు భ్రమసియుండు
మఱిగి గ్రుడ్డికుక్క మాంసంబు గొన్నట్లు,వి.

ఆ. కాంతసిందురంబు కడుఁ బిత్తరోగికి
నొనర మధువుతోడ నొసఁగినంతఁ
దనరు దేహబలిమి ధన్యుఁడై గట్టెక్కు, వి...

ఆ. కామచింతఁ జిక్కి కనుగాననేరవు
నీమనిష్ఠఁ దగిలి నియతి మీఱి
తామసంబు నడఁచి తన్మయ మందరా, వి...

ఆ. కాయమును గనకయుఁ గనియు నావల నున్న
కాయమును విడచినఁ గాఁడు యోగి
కాయమందు ముక్తిగతి కేఁగవలయురా, వి...

ఆ. కాయ మున్నయప్డె కామాదులను గోసి
జ్ఞానమార్గమునకుఁ గడఁగవలయు
జాగు చేయఁ గాయ మేఁగిన నేమగు? వి...

ఆ. కాలు చేయి వంచి గాలి నిండఁగఁ జేర్చి
నేలవ్రాలి కొన్ని నిలిచి కొన్ని
యాసనముఖవిద్య లభ్యాసవిద్యలు, వి... 1061

ఆ. కావుకావుమనుచు కాళ్లుండి పలికెడి
కాకికరణి బల్కి కానరారు
బాపలైనవారు బ్రహ్మము నెఱుఁగరు, వి...1062

ఆ. కులము హెచ్చుతగ్గు గొడవలు పనిలేదు
సానుజాత మయ్యె సకలకులము
హెచ్చుతగ్గుమాట లెట్లెఱుంగఁగ వచ్చు, వి...

ఆ. కూడు గుడిచి లెస్సఁ గూర్చున్నవాఁడైన
నాఁడుదాని గన్న నట్టె తగులు
నన్నసార మొడలి కతిమదం బిడునురా, వి...

ఆ. కూడు బెట్టుకున్న కుక్షిలో జఠరాగ్ని
భక్షణంబు సేయు కుక్షిమలము
కూడువిడిచి మలము గుడుచురా యుపవాసి? వి.

ఆ. కొమ్మ ద్రిమ్మరైనఁ ద్రిమ్మరుల వలచు
సరస విటుల నేల సమ్మతించు
పేఁడఁ దిన్నపురుగు బెల్లమే మెఱుఁగును? వి...

ఆ. కొండెగాఁడు చావఁ గొంత దనుకఁ బోవు
వంతు కింతెగాని వగపు లేదు
కొంకినక్క చావ గొత్తె యేమిటి కేడ్చు, వి...

ఆ. ఖచరవరులు భూమి గనఁబడ రందురు
కానవచ్చినంత గౌరవింత్రొ?
తల్లిదండ్రిగురులు తత్సముల్ గారొకొ? వి...

ఆ. ఖనులఁ బుట్టు లోహగణమునం దెల్లెడఁ
బనికివచ్చు నొక్కయినుమె చాలు
నైనఁ జులుకపఱతు రది యెచ్చుగా నుంట,వి...

ఆ. గట్టుమీఁది మన్ను చట్టుపైఁ దగురాయి
పుట్టలోనివాని బుడుగు తోడుగు
గట్టిగాను మూటఁ గనకంబు పుట్టును,వి...1070

ఆ. గద్దెగణము నిద్ర కలలు కోరికలును
ముద మొసంగు శకునములును జెలఁగు
ప్రశ్నలు పదివేలు పరికించి చూడఁగా, వి...

ఆ. గాసిఁ జెందనేల గతికామమును మించి
వాసిగాను భక్తి వరుసదెలిసి
మోసపోక యెఱుక మునియుట కానరా? వి...

ఆ. గుటికి రావు జగతి కోమటినిష్ఠలు
లోభితనముచేత లోనికడఁగు
పులియు దాసరి కిడుపాలుపగుచందమౌ, వి...

ఆ. గొప్పపిఱుఁదు గన్న కుచకుంభములు గన్న
చెప్పరానిచోటి చెలువు గన్న
ముప్పిరిగొనునయ్య మొనసిన మోహము, వి...

ఆ. గోచిపాతఁ బెట్టి కోరి తా ముని నంచు
మనసులోనియాశ మానలేఁడు
అక్కు తెన్న వే ఱికాశ యెన్నఁగ వేఱు, వి...

ఆ. గోచి విడుచుయోగి గోఁతిగా నాడించి
వెఱ్ఱివానిఁ జేసి వెతలఁ జిక్కఁ
జేయునయ్య లేమి చేసెదరో రేల? వి... 1076

ఆ. గృహముదేహ మొండె కేవలగుణ మొండె
దాని నిలిపికొనియు దీని దీర్పఁ
గానరా దె నీకు నానందసుఖమది, వి... 1077

ఆ. ఘటము గాన్గఁ జేసి ఘనగుణ మెద్దుగా
దవిలి కర్మములను నువులఁ జేసి
తెలిసిగానుగాఁడు విలకారకాత్మము, వి...1078

ఆ. చిత్తము గలయోగి శివునివలెనె యుండు
మిథ్యయోగి యుండు మిడుతవలెను
నిత్యుఁడైనయోగి నీవలె నుండును, వి...1079

ఆ. చింతఁ జెంతనుండు చేమంతిపూబంతిఁ
గాంతఁ జూడఁ దలఁచు గౌఁగిలింప
నంతమంతనమున నానందకేళిరా, వి... 1080

ఆ. చీఁకటింటఁ జేరఁ జేదివ్వె లేకయే
రూక గానరాదు రూఢిగాను
రాకపోక లడఁచి రవములో విని సొక్కు,వి...

ఆ. చెలిమి మీఱ మదిని జింతలు విడనాడఁ
బిన్న పెద్దలకును పెరిఁగివచ్చు
మంటిమింటినడుమ మదినిల్పి చూడుము, వి...

ఆ. చచ్చెఁ జచ్చె ననుచుఁ జా వెంచి వగచెడు
దీన నరుల వెట్టి దెలుపరాదు
ప్రాణమునకు మృత్యుబంధము లుండునా, వి...

ఆ. చమురు రాచికొన్నఁ జర్మంబు మెఱుఁగెక్కు
సాము చేయ మేను సత్తువెక్కు
జ్ఞానమార్గ మెఱుఁగ కడతేరు జన్మంబు, వి...

ఆ. చాడికాని మాట చావిడిలో నిక్కు
వేట బోశునకము వెలయ నిక్కు
వెలది జూచునపుడు విటకాడు నిక్కురా, వి.

ఆ. చాలు చాలు నిలను జననమరణములు
మేలుగావు మాయ మెలకు వెఱిగి
ప్రాలుమాల కిలను భక్తిచే బూనుము, వి...

ఆ. ఛిద్ర మెన్నువాడు శిష్యుడు తా నౌనె?
ఛిద్ర మెఱుగువాడు శిష్యు డగును
ఛిద్ర మెఱిగి విడువ భద్రంబు చేకుఱు, వి...

ఆ. ఛేద్యమైనదాని జేపట్టినా డని
మూలవస్తు వెట్టు కేల బట్టు
దాని నూన గలుగు దార్ఢ్యము లేకున్న, వి...

క. జగ మరయ నింద్రజాలము
జగ మనగా మాయ సుమ్ము జన్మాదులకు
భగవంతు డగును బ్రహ్మము
నిగమాగమనిర్వికారనిపుణుడు వేమా! 1089

ఆ. జంతురాసులందు జనియించి జనియించి
దిమ్మపట్టినట్టు తిరిగి తిరిగి
తనువు నిత్య మంచు దలపంగ నవ్వరో, వి...

ఆ. జనన మెట్టు కలిగె జాతి యెయ్యది యయ్యె
జననమరణములకు జాడ లెఱుగ
వినగ వినగ దీని వివరించికానరో, వి...1091

ఆ. ఘటము గాన్గఁ జేసి ఘనగుణ మెద్దుగా
దవిలి కర్మములను సువులఁ జేసి
తెలిసిగానుగాఁడు విలకారకాత్మము, వి...1078

ఆ. చిత్తము గలయోగి శివునివలెనె యుండు
మిథ్యయోగి యుండు మిడుతవలెను
నిత్యుఁడైనయోగి నీవలె నుండును, వి...1079

ఆ. చింతఁ జెంతనుండు చేమంతిపూబంతిఁ
గాంతఁ జూడఁ దలఁచు గౌఁగిలింప
నంతమంతనమున నానందకేళిరా, వి... 1080

ఆ. చీఁకటింటఁ జేరఁ జేదివ్వె లేకయే
రూక గానరాదు రూఢిగాను
రాకపోక లడఁచి రవములో విని సొక్కు, వి...

ఆ. చెలిమి మీఱ మదిని జింతలు విడనాడఁ
బిన్న పెద్దలకును పెరిఁగివచ్చు
వంటిమింటినడుమ మదినిల్పి చూడుము, వి...

ఆ. చచ్చెఁ జచ్చె ననుచుఁ జా వెంచి వగచెడు
దీన నరుల వెఱ్ఱి దెలుపరాదు
ప్రాణమునకు మృత్యుబంధము లుండునా, వి...

ఆ. చమురు రాచికొన్నఁ జర్మంబు మెఱుఁగెక్కు
సాము చేయ మేను సత్తువెక్కు
జ్ఞానమార్గ మెఱుఁగ కడతేరు జన్మంబు, వి..

ఆ. చాడికాని మాట చావిడిలో నిక్క
వేఁట బోఁకుసకము వెలయ నిక్క
వెలఁదిఁ జూచునపుడు విటకాఁడు నిక్కురా, వి.

ఆ. చాలు చాలు నిలను జననమరణములు
మేలుగావు మాయ మెలకు వెఱిఁగి
ప్రాలుమాల కిలను భక్తిచేఁ బూనుము, వి...

ఆ. ఛిద్ర మెన్నువాఁడు శిష్యుఁడు తా నౌనె?
ఛిద్ర మెఱుఁగువాఁడు శిష్యుఁ డగును
ఛిద్ర మెఱిఁగి విడువ భద్రంబు చేకుఱు, వి...

ఆ. ఛేద్యమైనదానిఁ జేపట్టినాఁ డని
మూలవస్తు వెట్టు కేలఁ బట్టు
దాని నూనఁ గలుగు దార్ఢ్యము లేకున్న, వి...

క. జగ మరయ నింద్రజాలము
జగ మరఁగా మాయ సుమ్ము జన్మాదులకున్
భగవంతుఁ డగును బ్రహ్మము
నిగమాగమనిర్వికారనిపుణుఁడు వేమా! 1089

ఆ. జంతురాసులందు జనియించి జనియించి
దిమ్మపట్టినట్టు తిరిగి తిరిగి
తనువు నిత్య మంచుఁ దలఁపంగ నవ్వరో, వి...

ఆ. జనన మెట్టు కలిగె జాతి యెయ్యది యయ్యె
జననమరణములకు జాడ లెఱుఁగ
వినఁగ వినఁగ దీని వివరించికానరో, వి...1091

ఆ. జాతిభేద మెంచి జన్మము దెలియక
ముక్తి గానలేరు మూర్ఖజనులు
జాతు లెంచనేల జన్మంబు తెలియుము, వి...1092

ఆ. జాతసూతకములు సత్యమైయుండంగ
నంటినంత నెట్టు లంటుకలుగు?
వితము గానలేరు వెలయంగ జీవులు, వి...1093

ఆ. జీవ ముండుచోటు స్థిరముగాఁ దెలియక
తిరుగు నస్థిరమగు దేహమందుఁ
దిరుగనేల యనుచు దెలియలేఁ డజ్ఞాని, వి....

క. జీవంబగు జీవేశుఁడు
జీవుని కొకయిల్లు చూపఁ జింతల దొంతై
కావరమున గర్వించుచు
భావములో శివుని మఱచి భ్రమగొను వేమా!

ఆ. జీవమేడనుండు భావ మెక్కడనుండు
కాపురంబు లేడఁ గదిసియుండుఁ
దనరుచున్న రెంటిస్థల మేల తెలియరు? వి...

క. జీవాత్మఁ డెప్పు డుండెడి
తావును దాఁ దెలియలేక తగ నస్థిరముఁ
భావమున నమ్మి తిరిగెడి
జీవికి ధర ముక్తి గలుగఁ జెల్లునె వేమా! 1097

ఆ. జీవి జీవి జంప శివుని జంపుటె యగు
జీవుఁ డరసి తెలియ శివుఁడె కాఁడె

భావమందు వేగపరికించి చూడుము, వి...1098

ఆ. జీవుఁ డిలను నిండి సృష్టిలో నుండంగ
శివుని వెదకఁబోవు జీవుఁ డహహా!
జీవుఁడు శివుఁడను చిహ్నంబుఁ దెలియక, వి...

ఆ జల్లిమాట లనుచు జగమునఁ దిరిగెడు
కల్లగురుఁడు కట్టు నెల్లకర్మ
పల్లు పురుగు సేరి పలవింపఁ జేయదా? వి...

ఆ. జాణలైనయట్టి చపలాయతాత్ముల
వలపు లరసి చూచి భ్రమయ నేల?
బయలిరూపు లెల్ల పరికింపఁగా నేల? వి...1101

ఆ. జ్ఞానభావపరముఁ గనుఁగొనకున్నను
మానరాదు మనసు మమతఁ దగిలి
పూని జన్మములను బొందు తా పుడమిని, వి...

ఆ. తనదు నాత్మయందు దైవంబు గలుగఁగ
తీర్థయాత్రల కిల తిరుగునరుఁడు
గంధపుఁదునకల గాడ్దె మోసినయట్లు, వి...

ఆ. తనదులోని జీవతత్త్వము తెలియక
వేఱటంచుఁ దలఁచి వెదకు టెల్ల
భానునరయ దివ్వె పట్టినరీతిరా, వి... 1104

ఆ. తనువు నడవిఁ జేసి తనలోనె కూర్చుండి
తపము చేయలేని తపసు లెల్ల
నడవియందుఁ జేరి యలజడి పడెదరు, వి...1105

ఆ. తన్ను దెలియకున్నఁ దగ వేదములు వెఱ్ఱి
సర్వసంపదల మసాబు వెఱ్ఱి
ఆరుశాస్త్రములు నికాపురాణములును
జబ్బు లనుచు జగతిఁ జాటు వేమ! 1106

ఆ. తన్నుఁ దెలియునట్టి దైవజ్ఞు లెన్నంగ
నిన్ను దెలియరేని నిలువ రైరి
మాయఁ దెలియకున్న మంటిపాలైరయా, వి.

ఆ. తమకు సాటియండ్రు దైవజ్ఞు లగునరుల్
పరగ గూఢభావ మెఱుఁగ లేక
ఇట్లు మాయఁబడిన నెటు తెలియును మాయ? వి.

క. తమమునఁ జచ్చిన మనుజుఁడు
మమతను దాఁ బుట్టుచుండు మరణముకొఱకే
శ్రమ దీర్చు గురుని వేఁడిన
"భ్రమమూల మిదంజగత్తు" బయలగు వేమా!

ఆ. తరుణి సొగసుకాని తనయునిఁ గన్నను
మరునికళల మించి మనసు పాఱుఁ
బాపజాతిమనముఁ బట్టంగ రాదయా, వి...

ఆ. తలను వ్రేలవేసి తాలి మించుక లేక
యోగి తెఱచుఁ గన్ను మూఁగ యగుచు
జ్ఞాన మది యెటౌను గష్టపు దేహమా, వి...

ఆ. తలఁపుచేతఁ గల్గు తారకబ్రహ్మంబు
తలఁచి చూడఁ దానె తత్త్వమగును

తలఁపులోనితలఁపు తానె తన్నెఱిఁగిన, వి...
ఆ. తలఁపుఁ దలఁపఁ గూలి తగనేయ కీయఁడు
వలపు దీఱ నీయగలుగురూక
ముక్తినీనిగురుఁడు మ్రుచ్చులకొడుకయా, వి.
ఆ. తలఁపునందు శివునిఁ దలపోయఁగాలేక
తలఁప దెల్ల బయటి తలఁపుఁ జేసి
తలఁపు తాన యైనఁ దత్త్వజ్ఞుఁ డగుసుమీ, వి.
ఆ. తలఁపులోనితలఁపుఁ దలపోసి దెలియరా
తలఁపు లెల్ల విడిచి తగినభంగి
తలఁపులోనితలఁపె తత్త్వంబు నాత్మరా, వి.
ఆ. తల్లిగర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు
మొదలఁ బట్టలేదు తుదకు లేదు
నడుమఁ బట్ట గట్ట నగుబాటుగాదొకో? వి.1116
ఆ. తల్లి దండ్రి గలరు తగజన్మజన్మలఁ
దనకుఁ దెల్పువానిఁ గనఁగలేరు
నాదమే పరమని నమ్మినవానికి
నిహమునందుఁ బరము నెనఁగు వేమ! 1117
ఆ. తల్లిదండ్రిచావఁ దా నాలితోఁ గూడి
యిల్లుఁ గట్టుకొన్న యింపులెల్లఁ
గొలుతమీఁటి దొంగ కూ డడిగినయట్లు, వి.
ఆ. తల్లిగర్భమందు దాఁ జనియించియుఁ
దనదుభోగసతికి దానె పుట్టఁ

దల్లు రిర్వురయ్యు తను వొక్కఁటయ్యెరా? వి.

ఆ. తల్లిదండ్రిఁ బాసి తనయాలితోఁ గూడి
యిల్లుపట్టియున్న యింపదెల్లఁ
గొత్తికాడి దొంగ కోరినచందంబు, వి. 1120

ఆ. తల్లిదండ్రు లనెడితత్త్వంబు నెఱుఁగరు
యోనిలింగముల నటుద్భవించి
విష్ణు వరయ తల్లి వెలయ రుద్రుఁడు తండ్రి, వి.

ఆ. తల్లిదండ్రు లెవరొ తనకు జన్మము లెన్నొ
తిరుగ నెఱుఁగనట్టి దిక్కు లెన్నొ
స్థిరము నస్థిరమును దెలియలేఁ డజ్ఞాని, వి. 1122

ఆ. తల్లి యేడ్వ వినక తనయాలు వగచిన
జాలిపడెడివాఁడు జడుఁడు సుమ్మి
తారతమ్య మెఱుఁగనేరనిపశువగు, వి. 1123

ఆ. తా నసంగ నెవఁడొ తనవార లెవ్వరో
తెలిసి తెలియలేఁడు తిక్కనరుఁడు
అరిసి పిసినికాయపురుగుపద్ధతి లాగు, వి. 1124

ఆ. తాను తానె యనెడితత్త్వంబులోఁ గల
యన్వయంబుఁ దెలియఁ డబ్బతోడు
తానుతానె యైన తల్లడం బేలరా? వి. 1125

ఆ. తాను తనువటంచు ద్వయమును బలికిన
మోహవార్ధిలోన మునుఁగునరుఁడు
కానలేఁడు మోక్షగతి యెట్లు సిద్ధించు?వి. 1126

ఆ. తాను వెలయుభూమి తనరంగఁ దిరిగెడు
జనుల గాంచి పొంచి సరగఁ గఱచు
కుక్కబుద్ధి యెంట గుణ మేల మానును? వి.

ఆ. తానె తత్త్వమనుచు దలపోయఁగా లేక
మాయఁ దత్త్వమనుచు మఱుగుచుండు
కర్మఫలము లేక కలుగునా తత్త్వంబు? వి. 1128

క. తామరపాకున నీళ్లుగ
వేమన చరియించు చుండు వెదకుచు శివుని
న్నీ మాయ నమ్మరాదని
ధీమహిమఁ దెలియలేరు దేవుని వేమా! 1129

ఆ. తాము కన్నవారుఁ దము గన్నవారును
జచ్చుటెల్ల తమకు సాక్ష్యమెకద!
బ్రదుకుటెల్లఁ దెలియ బ్రహ్మకల్పంబులా? వి.

ఆ. తిట్టెనేని కొట్టు కొట్టినఁ గొట్టును
కొట్టెనేని యముఁడు కొద్దిపఱచుఁ
గోపమెంచఁ జేర్చుఁ బాపపునరహత్య, వి. 1131

ఆ. తిరుగవలయు మనసు తిరిగినవఱకును
దిరుగునట్టె మనసు విఱుగవలయుఁ
దిరిగి విఱిగెనేని దేవుఁడు తానగు, వి. 1132

ఆ. తీర్థయాత్ర కనుచుఁ దిరుగఁబోయినవాఁడు
పామరుండు గాక భక్తుఁ డగునె
తీర్థయాత్ర చేత దివ్యుండు గాఁడయా, వి. 1133

ఆ. తుంటవింటివాని తూపుల ఘాతకు
మింటి మంటి నడుమ మిడుకఁ దరమె?
యింటియాలి విడిచి యెట్లుండనచ్చురా? వి.

ఆ. తులసి కొరములును దూముపై నీరము
పఱచి దాన దుష్టపాలువోసి
కఱగి రాగిపైని క్రమముగా నుంచరా, వి.

ఆ. తెఱలమఱుగునఁ గలతేజమంతయుఁ జూచి
మఱియు బ్రహ్మమందు మనసు నిలిపి
గరిమ నున్నయట్టిఘను లెందుఁ గలరయా? వి.

ఆ. తెలియ భాగవతులె తెలివి గలా రింక
నంద ఱెట్లు లగుదు రకట భువిని
నయినవారిని గను నతఁడె పో శివయోగి, వి.

ఆ. తెలియఁ దనదుభార్య తెగబారు సంకెల
చిన్న శిశువులెల్లఁ జీల లరయ
నరసి చూడఁ దనువె యల చెఱసాలరా, వి.

ఆ. తెలివి నిలిపి చూడు దీపించు నాకళల్
కళ లుడుగక చూడు కలుగుబయలు
బయలు నంటి చూడ బ్రహ్మంబు గాంచెదు, వి.

ఆ. తెలుపుమా యటంచు దేవర యంచును
వెంటఁ బడెడివాండ్ర వెతలు దీర్ప
నెవ్వఁడైనఁ జెప్పు నేదైన నొక్కటి, వి...114

ఆ. తొడలమెఱుపు మోవి తోరంపుగుచములు
నోరకొప్పు గలుగు నువిదఁ జూచి
విటుఁడు నిలువగలఁడె విరహాగ్ని జొరకయే? వి.

ఆ. తొత్తుతోడిపొందు దోషంబు దోషంబు
లంజతోడ పొందు లజ్జచెడును
జాంద్రతోడ పొందు చావునకే యగు, వి.

ఆ. తోలుఘటములోనఁ దోలఁగక యున్నప్పు
డాలుమగలు ప్రీతి నలరుచుంద్రు
జీవి ఘటము విడువ చిక్కాడిపోపురా, వి.

తే. దశమి యేకాదశి యని వ్రతములఁ బూని
మెదుకు దినకున్న దుర్గుణ మది యడఁగునె?
పుట్టపైఁ గొట్ట నురగంబు గిట్టబోదు
తీరెఱుంగనిమూఢ్య మీ తెఱఁగె వేమ! 1144

ఆ. దృశ్యమైనదానిఁ దెలసి నమ్మెద రట్లు
కాని దాని నమ్మఁ బూనుకొనరు
కాని దృశ్యమగుట కానరే యదియేల? వి. 1145

ఆ. దేవళములలోను తీర్థంబులందును
మూల మెఱుఁగకున్న ముక్తిలేదు
ఆత్మమూల మెఱుఁగఁ డది యెట్లు తెలియును? వి.

క. దేహాభిమాన ముండఁగ
మోహాదులు విడుచు టెట్లు మునులకునైన
న్నాహాసమున నది విడువఁగ

సోహ మ్మని యెఱుఁగవచ్చు సుమ్మీ వేమా! 1147

ఆ. నమ్మినట్టి యుండి నొకభూత మనఁగఁ
జాపఁ బొరల వేసి చక్కఁబోవు
నీఁతగాఁ డయిన నటేల పోనిచ్చును? వి. 1148

ఆ. నరుఁడఁట పరమాత్మగురుని జేరినయప్డు
హస్తమందు మోక్ష మపుడె చూపు
విభవసంపదలను విఱ్ఱవీగిన జీవి
పరమెఱుఁగఁడు యమునిపాలె వేమ! 1149

ఆ. నాది నీ దటంచు ననువుగాఁ బల్కిన
కాదు కాదటంచుఁ గాల ద్రొక్కి
పాదుకొనెడియుక్తిఁ బడయనివారికి
చేఁదు పుట్టి ముక్తి చెడును వేమ! 1150

ఆ. నిద్రలోనినిద్ర నిర్భేద్య మనఁదగు
తామసంపునిద్ర తలఁగఁద్రోచి
సతత మదియె పూన సర్వదా యోగియౌ, వి.

ఆ. నిబిడమైనతమము నిక్కి దాఁటఁగలేక
గుబురు బట్టబయలు కూడుబెట్టు
ప్రబలుచున్న మదిని పాలించుచుండును, వి.

తే. నిర్మలజ్ఞానపరిపూర్ణనిష్ఠయందుఁ
గర్మసన్న్యాసయోగియై కసిమసంగి
మర్మ మెఱుఁగుచు నుండు నా మానమయ్య
ధర్మ మింతయె బోధించు ధరణి వేమ! 1153

క. నీమము పెట్టుక ద్రవ్యము
కామంబున కగుచు భువిని కల్లరికూతల్
నేమముగఁ బలుకుచుండిన
కోమటు లొకకొంద ఱుంద్రు కుంభిని వేమా!

ఆ. నీరునన్నములును నిదురయుఁ దా మాని
ముక్తికొఱకుఁ దిరుగు మూఢజనుఁడు
వెఱ్ఱికుక్కయట్లె వేసరి తిరుగురా, వి. 1155

ఆ. నీళ్లమీఁద బుగ్గ నిలిచినయప్పుడు
తళ్లు వేగ వచ్చి తాఁకుఁగాదె
విడెడుకుండ కింత విభ్రాంతి యేలరా? వి. 1156

ఆ. నీళ్లమునుఁగువాఁడు నిర్మలాత్ముఁడు గాఁడు
పూర్ణమైనముక్తిఁ బొందలేఁడు
నీరుకోడి యెపుడు నీళ్లను మున్గదా? వి. 1157

ఆ. పడఁతిఁజూచునపుడె పాలిండ్లపై యాస
నుడుగలేక మనుజుఁ డుపచరించి
యిడుములొంది పొంది యిలబట్టి చచ్చును, వి.

ఆ. పక్షిజాతిఁ బట్టి పరగ హింసలఁ బెట్టి
కుక్షినిండ కూడు కూరుటకును
వండితినెడివాఁడు వసుధఁ జండాలుఁడు,వి.1159

ఆ. పిండ మగుచుఁ దల్లి పెనుగర్భముననుండి
పూర్వకర్మ మెంచి పొరలియేడ్చు
ధరణి బుట్టి యద్ది మఱచిన ర్తించురా, వి. 1160

ఆ. పటువుగాను బుద్ధి పరికించి నొక్కుచు
కుటిలగుణము లన్ని కూలఁ ద్రొక్కి
పటుతరంపు మోహపటలంబు వీడరా, వి. 1161

---

## యోగిపద్ధతి.

---

ఆ. అంజనంబుఁ బెట్టి యాత్మలో ద్రవ్యంబు
కనఁగ లేని ఘనత కడగి యెఱఁగి
ఆశ దప్పినప్పు డతఁడె పో ఘనయోగి, వి. 1162

ఆ. అంతరంగహృదయ మందఁగా సాధించి
చింత లూడఁబెఱికి చిక్కుపడక
వింతఁ జూచి మెలఁగ విజ్ఞాన మందురా? వి...

ఆ. అంతరిక్షమందు నమరినలింగంబు
చింతఁ బూనవలెను జెనకి యాత్మ
వింతలోనివింత వెన్నంటి చూడరా, వి...1164

ఆ. అయిదుచక్రములను నాదినిబడవైచి
యైదుచక్రములకు నవలఁ దెలియ
నైదుచక్రములను నడఁగి బయల్ తోఁచు, వి.

ఆ. అరసి గట్టివేసి యాధారచక్రంబు
ప్రాణవాయు వందె పదిలపఱచి
యెడతెగకయముండునిలయోగ్యుఁడగు యోగి
విశ్వ... 1166

ఆ. అవనిలో నొకబిడ్డ యరయఁ బుట్టినతండ్రి
నట్టె యేలె జగము లగణితముగ
తల్లి లేక పుట్టె ధాత్రి యెట్లెరా? వి...1167

ఆ. అష్టదళములందు నాత్మను సేవించి
నిష్ఠఁ బూని మిగుల నేర్పుతోడ
దృష్టియందె దృష్టి తెమలక చూడరా, వి...1168

తే. అసిపదాంతమునను బుద్ధి నమర నొక్కి
కూటపరచిన్మయంబునఁ గొలువు దీరి
ఆటపాటల నణఁగింప నందె ముక్తి
విశ్రుతం బగువిధ మిది వినర వేమ! 1169

క. అక్షరపుటడవిఁ జొరఁబడి
యక్షరములు వేలు లక్ష లరయఁగ నేలా
ఈక్షితి శివ యనియెడి రెం
డక్షరములె పరిఢవిల్లు నరయుము వేమా! 1170

ఆ. అక్షరాత్మకంబు నమృతపానమునకు
రక్షకత్వమునకు రాజహంస
దీక్షలోనిదీక్ష తెలిసినంటి చూడరా, వి... 1171

ఆ. ఆకుచాటునఁ దగు నన్ని లోకంబులు
కొమ్మ గానరాదు బ్రహ్మకైన
కొమ్మ గానఁబడినఁ గొనియాడవచ్చురా, వి...

ఆ. ఆకసంబుమీఁద నాడుదొమ్మరిపాప
చూపు లొకటి గాని సుఖము లేదు

ఆకస మనువీథి హంసను జూడరా, వి... 1173

క. ఆకారణవిధ మెఱుఁగుచుఁ
జేకొని యామూలధనముఁ జెందుచు నున్న
న్నా కల్పాంతమును సదా
యేకాలము పిన్న వయసు నిహమున వేమా! 1174

ఆ. ఆగడంబు చేత అందెందు బొందెదు
సాగ దోలి మనసు సైఁప నేర్చి
మ్రొగుప్రణవరవము మూలంబు గానరో, వి.

తే. ఆత్మ తేజము గమకించి యభినుతించి
కీలక బ్రహ్మతన్మయ కేళి మఱగి
నిత్యపరిపూర్ణ మందుట నిరతిశయము
సత్వసంపన్నులకు నిది సాగు వేమ! 1176

ఆ. ఆత్మ దేహమందు నతిసూక్ష్మముగఁ జూచి
దేహ మాత్మయందు తేటపఱచి
ఆత్మయందె చూడ నతఁడె పో ఘనయోగి, వి.

ఆ. ఆత్మలోనినాద మాలించి యాలించి
యాసలందు చిక్కఁ డాది యోగి
యాత్మలోనికళల నంటునా తత్త్వము? వి. 1178

ఆ. ఆత్మసూక్ష్మమైన యానంద మెఱుఁగక
మది తొలంగి చదివి మగ్నుఁ డయ్యె
అతిరహస్య మెల్ల నా యోగి యెఱుఁగును, వి.

ఆ. ఆది తుదయు లేని దనుభవగమ్యమై
వేదతుల్యముగను వెలయుచుండు
వాదభేద ముడిగి వరియించు శివయోగి, వి...

క. ఆధారంబు లటాఱును
మోదముగా నలరుచుండు ముఖ్యముగాఁగన్
లేదన నేటికిఁ దెలియక
సాధకమునఁ జూడనయ్య చయ్యన వేమా! 1181

ఆ. ఆఱుగురిని జేర నత్యంతదుఃఖంబు
ఏడుగురిని గూడ నేడుపయ్యె
వడిగ వీరిపొందు విడచుటె యోగము, వి...

ఆ. ఆఱుగురినిజంపి హరిమీఁద ధ్యానంబు
నిలిపి నిశ్చయముగ నెగడి యాత్మ
గతి నెఱుంగుచుంద్రు ఘనులగుయోగులు, వి.

ఆ. ఆఱు మూఁడు గట్టి యలమటఁ జెందక
పోరి గుణము లడఁచి పూని మిగుల
తేరుశిఖర మెక్కి తెలివంటఁజూడరా, వి. 1184

క. ఆర్గురుదొంగల బట్టుక
మార్గముననె కొట్టి యొకని మన్నింపఁదగుం
దుర్గమ మిది తెలియంగా
నిర్గుణరూపంబు తెలియు నిజముగ వేమా!

ఆ. ఆలుబిడ్డ గల్గి యధికసంపద గల్గి
భజన సేయ రీశు భక్తి లేక

భజనసేయ నతఁడు భక్తుండు కాఁడయా, వి....

ఆ. ఆసపాపజాతి యైహికములలోన
ఆసచేత నెవరు మోసపోరు
చూచి విడుచువారు శుద్ధాత్ము లగుదురు, వి...

క. ఇడపింగళనాడులకు
న్నడుమ సుషుమ్నము వెలుఁగు నడయాడంగాఁ
గడుదుస్తర మది గన నా
నడుమనె యినచంద్రహరులనగరము వేమా!

ఆ. ఇంతికనులు వింత వింతలౌ చన్నులం
చింతఁగవయువాని నెఱిఁగి తొలఁగి
సరస కరుగ నతఁడె సర్వదా యోగియా, వి

ఆ. ఇంద్రజాలమట్టు లీజగద్భ్రాంతులు
చంద్రకళలు దాఁటి సఖ్యపడెడు
రంధ్రమందుఁ జేరి రహిమీఱఁ గాంచుదే
వేంద్రపూర్ణపదవి విడక వేమ! 1190

ఆ. ఇంద్రలోక మైన జంద్రలోక మ్మైన
నందిచూడవచ్చు పొందుగాను
నందిమీఁద నెక్కి నయముగఁ జూడరా, వి...

తే. ఇరవు గనుఁగొని పరమార్థ మెన్నఁ గోరి
పరమనిర్గుణపుబయలఁ బ్రాఁకి నిలిచి
తన్మయంబున మది నిల్పి తనరు యోగి
శాశ్వతసుఖంబు నొందును సతము వేమ! 1192

ఆ. ఇల్లు విడిచినట్లె యిల్లాలి మది రోసి
తల్లడంబు మాని తలఁపు నిలిపి
యొడలు మఱచి యోగ ముల్లసిల్లెడునట్టి
వాఁడె పరమగురుఁడు వసుధ వేమ! 1193

ఆ. ఇష్టసిద్ధిఁ గోరి కష్ట మొందఁగ లేరు
నిష్ఠ నెఱిఁగినంత నిష్ఠలోన
అష్టసిద్ధులందు నమరుటఁ గానరు, వి... 1194

క. ఇహపరసౌఖ్యము లొల్లక
దహరమునను గుఱిని డించి దత్తముగాగం
గుహరములో వెలిబయలున
మహదాకాశంబుఁ జేరు మహిలో వేమా!

ఆ. ఈకె లనుచుఁ గొన్ని తోఁక లనుచుఁ గొన్ని
కోఁక లనుచుఁ గొన్ని గోఁచు లనుచు
కొన్ని యయ్యె నున్నగుఱుతును మాయఁగా,వి.

క. ఈఁ తెఱిఁగినవా రైనను
లోఁతైనటువంటి నూతిలోఁ బడి పోరా?
యీఁతలు నేర్చినయోగము
చే తిరుగకయున్న నేమి చేయుదు చెపుమా!

క. ఈదేహ మెన్ని భంగుల
బ్రోదిి యొనర్చినను నేలఁ బోవును కాదే
మీఁదెఱిఁగి మురికిఁ గడుగుచు
భేదంబులు మాన ముక్తి బెరయును వేమా!

ఆ. ఈనినట్టిపులిని బూని చంపఁగవచ్చు
మనము మర్మ మరసి కనఁగవచ్చు
తారకంబు మఱిగి తగులుట సాధ్యమా? వి...

ఆ. ఈస్వరంబు లన్ని యేడుపాళ్లుగఁ జేసి
యేడుమూర్తుల కవి యిచ్చివేసి
నిత్యకర్మమునను నిలుచురా నెఱయోగి, వి...

ఆ. ఉక్కుకళ్లు దిన్న నొగి తేటగా నుండు
నుక్కుకళ్లు దిన్న నుడుగువ్యాధి
యుక్కుకళ్లకన్న నుర్వి గల్పము లేదు, వి. 1201

ఆ. ఉక్కు శుద్ధి చేసి యుంచి తినెడివాఁడు
ఉక్కుదిటవువలెనె యుండు జగతి
ఉక్కుచూర్ణముఁ దినుటొప్పగు కల్పంబు, వి...

తే. ఉజ్జ్వలంబగు పరిపూర్ణ మొందఁగానె
కుంభగతదీపశోభానికుంభలీల
కుంభకంబున మదిఁ జేర్చి కూడవలెను
గాక గాంభీర్య మూనిన కలదె వేమ! 1203

ఆ. ఉతకలోనితలుపు నూగించి నెట్టెడి
పదునెఱింగి లోనఁ బట్టుఁ బట్టు
మతిని గూడి మించి మర్మంబుగనుమయా, వి.

ఆ. ఉదయమందు శివుని నూహించి చూచిన
సుధయు బుట్టి పరముఁ జూపుఁగాక

ముఖము మించి మనము ముప్పూరి గొనకున్న
చేదుపుట్టి మాయఁ జెఱుచు వేమ! 1205

క. ఉపజిహ్వకుఁ బ్రాగ్దిక్కున
త్రిపుటికి మధ్యంబునందు దీపము తానై
జపియించు నామ మెవఁడా
తపసిని గనుఁగొన్న వాఁడు ధన్యుఁడు వేమా!

ఆ. ఉరిది గాను గాలి యున్నతిగను మింటఁ
దురితముగను వచ్చి తొలఁగుచుండు
పురముపైన నిల్చి పూనికఁ జూడరా, వి...

ఆ. ఊడిగంబు జేసి యుబ్బించి గురువును
కూడి పొందవలెను కోర్కు లడఁచి
వేఁడి పరమపదవి వెలయంగఁ జూడరా, వి...

ఆ. ఊరకుండ తెలియ నుత్తమయోగంబు
మానసంపుకళల మధ్యమంబు
ఆసనాదివిధుల నధమయోగంబులు, వి... 1209

ఆ. ఊర్ధ్వలోకమందు నుచితక్రమంబున
రూప మేమి లేక రూఢినుండు
పరమయోగి చూచుఁ బరమాత్ముఁ డితఁ డని,వి.

తే. ఊర్జితానందపరిపూర్ణయుక్తియందు
స్వార్జితంబగు గురుభక్తి సంతరించి
దుర్జయంబును తొలఁగంగ దోలునేని
కర్జముగ ముక్తి లభియించు గదర వేమ! 1211

ఆ. ఊరు సేరి యుండ నోగి సంతసింతురు
అడవియన్న మాత్ర నడలుచుంద్రు
ఊరు నడవి రెండు నొకటిగాఁ జూచిన
నారి తేరుయోగి యతఁడు వేమ! 1212

ఆ. ఋగ్యజుస్సు లెఱిగి యోగ్యత లేకున్న
విప్రుఁడైన నెట్లు విహితుఁ డగును
భర్త గలిగి యన్యు భావించుసతివలె, వి...

ఆ. ఎగుడుదిగుడుఁ జూడ కేప్రొద్దు మదిలోన
తగవు లేని తలఁపు దలచి వలచి
సిల్గి చూచువెల్ల నెఱజాణవిద్యరా, వి... 1214

తే. ఎచటఁ జూచిన నచ్చట నేమి తోఁచు
నచటిదృశ్యము దృక్కుగా నంటిపట్టి
నచ్చు జేయుట ముక్తికి రాజపథము
సచ్చిదానంద మదు డొప్పఁ జాలు వేమ! 1215

ఆ. ఎచటనుండి వచ్చు నెచటికిఁ దాఁ బోవు
నిద్రచంద మెఱుఁగ నేర్చెనేని
అచలమైన వ్యక్తి నచ్చట నందుము, వి...1216

ఆ. ఎంతభాగ్య మున్న నంత కష్టపుఁజింత
చింతచేత మనసు చివుకు మనుజు
చింతలేకయుంట చెడిపోనిసంపద, వి... 1217

ఆ. ఎన్నిఎన్నిపూజ లెచటఁ జేసిన నేమి
భక్తి లేనిపూజ ఫలము లేదు

భక్తి గల్గుపూజ బహుళకారణ మగు, వి. 1218

ఆ. ఏక మమర యుక్తి పాకంబు గమనించి
పోకి యుండు టెల్ల సూటి యగును
తాఁకి తాఁకి మిగిలి తళుకొత్తవలె నయా, వి.

ఆ. ఏకమైనదాని నెక్కడఁ జూతురు
పాక మెఱిఁగి చెప్పు పరుఁ డెవండు
లోకమాయఁ జూడ లో వెలి నిండెరా, వి.

క ఏచూడ్కి నిలిచి యుండునొ
యాచూడ్కినిబట్టి మదిని నొఁ గా దనకే
రేచకపూరకకుంభక
సూచన పర మనెడుబయలు చూడుము వేమా!

ఆ. ఏరుదాఁటి మెట్ట కేఁగినపురుషుండు
పుట్టి సరకు గొనక పోయినట్లు
యోగపురుషుఁ డేల నొడలిఁ బాటించురా, వి.

ఆ. ఐదు చక్రములను నాదిని బడవైచి
యైదుచక్రములకు నవల వెలసి
యైదుచక్రములను నడవి బైలైతోఁచు, వి.

ఆ. కడుపులోనివాని గానఁగా లేరయా
కష్టపడుదు రింతెకాని జనులు
హీన మెఱుఁగ నాతఁ డిది యేల యెఱుఁగును? వి.

ఆ. కదలనీయకుండ గట్టిగా లింగంబుఁ
గట్టివేయ నేమి ఘనత గల్గు

భావమందు శివుని భావించి కానరా, వి...

ఆ. కదియఁ బట్టి హంస కళ లంట గమకించి
సదయహృదయమందు సంతరించి
విదితమైనబయల వెన్నంటి చూడరా, వి...

ఆ. కనుల చూపు నిలిపి కాంతిని గమనించి
కాంచవలెను చిత్రకళలుదాఁటి
కోటకొమ్మఁ జేరి కోర్కు లడంపరా, వి... 1227

ఆ. కనులు రెంటినడుమఁ గానంత నిలిపిన
బొమలమీఁటి చూడ్కిఁ బొందఁ జేయు
క్రమ మెఱింగి లోనికాంతిని పట్టుము, వి...

ఆ. కన్ను మిన్ను చేసి కాంతిని గమకించి
తన్ను నిలిపి చూచి తలఁపు వదలి
యున్నవాఁడు పరము గన్నవాఁడే యగు, వి...

ఆ. కన్నెపడుచు గాంచి కదలనీకుండిన
యాస బట్టి యొక్కమూసఁ బట్టి
కరఁగఁబెట్టి దాని కడముట్టఁజేయరా? వి...

ఆ. కపటవేషమూని కడగండ్లు పడనేల
విపినభూమి తిరిగి విసుగనేల
యుపమతోనె ముక్తి యున్నది కనవలె, వి...

ఆ. కరఁగ కరఁగఁ బుట్టు కనకంబునకు వన్నె
పెనఁగ పెనఁగ బుట్టు ప్రేమ సతికి
ముదియముదియఁబుట్టుమోహంబులోభంబు,వి.

ఆ. కరతలంబు నెత్తి కాలి నడిమిపట్టి
యూర్ధ్వదృష్టిచేత నానర నిల్పి
సర్వమై తనరుటఁ జాలనాయువు కల్గు, వి...

ఆ. కల్పమనఁగ నగును గారణబీజంబు
కల్పమనఁగ శివునికల్పితంబు
అల్పుఁ డేమి యెఱుఁగు నానందభోగము,వి...

ఆ. కలిగియు దినలేక కష్టించురోగికి
నాఁడువారిమీఁద నాస గలదె
అన్నమదముతోడ నఖిలమదంబులు, వి...

ఆ. కలిగినట్టె యుండు కలుగక యుండును
మఱియు లేకపోవు తిరిగిఁ గలుగు
గలిమి నెచటఁ జూడ గారడి యనవచ్చు,వి...

ఆ. కలిమిగలయతనికిఁ గన్యక నిచ్చుచు
ముఱియుచుంద్రు గాదె మూఢజనులు
పూజఫలమె కాని పూనిక ల్నిల్చునా? వి...

ఆ. కలుగుచింతలన్ని కడఁకతో దాఁటఁగ
వెలుఁగుచంద్రకాంతి వేడుకలర
నిన్వటిల్లఁ గోరు నిర్గుణయోగులు, వి... 1238

ఆ. కలుగుసుఖము లెల్లఁ గల్లగా రోయుచు
మెలఁగుమండవలయు మిహిరుపగిది
తిరుగు నేర్పుచూడ ధీరుఁడే యగునయా,వి...

ఆ. కలుపు దీసి నరులు కాపాడి పయిరులఁ

బెంచు ప్రేమవలెను బెనిచి మదిని
దృశ్యములను ద్రుంచి తెంపుగా నుండుము, వి.

ఆ. కలుష మెల్లఁ దెలియఁ దలపంపులకు మూల
మరయ దత్త్వ మెల్ల నాత్మ బుట్టుఁ
దెలిసినందునకును ధీరుఁడు గావలె, వి... 1241

ఆ. కలుష మొక్కయింత కాన్పింప దెందును
జూడ నెవరికైన సొంపు మీఱుఁ
దామసం బడంగఁ దా వెల్గు జ్ఞానంబు, వి...

ఆ. కస్తురిపలపేల గజరాజమున కెన్న
తనదు మదపుధారతావి గాక
యోగి కేల రంభ యోగహర్షం బుండ, వి...

ఆ. కానరానిబయలు గనుటయే మోక్షంబు
మేను మఱచి నిద్ర మెలఁగినట్లు
తానుతాను గాను దలపు మఱపు దాఁటు, వి.

ఆ. కానరానివాని కనుపించువానితో
కాపు చేయ నలుక కరుణతోడ
కానరానివాని కరుణేమికందురో? వి... 1245

ఆ. కామి యైనజనుఁడు ఘనుఁడు గాఁడాయెనే
కామిగాఁడె కృష్ణసామి ముందు
కామి గానిజనుఁడు గణపతి గాఁడొకో? వి...

ఆ. కాయము దగ గూడి కడఁగి యోగిగ నున్న
కాయ మిలను బడిన ఘనుఁడు గాఁడు

కాయమునను ముక్తి కడతేఱవలె నయా, వి.
ఆ. కాలు చేయి లేదు కంచుకంబు గలదు
కొమ్ము లేక యురికి చిమ్ము వేగ
గరిడి లేక చంపు కడుచోద్యమగునయా, వి....
ఆ. కోటకోట తిరుగు కొమ్ము లేనుఁగు గాదు
త్రాటిపట్టెనందు తగిలియుండు
పోటుబంటునైన బొర్లింపక విడఁడు, వి...1249
ఆ. గగనచిత్తవృష్టి గద్దియపైఁ జేర్చి
యనువరైనయాతఁ డచల మంటి
యుజ్వాలాంశమందు నూహించుఁ దత్త్వము, వి.
ఆ. గట్టుమీఁద నున్నఁ గాన్పించు సర్వము
తెలిసి తేటపడినఁ దెలియు నెల్ల
లోకవిషయములను లోనిరహస్యముల్, వి...
ఆ. గట్టురాళ్లు దెచ్చి కాళ్లచేతులఁ ద్రొక్కి
కాఁచి యులులచేతఁ గాసిఁ జేసి
మొఱకురాళ్లు కెఱఁగు మొప్పెల నేమందు? వి.
ఆ. గర్వియింద్రియముల గట్టివేయఁగలేక
చావు వచ్చునపుడె సన్న్యసించు
నాత్మజయము లేదిఁ కంటునా మోక్షము? వి.
ఆ. గాలి గాలి గలసె గగనంబు గగనంబు
మన్ను మన్ను గలసె మంటమంట
నీరు నీరు గలసె నిర్మలంబై యుండె, వి...1254

ఆ. గాలి ఫణికిఁ జేసెఁ గసవు పసికిఁ జేసె
మంటి నెఱకుఁ జేసె మఱప కిలను
పుడమిని జనులకు బువ్వట్లు చేసెరా, వి. 1255

ఆ. గాలియందె పుట్టి గాలియందె పెరిఁగి
గాలి దెలియ లేరు గాదె నరులు
గాలియందె యాత్మ కల యదే తత్త్వంబు, వి...

మత్తకోకిల:—
గాలి రాకలు పోక లుండెడికాలమే బ్రతుకాయెరా
లీలతోఁ బరమాత్మ నెంచఁగలేనిమాయల గంటిరా
చాల నమ్మియు నాత్మకీలున సాధనంబునఁ గానరా
మేలుగా నిఁక నీవు నీయెడ మేళగింపర వేమనా!

ఆ. గుణవిహీనజనుని గుణమెంచఁగా నేల?
బుద్ధి లేనివాని పూజ యేల?
మనసులేనివాని మంత్రంబు లేమరా, వి. 1258

ఆ. గురువుసేవఁ జేసి గురితోడ భుజియింప
వలెనటంచు నరులు వాంఛ దీఱ
బలుకుచుందురు గాని భావంబు గానరు, వి. 1259

ఆ. గుహలలోన జొచ్చి గురువుల వెదకంగ
క్రూరమృగమొకండు తారసిలిన
ముక్తిదారి యదిరొ ముందుగా జూపురా, వి.

తే. గెంటి యెఱుకను జిత్తనుమంటఁ గాల్పి
కంటి గింపగు గురుశక్తి మింటఁ జేర్చి

జంట బాసిన ఘనుఁడె పో జాణుఁ డరయ
బంటుతన మది పరమందుఁ బనికి వేమ! 1261

ఆ. గొఱ్ఱెలు పదివేలు కూడియుండినచోట
తల్లి నెఱిఁగి వచ్చు దానికొదమ
పరమయోగి నెఱిఁగి భక్తుండు వచ్చురా, వి...

ఆ. ఘటపుజలములందు గగనము గాన్పించు
ఘటము జలము లేమి గగన మేది
ఘటములోన జ్యోతి క్రమమున జూడరా,వి...

ఆ. చంద్రసూర్యగతులఁ జర్చించి వేగమే
రంధ్రమునను జొచ్చి రంగుమీఱఁ
జంద్రశాలఁ జేరి చైతన్య మందరా, వి... 1264

ఆ. చపలచిత్తవృత్తి జయమొందఁ గమకించి
నిపుణుఁడయ్యి యోగనియతి మీఱి
తపముఁ జేయువాఁడు తత్త్వాధికుండురా, వి...

ఆ. చర, మెపుడు జీవసౌఖ్యంబు గోరును
జీవికర్మములను జేయుచుండు
జీవికర్మ మెల్లఁ జెడరోయ తత్త్వమా, వి. 1266

ఆ. చిక్కి పక్కబోదు చిగిరించు మదిలోన
నిక్కు బట్టి గురుతు నెఱియఁ జూచి
సొక్కియున్న ఘనులు సూత్రాత్ము లగుదురు, వి.

ఆ. చిత్తమందు శివుని జింతించి చూచిన
హత్తుకొనును బదవి హాని లేక

పొత్తు మఱవగానె పొందును సుఖములు, వి...

ఆ. చిత్తవాజి నెక్కి శిక్షింప నేరక
తత్తఱపడినంతఁ దఱగునొక్క
వారణాసి తనకు వైయాసి కాఁబోలు, వి...

ఆ. చింత పాఱఁదోలి చెవి యొగ్గి వినఁగనె
కొన్ని హితవు లమరి కొఱఁత దీఱు
కాన గురుని జేరి గమనించి చూడరా, వి...

క. చిన్నది యెలప్రాయంబునఁ
గన్నది పతిలేక సుతుని కడుచిత్రముగా
నెన్నఁడు రతి లవ మెఱుఁగదు
చన్నీయక పెంచె నౌర జగముల వేమా!

ఆ. చీఁకటింటఁ బుట్టి చీఁకటఁ బెఱిగిన
చీఁకటి మఱుఁగునను చిక్కనేల
చీఁకటి దెలిసిన సృష్టి కాన్పింపదా? వి... 1272

ఆ. చెట్టునందుఁ బుట్టి చెలరేఁగుకాయలు
దనరు కాంతితోడఁ దగిలి పండ్లు
పండ్లు వానిదింద్రుడు వర్ణంబు దెలియుఁడీ, వి...

ఆ. చెవులలోన బుట్టు రవమె యాకాశంబు
కన్నుల గనునదియె గళల జ్వాలఁ
ముక్కులోనిగాలి ముక్తికి త్రోవరా, వి. 1274

ఆ. చెవుల విన్నయట్టి రవమును వివరించి
మన సదెఱిఁగినప్పుడు మఱలుకొనును

చెవులు శబ్దమునను జెడరోయ ముక్తిరా, వి...
ఆ. చదివి చదివి చదివి చావంగ నేటికి
చావు లేనిచదువు చదువవలయు
చదవు లేక కోటిజనులు సచ్చిరి గదా, వి...
ఆ. చనఁగ చనఁగ దాఁకు జనుఁ ద్రోవలో కాశి
వినఁగ వినఁగ ప్రణవ విభవరవళి
కనఁగ కనఁగ బుట్టు కారణ మదియెరా, వి...
ఆ. చలముపట్టి షడిని జనియించుగుణముల
తతిని ద్రుంచి వేగఁ దమక ముడిగి
సతముగాను బుద్ధి సవరింప నదె ముక్తి, వి...
ఆ. చావు దెలియువాఁడు సన్యసించున దెట్లు
కడపలందు ఘనత గదురు నెట్లు
పాప మొకట మీఁద ఫలమేమి లేదురా, వి...
ఆ. చూపులోనిచూపుఁ జూడంగఁ జూడంగ
దెలివిలోని తెలివి వెలుఁగుచుండు
నిద్రలోనినిద్ర నిజమని తెలియరా, వి. 1280
ఆ. చూపులోనిచూపు సూక్ష్మమా తెలియంగ
చూపులోనిచూపు శుభ్రమగును
చూపులోనిచూపు సురవర గమ్యంబు, వి...
ఆ. చొక్కమైనపరము చుఱుకరివై చూడ్కి
ముక్కుతుదను గూర్చి ముదముతోడఁ
దక్కఁ జూచినంత దగ్గఱె యుందురా, వి...

ఆ. ఛురికతోడ గోయ జొప్పడునే కాని
దానిపిడిని గోయతరమె నీకు
తెలివి లేనిమేని బలమేమి చేయును? వి. 1283

ఆ. జననమరణము లిల జంగమములు సుమ్మి
జననిజనకు లిలను జలధిరీతి
వినుతిఁజేసి గురుని వెన్నంటి చూడరా, వి...

ఆ. జపము బాహ్యపూజఁ జాలగా చేసియు
కపటము విడలేక కష్టనరులు
ముక్తి నొంద లేక మునిఁగిరి తమమున, వి...

ఆ. జాగ్రతనఁగ నేమి జన్మ మనఁగ నేమి
జన్మమునకు నరయ జాగ్రతాయె
జన్మజాగ్రతలను సాధింపరాముక్తి, వి. 1286

ఆ. జాతి వేఱులేక జన్మక్రమంబున
నెమ్మదిని నభవుని నిలిపెనేని
నఖిలజనులలోన నతఁడు ఘనుండయా, వి...

ఆ. జాతులందు నెట్టిజాతి ముఖ్యమొ చూడు
మెఱుకలేక దిరుగ నేమిఫలము
ఎఱుక గల్గ మనుజుఁ డేజాతి గలవాఁడో, వి...

ఆ. జారపురుషుమీఁద సద్భక్తి నిలుపుచుఁ
బతికి నిచ్చకముగ పరగుభాగి
పరముకొఱకు యోగి పాటించు దేహంబు, వి.

ఆ. జీవలింగపూజ జేసినవారికి
శిలలరూపమందు జింత యేల
చెలఁగి మధువు గ్రోల చేఁదు రుచించునా, వి.

ఆ. జీవి జంపు టెల్ల శివభక్తి తప్పుటే
జీవు నరసి కనుఁడు శివుఁడె యగును
జీవుఁడు శివుఁడనుట సిద్ధంబు దెలియురా, వి...

ఆ. జ్యోతియందె పుట్టె సొంపైన నాదము
బిందువమరె నాదమందుఁ దెలియ
బిందు వందు బుట్టెఁ బృథివి యాకాశముల్, వి.

ఆ. టక్కుయోగి యెంత టాటోటు చేసిన
వివర మరసినంత వెగటు గలుగు
పరము సున్న నరకబాధయు సిద్ధంబు, విశ్వ....

ఆ. టక్కుమాట లాడి చిక్కులఁ బెట్టిన
నిక్క మెఱుఁగు నతఁడు నిర్వహించు
జక్కనైన జ్ఞానసారంబు తెలియురా, వి. 1294

ఆ. ఠీవి మిగులఁ గలుగ డెక్కెమ్ము లెత్తించి
యూరు నేల ముక్తి యుత్తదియగు
మంచి త్రోవకొఱకు మహిని యత్నింపరా? వి...

ఆ. ఠేవలేక యున్న డిల్లపోఁ డెన్నఁడు
నిక్కమైన జ్ఞాని నిలుకడగను
ఎంతలాపదలు నీఁకెన్నఁడు నెన్నఁడు, వి. 1296

ఆ. డాఁగుపడిన పండు బాగు లేదందురు

అట్టిడాఁగు తమది యరయ లేరు
తమ్ము నెంచువారు తమడాఁగు కానరు, వి. 1297

ఆ. తంత్రవాదు లెన్నఁ దలచుగ నున్నారు
మంత్రవాదు లరయ మహిని వేరు
జంత్రగాని బొమ్మచందము చూచిన, వి. 1298

ఆ. తనకు భాగ్యమున్నఁ దక్కువ లేకుండఁ
గలుగుభాగ్యమెల్లఁ గల్లయనుచు
నమ్మకముగఁ జూచు నరుఁడగు యోగిరా, వి.

ఆ. తనుభరించు నతని దనయాయుధమ్ముల
అగ్నినింక బరుని యాలినెన్న
సరసమునకు గొనఁగఁ జావె సిద్ధించును, వి....

సీ. తమ తలంపులలోనఁ దత్త్వశిఖామణి
తలఁచినవారెల్ల తత్త్వవిదులు
ఘనమైన నిబిడాంధకారంబునకు జ్యోతి
నసువునఁ జూచిన యతఁడ యోగి
శివునిలో జీవుని జీవునిలో శివు
నొనరఁ దెలియువాఁడు యోగదృక్కు
సాంఖ్యయోగంబున సర్వంబు శివుఁడని
నిశ్చయించినవాఁడు నిర్మలుండు

ఆ. ఇట్టి జాడఁ గాన రెంపటైనను నేమి
పుట్టుకాలశివుని బట్టఁగలరె
పొట్టజీవుబాసి పోయి తానుబ్బురా, విశ్వ.

ఆ. తలుచుఁ జదువ జదువ దర్కవాదమె కాని
దివ్యమైన తెలివి తేటపడదు
పసిరికాయపురుగుపగిదిని జెడిపోవు, వి. 1302

ఆ. తరుణియంగ మెల్ల పురుషుఁ డెఱుంగును
పురుషు నంగ మెల్ల పొలఁతి యెఱుఁగు
చీరగట్టుకున్న సిగ్గానా యెగ్గానా, వి.... 1303

తే. తలఁప నెదిలేక భేదంబు తలఁపనీక
జోలలందును నర్థియై జోల లాడు
చున్న యోగీంద్రుఁ డనిచెప్ప నుచితమగును
వేమ ననియెడు యోగిని వెలయ వేమ! 1304

ఆ. తల్లి గన్నతల్లి తనతల్లి పినతల్లి
తండ్రి గన్నతల్లి తాతతల్లి
యెల్ల శూద్రులైరి యేటి బ్రాహ్మణుఁ డిక? వి....

మత్తకోకిల:—
తల్లిదండ్రులు నన్నదమ్ములు తాతబందుగు లేలరా
మళ్లి జన్మము లేని సద్గురు మర్మభావము నొందరా
పుల్లమైనను రాదువెంటనుభూమిదాటి యటేగుచో
కల్లభ్రాంతిని వీడి వేమన కార్యసిద్ధిని గాంచుమా.

ఆ. తల్లిదండ్రు లెంద ఱల్లజన్మము లెన్ని
తిరిగి యెఱుఁగనట్టి దిక్కు లెన్ని
స్థిరము నస్థిరమును తెలియలేఁ డజ్ఞాని, వి. 1307

ఆ. తాను నింద్రియముల దనర జయించిన

దత్త్వ మరసి చూడఁ దాన యగును
రాజయోగి యిట్లు తేజరిల్లుచు నుండు, వి...

ఆ. తానె తత్వ మయ్యుఁ దన్నె ఱుంగఁగ లేక
మాయ దత్వ మనుచు మఱగుచుండు
ధర్మకర్మములను తా రోయ తత్త్వము, వి...

క. తిన్నగ త్రిపుటిని గురి గని
యున్నను నాదంబు వినఁగ నూహింపుము లో
మిన్ను కని నిన్ను మఱతువు
వెన్నెలలో బయలు సేరి వెలయుము వేమా!

ఆ. తిరిగి తిరిగి తిరిగి ద్రిమ్మరి గా నేల
తీర్థయాత్ర లనుచు తెలివిమాలి
తెలివిలోనిగురుని దెరపిగా జూడరా, వి. 1311

ఆ. తెలుపు మాయఁ జేసి దిట్టతనంబున
దెలుపు భస్మముగను తేటపఱచు
విధము కన్న బరుసవేదియు లేదురా, వి. 1312

ఆ. తొట్టిమానులోని తొఱటజీవుల నెల్ల
మొల్లలేక చంపు ముదముతోడ
నగ్ని లేనిమంట యదియేమిచోద్యమో, వి...

ఆ. తొలుతిత్తిలోనఁ దొలుతఁ బుట్టినతాను
వెనుకఁ దెలియవలయు వివర మఱసి
వెనుక తెలియలేమి వెఱ్ఱియై చెడిపోవు, వి...

క. త్రిపుటికిఁ జూడ్కిని బైనిడి

యుపజిహ్వకు సూటి చేసియు న్మదిలోనే
తప మొనరించెడు భక్తుఁడు
నిపుణుండై వెలుఁగులోనె నేర్పున వేమా!...

ఆ. తనియు పిండమునను దగిలినమనుజుండు
పుట్టలేఁడు వాఁడు పుడమిలోన
నట్టిపుట్టుక గన నవనిలో లేదయా, వి... 1316

ఆ. దాత యైనవాఁడు తానె మున్నిచ్చెడుఁ
గానివాఁ డొసఁగునె కానియైన
జలము దప్పి దీర్చు మల మెట్లు తీర్చును? వి...

ఆ దార బందిగంబు తనయులు సంకెలల్
బంధువర్గ మెల్లఁ బ్రహరిగోడ
మోహ మెఱుఁగ లేఁడు మొక్కలికాఁడయా, వి.

ఆ. దేవభూములందు దేవాలయములందు
దేవుఁ డనుచు మ్రొక్కి సేవఁ జేసి
తెలియ విశ్వకర్మ దేవాదిదేవుఁడౌ, వి... 1319

ఆ. దొడ్డివాఁడు పెద్దతోఁడేలునైనను
మట్టుఁ జూచి దాని మర్మ మెఱిఁగి
గొడ్డు గొట్టెనైనఁ గొని చననీయఁడు, వి...

ఆ. దొమ్మరాటవాని దోర్బల మెల్లను
బొట్టకూటికొఱకె పట్టిన దగు
నదియె యోగి కమర నానంద మందఁడా, వి.

ఆ. దోసముల్లువంటి తుర్యమందాత్మను

జూచి యాసల నటు స్రుక్కఁ జేసి
వాసనఁ దెలిసినవాఁడెపో బ్రహ్మము, వి...1322

ఆ. ద్వారబంధమునకుఁ దలుపులు గడియలు
ఎలెనెనోటి కొప్పు గల నియతులు
ధర్మ మెఱిఁగి పలుక ధన్యుఁడౌ భువిలోన, వి...

ఆ. నచ్చు సేయరాదు నమ్మినైక్యమునకు
మ్రుచ్చులుకను మ్రింగి ముదము గాంచి
చొచ్చి బయలుదేరి పొమ్మసిల్లును యోగి, వి...

ఆ. నయనదృష్టి మీఱి నడపడి గుర్తించి
భయము లేక నొక్కి బయలుపడక
స్వయము జ్యోతి నంటి సౌభాగ్యమందురా, వి.

క. నలుగురు దొంగలఁ బట్టుక
తలఁబట్టఁగ నలయు నొకని దగ దండింపన్
వలెరా మువ్వురిఁ దీర్చుమి
యిలలోపల నెలుకఫలమె యిది యగు వేమా!

క. నలుగురు దొంగల బట్టుక
తల ద్రుంపక యున్న యట్టి తామసి కేలా
గలుగును జ్ఞానము ధర ని
శ్చలపావన మాత్మసుఖము సత్యము వేమా!

క. నాటుము గురువరమంత్రము
దీటుగ మదియందుఁ జేర్చి ధీరుఁడ వగుచున్
దాఁటుము నినుఁ గనుచోటికిఁ

గోటికిఁ బడగెత్త నేమి కుదురుర వేమా! 1328

ఆ. నాడెమైనలంజె నగవుమేలు నెఱుంగు
విటుని గుస్తరించువివర మెఱుఁగు
బానిసయినదాని పాటి గోరఁగరాదు, వి...

ఆ. నయముగాను దృక్కు నాళంబులో నుంచి
భయము మాని వట్టి భ్రమలఁ ద్రొక్కి
స్వయముగాను బుద్ధి సాధించి చూడుము,వి...

ఆ. నరుఁడె యైన లేక నారాయణుం డైనఁ
దత్త్వబద్ధుఁ డైన ధరణి నరయ
మరణ మున్నదనుచు మదినినమ్మఁగవలె,వి...

క. నాడీచక్రము చూడఁగ
నాడులు పదిముఖ్య మల్లనాడులలోనన్
గూడలి నాసికకుడియెడ
మూఁడును నిళపింగళాఖ్యములఁ దగ వేమా!

ఆ. నాదబిందుకళల నయమొంది యాత్మయం
దంది చపలచిత్త మమర నిల్పి
బ్రహ్మరంధ్రమునను బ్రబలిన యోగియా,వి...

క. నాదము బిందువు బిందువు
నాదముగాఁ జేసి కళను నాదును బిందున్
నాదుగఁ జేసియు నీయొక
నాదంబునఁ జూచుయోగి నాథుఁడు వేమా!

ఆ. నాద మలరఁ జేసి నాదముఁ బొంగించి
ఖేద మింత లేక పెనఁగినపుడు
పాలుకాల్వవలెను బాలురాయీనాడు, వి...

ఆ. నాసికందు దృష్టి నయనించు యోగికి
వాసి వన్నె లేల వసుధలోనఁ?
గాశినాథుఁ డతఁడ గణుతింప లేరయా, వి....

ఆ. నాసికాగ్రమందు నయముగా గుఱినిల్పి
వాసిగాను జూడ వశ్య మగును
గాశికంచులఁ గనఁ గడగండ్లు పడనేల? వి...

ఆ. నాసికాగ్రమందు నయమునఁ జేర్చుక
మూసి మూయక కనుమూలలందుఁ
జూచి చూడ నతఁడె శుకయోగి యగుతన్నుఁ
బాయకున్న నాఁడె పరము వేమ! 1338

ఆ. నివురు గప్పినట్లు నిశ్చలభక్తిలోఁ
దగిలియుండ ముక్తి దానె వచ్చు
జగతి నొప్పఁ జెప్ప జాణఁడు లేఁడయా, వి...

క. నిజగురులక్ష్యం బుంచుక
యజపాదిక్రియల మీఱి యలమటపడకే
నిజవిమలాంత స్సందిన
సుజనుని నెన్నంగఁ దరమె సూటిగ వేమా!

తే. నిటలదుర్గములో నున్న నిజ మెఱింగి
పటుతరబుంగ మది నిల్పి ప్రబలుయోగి

యంటిముట్టును నిర్గుణం బట్టె మదిని
గెంటువడ డెప్పు తెలియు నీకిటుకు వేమ! 1341

ఆ. నిటలదుర్గ మెక్కి నిక్కి చూడంగను
కుటిలరూపకళలఁ గూల్చు నెఱుక
పటుతరంబుగానుఁ బట్టి సాధింపుఁడు, వి....

ఆ. నిద్రలోని నిద్ర నిజముగాఁ దెలిసిన
భద్ర మగును మిగులు బ్రహ్మవిద్య
నిద్ర తెలియువాఁడు నిర్మలయోగిరా, వి...

ఆ. నిద్రలోన మనసు నిలుపుచు లోకముల్
భద్రముగను జూపి భ్రమయఁజేసి
పొత్తు విడువకుండు పొసఁగఁగ నీలోన, వి...

ఆ. నెనరు గలుగ గురుఁడు నిటలదుర్గముఁ జూపు
కనులఁ జూడ్కి మఱుఁగు గవయఁజూపుఁ
జెనకి యాత్మరూపు చేసేతఁ జూపురా, వి....

ఆ పంచతత్త్వఫలము భావించి కడ మించి
కొంచె మైన మదిని గోలుపోక
యెంచి మించువాఁడ యేర్పడ్డయోగిరా, వి...

ఆ. పచ్చఁ జూచువారు పచ్చ మెచ్చెడువారు
పచ్చమీఁద వాంఛపడినవారు
పచ్చ విడుచువానిఁ బ్రభునిగాఁ జూతురు,వి...

ఆ. పంచభూతములను నెంచుచు మదిలోన
మించి యందవలెను మిత్తిగొంగ

నంచుఁ దెలియువాఁడె యఖిలజ్ఞుఁ డగుయోగి, వి

ఆ. పట్టువిడక లోని గుట్టును గమనించి
మట్టు ఁదిరియె యెఱుకమూల మగును
బట్టబయలునందుఁ బాటింపనెఱు కేది? వి...

ఆ. పండువలనఁ బుట్టెఁ బరగఁ బ్రపంచము
పండువలనఁ బుట్టెఁ బరము నిహము
పండు మేలెఱిఁగెఁ బ్రహ్మోదుఁ డిలలోన, వి....

ఆ. పతగ మితరజంతువితతి కంతకు మేటి
యగునె రెక్కలుండి యెగురకున్న
వట్టియోగి యిట్టి వైఖరివాఁ డయా, వి...

ఆ. పతనమందునట్టి పక్వఫలంబును
బట్టి తినఁగలాఁడు పచ్చికాయ
కాసపడనిరీతి నైహిక ముండును, వి... 1352

ఆ. పతిని విడువరాదు పదివేలకైనను
బెట్టి చెప్పరాదు పెద్దకైనఁ
బతిని దిట్టరాదు సతి రూపవతియైన, వి....1353

మత్తకోకిల:—

పరమగురువరుమంత్రసిద్ధిని
బట్టి నీలో నుంచరా
యురములో గుటి బయలు దాఁకెడి
నూని నొక్కినతోడనే
కరతలామలకంబు బ్రహ్మము

గ్రాలుచుండును బ్రజ్ఞలోఁ
దిరము వేమన చేరుపద్ధవిని
దెంపుగా మది నుంచరా. 1354

ఆ. పరమపదపిఁ గోరు భక్తుండు నిత్యము
రాజు గోరుచుండు రణజయంబు
మూర్ఖుఁ డెపుడు గోరు ముదితలతోఁబొందు, వి.

ఆ. పవలు రేయుఁ జూడ భావంబులోపలఁ
దాను నేన టనెడితలఁపు మఱచి
యున్న యట్టియతఁడె యుత్తమ యోగిరా, వి...

ఆ. పాదపాయువులను బరగ దేహము మోయు
దేహిజీవములను దెలియు మోయు
ధరణి వీని రెంటిఁ దా నేల మోయునో, వి...

ఆ. పితృపతికిని జిక్కి పెనుత్రోవ గానక
వెతలఁ జిక్కువాఁడు వెఱ్ఱివాఁడు
సతులవలలఁ జిక్కి సంతాపపడ నేల? వి...1358

ఆ. పిల్లి యెలుకఁ బట్టు ప్రియమున నుండఁగ
నదియె కోడిఁ బట్టు ననుగమించు
మమత విడువకున్న మానునా మోహము? వి.

ఆ. పుట్టినజను లెల్ల భూమిని మనియున్నఁ
బట్టునే జగములు పట్ట వెపుడు
యముని లెక్కహెచ్చు నవలఁ దగ్గుచునుండు, వి.

ఆ. పుట్టినది మొదలుగఁ బురుషుఁ డేకాలంబు

పాప మెఱిఁగి శుద్ధపశువు గాక
ముదిసి యోగికరణి ముద మొప్పఁగావలె, వి...

ఆ. పుట్టు దుఃఖమునను బొరలు దుఃఖమునను
గిట్టు దుఃఖమునను గ్రిందువడును
మనుజదుఃఖమువలె మఱి లేదు దుఃఖము, వి...

ఆ. పుట్టు బ్రహ్మలైదు పుడమిని నడుపఁగాఁ
జేత బ్రాహ్మఁ డేల శ్రేష్ఠుఁ డగును
ఏల విగ్రహములు ఎత్తుకోఁదినుటకా?, వి...

ఆ. పుడమి యుప్పరంబుఁ బుడికొనె జగముల
రక్షసేయఁ గల్గు రాజు లెవరు?
మహిపతి యనిపేరు మనుజున కేడదో?, వి....

ఆ. పువ్వుచన్ను గలుగ భూమెల్ల వెలసేయుఁ
గొదవచన్నులు గన గోటిసేయుఁ
దడకచన్నులు గన దయ్యాలు నొల్లవు, వి...

ఆ. పెట్టినంతఫలము పెక్కండ్ర కుపహతిఁ
జేయకున్నఁ దాను జెరుపకున్నఁ
బెండ్లి సేయునట్టి పెద్దఫలంబురా, వి... 1366

ఆ. ప్రాణులందు శివుని భావింప నేరక
యోగమందు రేల? నోగులార!
యోగమందుఁగలదె భోగమందున్నట్లు, వి....

ఆ. పృథివిఁ బుట్టె మొలక పృథివిలోఁ గలిసెను
మఱల నదియె పుట్టు మగఁడె సుతుడు

ధరణిజనుల కెల్లఁ దల్లియౌఁ బెండ్లను, వి...

ఆ. బడుగు నెఱుఁగ లేని ప్రాభవం బది యేల
యోగి నెఱుఁగలేని యోగ మేల
వ్యాధి దెలియలేని వైద్యుఁడు నేలయా?, వి...

ఆ. బాల్యమందు శివుని బరికింపఁగా లేరు
యౌవనంబునందు నరయు లేరు
ముదిమియందుఁ గూడ మోసమే గందురు, వి.

ఆ బిగియు దృష్టి నెపుడు బింబమం దుంచిన
మననమందు నెఱుక మగ్న మగును
లగ్నచిత్త మమర రక్షించుచుండురా, వి...

ఆ. బిందు నాదుఁ జేసి ప్రియ మొప్పఁగా నల్ల
నాదు బిందుఁ జేసి నయముగాను
బిందునాదునందు భేదించి చూడుము, వి...

ఆ. బుద్ధియుతున కేల పొసఁగనిసఖ్యము
కార్యవాది కేల కడుచలంబు
కుత్సితునకు నేల గురుదేవతాభక్తి, వి ... 1373

ఆ. బూటకంబుచేతఁ బుడమిలో నొకకొన్ని
నాటకంబు లాడి నయముఁ జూపి
దీటులేక తాము తిరుగుచు నుందురు, వి....1374

ఆ. బూదిపూఁత లెన్న బుజముల పొంకాలు
వ్రాలు లింగములును వరుసమతము
లిక్కడఁ దగుఁగాక యెక్కడఁ దగు నట్లు, వి.

ఆ. బేసికంటివానిఁ బెంపార మదిఁ జేర్చి
పూజ చేయవలెను బుద్ధి నిలిపి
యాత్మపూజకంటె నదనఁబు లేదయా, వి...

ఆ. బొంది యెవరిసొమ్ము పోషింపఁ బలుమారు
ప్రాణ మెవరిసొమ్ము భక్తి సేయ
ధన మదెవరిసొమ్ము ధర్మమే తనసొమ్ము, వి...

ఆ. బొమ్మలాటవాఁడు బొమ్మల నాడించు
భువిని జనులు చూడఁ బోలుపుమీఱఁ
దాను మఱఁగియుండి దైవము నాడించు, వి...

ఆ. బొమలనడుమఁ గుఱ్తుఁ బొందింపఁ జాలక
విమలదృష్టి మదిని వెలుఁగఁబోదు
తమము దీఱినంతఁ దత్త్వంబు తా నగు, వి...

ఆ. బొంది నమ్మి మిగులఁ బోషించి పలుమాఱు
ప్రాణి విడుచు టెల్లఁ బాతకంబె
తనదులోన భక్తిఁ దనరుటే మోక్షము, వి...

ఆ. బోఁడితలల జడల బూడిదె పూఁతల
భాషణాసనముల వేషములను
యోగు లైరె? లోన బాగుగా నుండిన?, వి.

ఆ. బ్రదుకు నిత్య మనుచుఁ బదరుచు నగమీఱ
విఱ్ఱవీఁగువాఁడు వెఱ్ఱివాఁడు
ప్రాణు లెల్ల యమునిబారికి గొఱ్ఱెలు, వి...1382

ఆ. బ్రహ్మమనఁగ నెటనొ పరదేశమున లేదు

బ్రహ్మ మనఁగఁ దానె బట్టబయలు
తన్నుఁ దా నెఱిఁగినఁ దానె పో బ్రహ్మంబు,వి....

ఆ. బ్రహ్మ మేడ ననుచుఁ బలుమాఱు నాడేరు
వెఱ్ఱిమూర్ఖజనులు విధముఁ జూడ
బ్రహ్మ మన్నిటఁ దగుఁ బరిపూర్ణమై యుండ, వి.

ఆ. బ్రహ్మ ఘటము మేను బ్రాణంబు నగ గాలి
మిత్రచంద్రశిఖులు నేత్రచయము
మఱియు బ్రహ్మమనఁగ మహిమీఁద లేదయా,వి.

ఉ. మేదిని లేని వాదముల మిక్కుటమైన బలంబు లే
దు లే, నాదుగ గాలి లేని యొకనవ్యము మేఘము
గప్పదగ్లైన, ద్రోధము లేక సద్గురుని పుత్రుఁడవౌ
దె నీదానదృశ్యమా, వాదులఁబోకయుండుమిఁక
వచ్చునదెల్ల నెఱుంగు వేమనా 1386

సీ. మొదలు మూలాధార మొదవ విఘ్నేశ్వరుం
డచ్చోట దేవాళి యలరుచుండు
నందు మీఁదటను రెండంగుళంబుల మేర
స్వాధిష్ఠచక్రంబు వఱలు బ్రహ్మ
దీనికి నెన్మిది దేహాంగుళంబుల
మణిపూరచక్రంబు మలయునుహరి
యంత దశాంగుళమవల ననాహత
మొప్పారు రుద్రుం డట నొనరియుండుఁ

తే. బదియు రెండంగుళములకుఁ బైవిశుద్ధ
మందు జీవుఁడు పొందుగా నలరుచుండు
వెలయమహిమాత్ముఁ డగ్నియై వెల్గుచుండు
నిట్టిజాడలు తెలియుట యెఱుక వేమ! 1387

ఆ. యోగి ననుచుఁ గొంత యోగము గూర్చుక
జగము నెల్లఁ బుట్టి చంపి తినుచు
ధనముకొఱకు వాఁడు తగవాఁడుచుండిన
యోగికాఁడు వాఁడె యోగు వేమ! 1388

సీ. వాతపైత్యశ్లేష్మరీతు లొక్కటిగాఁగ
శాత్రవమిత్రులు సమముగాఁగ
సరవితో నన్నమౌషధము లొక్కటిగాఁగ
స్వర్ణలోష్ఠంబులు సమముగాఁగ
జాతిభేదంబుల సమములొక్కటిగాఁగఁ
గర్మధర్మము లొక్కటియుఁగాఁగ
ఘనసుఖదుఃఖంబు లెనయ నొక్కటి గాఁగఁ
గనదివారాత్రు లొక్కటియుఁగాఁగఁ

ఆ. దెలిసి యాత్మలోన దేదీప్యమానమౌ
తేజమందు శివుని దేటపఱచి
మనసుఁ జేర్చి శివుని మగ్నత నుండరా, వి...

## బ్రహ్మస్వరూపపద్ధతి.

---

క. అఖిలాకారుఁ డనంతుఁడు
సకలాత్మలయందు సర్వసాక్షియుఁ డానై
నిఖిలముల నిర్వికారుఁడు
నికరము బ్రహ్మ మ్మనంగ నిజముర వేమా! 139

ఆ. అగ్రమందుఁ జేరి యగ్రేశుఁడై యుండు
నిగ్రహించి యెఱుక నియతి మీఱి
మోహగుణము లన్ని ముక్కోని దాఁటరా, వి.

ఆ. అచలతత్త్వ మనఁగ ననుభవగమ్యంబు
చూపి చెప్పరాదు సూక్ష్మ మదియె
మదికిఁ దోఁచుఁగాని మర్మ మెన్నఁగ రాదు, వి.

క. అచలపోన్వితయుక్తిని
బ్రచురించెడియాత్మకాంతి ప్రతిబింబములో
సుచరిత్రంబగు నిష్కళ
రచియింపుము బట్టబయలు రాజిలు వేమా.

ఆ. అచలయోగతపము నందంగ గమకించి
ప్రచురమైనకాంతిఁ బడయుచుండి
రుచిరముగను దాఁట రూపింపఁ బరమాత్మ, వి.

క అతిసూక్ష్మదృష్టిలోనను
మది కింపుగ శివుని గూర్చి మఱియొక తైనన్

బ్రతిలేనిమోక్ష మదె యగు
సతతపునిర్వాణపదవి సాక్ష్యము వేమా! 1395

ఆ. అందరానిసంద దడవి వెన్నెల నుండు
నుండుఁ జూడ దొడ్డ నుండుగాను
బండుపడినఁ జెట్టు పట్టంగ లేరయా, వి...1396

క. అది యిది యని మదిఁ దోఁచెడు
సదనము గుర్తించి లోన సాధించినచోఁ
గుదురును బ్రహ్మానందము
గదిసిన మదిఁ జేర నొక్కి కనవలె వేమా! 1397

ఆ. అందు నిందు ననక యన్నిటియందును
విష్ణు వమరియుండు వెలయ భువిని
వెనుకఁ జక్రి తిరుగు విష్ణుచక్రంబుతో, వి...

ఆ. అన ననాహతమున నది లెస్సగాఁ జూచి
ఇఁకను దాన వాయు వీహఁ జేసి
కడమవాయు వందుఁ గదలకుండినవాఁడు
చెప్పనేల వాఁడె శివుఁడు వేమ! 1399

ఆ. అన్నదానమునకు నధికసంపద గల్గి
యమరలోకపూజ్యుఁ డగును మీఁదు
అన్నమగును బ్రహ్మ మది గనలేరయా, వి...

ఆ. అన్నము నమృతమ్ము నంటు నంటనుచును
బరిహరింత్రు తెలియఁబడక ద్విజులు
అన్న మమృత మిదియ హరి హర బ్రహ్మలు

అంటవన్న వాని కంటు వేమ! 1401

తే. అమల మవ్యయచింతన మనిపదంబు
గోరి జీవేశ్వరైక్యంబు గూర్చినంత
నవిరతంబగు పరిపూర్ణ మమరు నయ్య
వాదులాడంగ జిక్కంగ రాదు వేమ! 1402

ఆ. అయిదువర్ణములనె యఖిలంబు తెలిసిన
నయిదునందు ముక్తి యమరియుండు
నయిదులోన నున్నయతండె పో యఖిలము, వి.

ఆ. అర్ధయంకణమున కాధార మైనట్టి
యొంటిమేడగుంజ నొనర నిల్పె
నింటి కొకమగండె యిల్లాండ్రు నేడ్గురు, వి.

ఆ. అష్టదళములకును నాధార మైనట్టి
యాదిదేవు డొకండె యఖిలజగము
త్రయముదాటువాడు తానె పో బ్రహ్మంబు, వి.

క. ఆకలిం జంపిన రాదది
యాకులం దిని యడవులందె యలసిన నైనన్
జీకటికోనం జిక్కదు
నేకాకృతి మదిని నిల్పి యెఱుగుము వేమ!

క. ఆకాశంబున వాయువు
ప్రాకునదావాగ్ని యటుల మానసమందా
యేకాకారుడు జగమున
జోకై తను దానె వెల్గు సుమ్మిర వేమ! 1407

ఆ. ఆకు వక్క సున్న మవి మూఁడువన్నెలు
నేక మైనచోటఁ దాఁకు నెఱుపు
జోఁకి త్రిగుణ వట్లు శోభించుఁ బరమాత్మ, వి.

ఆ. ఆకులేనికొమ్మ యభ్ర మెల్లను నిండె
మ్రాకు మొదలుఁ దుదయు మహిని లేదు
ఏకమైనపండు నింపొందుచుండును, వి....1409

ఆ. ఆకృతి నరయఁగ నిరాకృతి యనఁ దగు
నాకృతి నొగిఁ దగు నిరాకృ తిట్టు
లవియు రెండులేక యపురూపమై యుండు, వి.

ఆ. ఆదిఁ జూచుచుండ నన్నిటఁ దా నుండు
నాఁడు చూడ నొకరి కలవి కాదు
ఆదిముక్తి తెరు వ దాత్మనే యుండును, వి...

ఆ. ఆది నెవరు పుట్టి యవనికి దొరలైరి
వారె బ్రహ్మ విష్ణు వరశివు లనఁ
గనఁగ మాయశక్తి ఘనతేజ మందఱు, వి...

ఆ. ఆఱుదూలములకు నాధార మైనట్టి
యొంటికంబ మింటి కొనర నిల్పి
యింటి కొకఁడు కర్త యేపారుచుండును, వి.

ఆ. ఉనికి మేరుశిఖర మున్మత్తతను జూచి
కనియుఁ గానఁబోవుఁ గదల దదియు
వినియు వినవు దాని విమలాంతరంగము, వి...

ఆ. ఉప్పు నీరునట్టు లూహించి చూచినఁ
గప్పురంబు జ్యోతి గలసినట్టు
లుప్పతిల్లు మదిని నొప్పుగా శివుఁ డుండు, వి...

ఆ. ఉబ్బి గుర్తు చూచి యూహను రెట్టించి
నిబ్బరపడువాఁడు నిర్మలుండు
అబ్బరాని బయలునందును బొందును, వి....

ఆ. ఉర్విజనులు పరమయోగీశ్వరునిఁ జూచి
తెగడువారె కాని తెలియలేరు
అమృతపురుచులను హస్త మెట్లెఱుఁగును? వి.

క. ఊకొనఁ జెప్పిన విన దది
ప్రాకటముగ లోకములను బాలించెడియా
పాకము మదిలో బయలని
యేకాకృతి నవిరతముగ నెన్నుము వేమా! 1418

ఆ. ఎక్కువెట్టి గుఱుతి కేకమైనంతట
పొక్కి పోలి యుండు సూత్రముగను
ముక్కు సెవులు లేనిమూలమే పరమాత్మ, వి.

తే. ఎఱుక దోడ్కొని తత్త్వంబు నెఱుఁగు నట్టు
లెఱుక తొలఁగిన తత్త్వము నెంచరాదు
ఎఱుక మఱపుల కందని యిరవు గనుము
ఎఱుఁగుచుండెడి దానినె యెంచి వేమ! 1420

క. ఎఱుకను బుట్టును తనువులు
ముఱికిని దా ముఱుగుచుండు మోయుట గాదా

యెఱుక గలతనువు నొందిన
పఱియును జన్మించు నట్లు మహిలో వేమా!

ఆ. ఎఱుక నెంచి చూడ నెఱిఁగించుచుండును
బరము దాఁకి చూడ బట్టుపడును
గుఱికి బయలుఁ జేర గుణరహితంబురా, వి...

తే. ఎఱుక మఱపులు గానిది యెఱుఁగలేరు
పరమపరిపూర్ణసుఖ మూని పట్టలేరు
ఉరము బెదరని గుఱిగని యుండలేరు
నిరుపమానందసంతృప్తి నిలుప వేమ! 1423

ఆ. ఎఱుకమాలు జీవి యెంతకాలంబున్న
చచ్చిపుట్టుచుండు సహజముగను
ఎఱుక మఱచు చోటి నెఱుఁగుట బ్రహ్మము,వి.

ఆ. ఎఱుక మఱపులందు నేమేమి తోఁచిన
పరికి గుఱియె గాదు సత్యమునకు
పరమనిర్గుణంబుఁ బాటించి కనవలె, వి... 1425

ఆ. ఎఱుకయుండువాని కెఱుకయే యుండును
ఎఱుక లేనివాని కెఱుక లేదు
ఎఱుక లేనియెఱుక నెఱుఁగుట తత్త్వము,వి...

ఆ ఎవరి కెవరుగా రి కెవ్వరుఁ గాఁబోరు
గవయఁ గోరు హంస గదియ నొక్కి
శివునిరూప మూని సేవింప దొరకొను, వి...

తే. ఎవ్వఁ డజ్ఞానతిమిరంబు నేపు మాపి

జ్ఞానమను వెన్నెలం దొప్పఁ బూను నేని
చంద్రుఁబోలిన గురునండ సాధకముగఁ
గూడినను గాని తీరదు కోర్కి వేమ! 1428

ఆ. ఎవ్వఁ డేమెఱుంగు నింపైనవస్తువు
దేహ మే మెఱుంగు దివ్యబోధ
విధము దెలియఁగోరి వేదాంత మెఱుఁగుఁడీ, వి.

ఆ. ఐదు నైదు నారు నెన్మిది నొక్కటి
యొడలోన నుండి యొరసిల్లు
నోడ యెక్కి తిరుగు నాడయఁడే తత్త్వంబు,వి.

ఆ. ఏడుమార్గములను నేకాంతమునఁ జేరి
యాడి పాడి ముక్తి గూడి వేఁడి
జాడలోని బయలు సాధించి కనఁబలె, వి 1431

ఆ. ఏడె యక్షరముల నీయందమొందిన
నందు నిందు ముక్తి యలరుచుండు
నందు నిందు తెలియ నడియుహో బ్రహ్మము, వి.

ఆ. ఏపుమీఱ మదిని నెంచి మించుచు గుర్తు
రూపవు భ్రమ లడఁచి రూఢిపడక
కాపురంబుఁ జేరి కడగండ్లు మానుము, వి...

క. ఏరూప మెచటఁ జూచిన
నీరూపమె గానిపించు నిలిపి తెలివియా
నీరూపమె తా నెఱిఁగిన
ధారుణిలో నీశ్వరుండు తా నగు వేమా!.

క. ఏరూపున నారూపము
లోరూపునఁ జూచుచుండ లోకారాధ్యుం
డేరూపుఁ జూచువారికి
నారూపై కానిపించు నభవుఁడు వేమా! 1435

ఆ. ఒకట రెంట మూట యోగీంద్రులను గూడి
యుదయపర్వతంబు మొదలి గిరుల
క్రమ మెఱింగి కాంచు ఘనపట్టణంబుల
వీరుఁ డొక్కఁ డేలు వినుర వేమ! 1436

క. ఏరూపు మదిని గోరిన
నారూపే తోఁచు భ్రమల నొఁ గా దనమిం
థారాళముగను బ్రహ్మము
కోరికలను మించి చూడ గుదురును వేమా!

ఆ. ఒక్కఘటములోనఁ బెక్కురూపులు నిల్చు
నెన్ని యెన్ని రూపు లెసఁగుచుండు
నవియు దొలఁగనేని యన్నియుఁ బైకొను, వి.

ఆ. ఒంటికంబమందు నొనరఁ జూచెడు జ్ఞప్తి
గూడి యాడి పాడి కోర్కెదీఱ
మేడదాఁటి చూడ మితి మీరుచుండురా, వి.

ఆ. కడక నింద్రియములఁ గట్టివేయఁగ లేక
చావు వచ్చునపుడు సన్యసించు
నాత్మజితము గామి నందునా మోక్షము?వి...

ఆ. కడుపులోనిమలము కష్టమై యుండఁగా

నన్న మేమి కీడో యనుచుఁ దలఁచి
యుప మెఱుగక మనుజు లుపవాసముందురు, వి.

ఆ. అక్షరపుట మిట్టియరదంబులోఁ గూర్చి
యమర నొక్కరవము ననుభవించు
నతనికొఱకు ముక్తి యక్షయమై యుండు, వి.

ఆ. ఆత్మ తేజ మూని యనుభవించుట ముక్తి
ఆత్మతత్వ మెఱుఁగునతఁడె యోగి
యెఱిఁగి మరగినంత నేకమై తోఁచురా, వి ...

ఆ. ఆత్మయందె తలఁపు ననువుగా నొనరించి
నిశ్చలముగ దృష్టి నిలిపెనేని
యతఁడు నీవె సుమ్మి యనుమాన మేలరా, వి...

ఆ. ఆత్మలోనిశివుని ననువుగా శోధించి
నిశ్చలముగ భక్తి నిలిపెనేని
సర్వముక్తుఁ డగును సర్వంబు దా నగు, వి...

క. ఆత్మానాత్మవివేకము
స్వాత్మను గని యంతమీఁద స్వచ్ఛందగతిన్
ఆత్మకు లో వెలి నెగడు మ
హాత్ముని బొగడంగవశమె హరునకు వేమా!

ఆ. ఆదిమూలవిద్య నానందభరితుఁడై
వేదతుల్య మనుచు విడక పూని
పాదుకొనినవాఁడు పడయును మోక్షంబు, వి.

ఆ. ఆదిశక్తి దొడరి యలమటఁ జెందక

ప్రాణపంచకంబు పట్టు నెఱిఁగి
అంతరిక్షమందు నభినుతించుట ముక్తి, వి...

ఆ. ఆశవిడక కాని పాశముక్తుఁడు కాఁడు
కాఁడు ముక్తుఁడైన గాని మృతుఁడు
మృతిని బడయకున్న క్షితి మోహమూఁడదు, వి.

ఆ. ఉత్తమాంశ బూనియు న్మహిలోఁ జేరి
మత్తు మించినట్లు మరగి రాక
సత్తమంబు మీఁటి సాధింప ముక్తిరా, వి. 1450

క. ఉదకములోపలి తత్త్వము
వెదకియుఁ దా నగుట దెలిసి వేగమె మదిలో
నుదకము వలెఁ దాఁ దత్త్వము
మదిఁ దెలిసినవాఁడె తత్త్వమయుఁడౌ వేమా!

తే. ఉన్న నిర్వాణనిజచర్య గన్నవాఁడు
తన్ను తనలోనఁ జూచెడి తత్త్వ మెఱిఁగి
సన్నుతించును బరమాత్మ సమతమతిని
గన్ను గాననివాఁ డేమి గాంచు వేమ! 1452

ఆ. ఎచటఁ జూడ్కి నిలిపి యెంతగఁ జూచిన
నచటఁ దోఁచు కళల నందరాదు
అచలమైనవ్యక్తి నందుట మోక్షంబు, వి...

ఆ. ఎన్ని తనువులైన మృతికి నడ్డము గావు
మృతిని గెలువ లేక యెఱుక లేక

దొంగరీతి గాగ దొరకునా మోక్షంబు, వి...

క. ఏకబ్రహ్మము నిత్యము
వైకృతము లనంగ దగినవస్తువు లెల్లన్
ఏకత్వం బని రోజేగిన
శోకము లేనట్టి ముక్తి సులభము వేమా! 1455

ఆ. ఏకమునను జూడ నెఱుక యేకంబౌను
భువిని సతిని గూడుపురుషుమాడ్కి
లోకకాంతునట్టు లోపల వెలుగును, వి. 1456

ఆ. ఏమి చదివి యేమి యెఱుక లేకుండిన
చదువులందు బరమసౌఖ్య మేది?
మానసైక్యమునసె మఱి ముక్తి కలుగురా, వి.

ఆ. ఒకటిలోనఁ గొట్టి నొకటిలోనసె పెట్టి
యొకటిలోను చూడు మొకట చూపు
ఒకటియందె చూడ నొనరంగ ముక్తిరా, వి.

ఆ. కలుష మెన్నికొనఁగ గౌరవహానియే
యరయఁ దత్వమెన్న నాత్మఘుటిక
తెలసి తాను సిదప స్థిరుఁడు కావలెనయా, వి.

ఆ. కష్టమైన మనసు గాంతిఁంచు యోగికి
జ్ఞానదీపశిఖయు దా నటింపఁ
గానవచ్చు నాత్మ క్రమమైన జ్ఞప్తితో, వి...

ఆ. కష్టమైనమలము కడుపులో నుండఁగ
నంతకంటె జెడె నె అన్న రసము

ఉపము లేనిజనము లుపవాస ముందురు, వి...

ఆ. కష్టలోభివాని కలిమికి నాసించి
బడుగువాఁడు దిరిగి పరిణమించుఁ
దగరువెంట నక్క దగిలినచందము, వి... 1462

ఆ. కాయగాయ గాల్చి కనకముఁ జూడరా
కాయ మనఁగ బ్రహ్మకాయ మండ్రు
కాయఁ దెలియునతఁడె కౌస్తుభధరుఁడగు,వి...

ఆ. కాయమును గడఁగియు గనక యావలనున్న
కాయమును విడిచినఁ గాఁడు యోగి
కాయమందు ముక్తి గతి కేఁగవలయురా, వి.

ఆ. కాలధర్మ మెఱిఁగి కపటవృత్తులు మాని
యాలుపిల్లలందు నాశ వదలి
మేలుగాను శివుని మేల్కని చూడరా, వి...

ఆ. కాశియాత్ర కేఁగి గంగస్నానముఁ జేసి
కష్టపడిరి ముక్తి గానలేక
యేనుము దిరుగుచుండు నెనుబోతు వెంబడి,వి.

ఆ. కాశియాత్రఁ జేసి గాసిపడుటె గాని
మోస మగును దాన ముక్తిలేదు
పాశ ముడుగఁ బూనుఫలమె యా కాశిరా, వి.

ఆ. కూడిపరనశింపుకోర్కెలు లేకుండ
నాటపలెను బుద్ధి నయముగాను

చోటు గనని వెలుగుఁ జూచ్చుటే మోక్షము,వి.

క. కోటులు సంపాదించినఁ
గూటికె సరిపోయె బ్రదుకు గుంపులు కూలెన్
ఏటికి నీసంసారము
చోటున నిను గన్న నాఁడె సుదినము వేమా!

ఆ. కోపమునను నరకకూపముఁ జెందును
కోపమునను గుణము కొఱతపడును
కోపమునను బ్రదుకు కొంచెమై పోవును, వి...

క. గంగాయమునల నడుమను
బంగారపుబొమ్మవోలె బాటిక యుండున్
సంగతిగఁ జెలిమిఁ జేసిన
భంగము లేకుండ ముక్తిపరమగు వేమా! 1471

క. గంగాధరుండె దైవము
సంగీతమె చెవుల కింపు సర్వజ్ఞులకున్
బంగారమె యుపభోగం
బంగజుఁడే మృత్యుహేతు వరయఁగ వేమా!

తే. గమ్య మగుజ్ఞాన మందుట గగనవిద్య
జ్ఞాన ముదయించి మించఁ బ్రజ్ఞాన మమరుఁ
బరగు ప్రజ్ఞానమందుటే బ్రహ్మపదవి
పరశివుం డగు నిది యంచ ధరను వేమ! 1473

ఆ. గీము విడిచిపెట్టి గిక్కురు మనకుండ
జీవ ముడుగువేళ శివుని దలఁచు

మనసు గొల్పకయును మాయచేఁ బొరలెడు
పాజనుల కెచట పరము వేమ! 1474

ఆ. చిత్రదీపమువలె చింతను దిగద్రొక్కి
మిత్రముగను మనసు మెలఁకు వెఱిఁగి
శత్రుగుణము లెల్ల సాధించుటయె ముక్తి, వి.

ఆ. చక్కగాను మదిని జర్చించి కనవలె
ముక్కు తుదిని మించి మురిపెముగను
దృక్కుబ్రహ్మమనుచు ద్రొక్కినంతనెముక్తి,వి.

ఆ. చందమామ నీడఁ జక్కఁగాఁ దనలోన
నుండఁ జూచి కేల నూఁదిపట్టి
వెన్నెలబయలందు వెదకినంతనెముక్తి,వి. 1477

ఆ. చదువులందు లేదు శాస్త్రంబులను లేదు
వేదములను లేదు వాదములను
బయలునుండు ముక్తి పాటించి చూడరా, వి.

ఆ. జీవమునను నాత్మ స్థిరతను గానక
తిరుగు నస్థిరమును గుఱిగ నమ్మి
స్థిరము నస్థిరమును దెలియ జీవికి ముక్తి, వి...

క. జీవాధారుఁడు రుద్రుఁడు
సేవార్చనపరుఁడు నగుచు స్థిరమతి వెలుఁగున్
భావాతీతపరంబుగఁ
గావించుము మనసు బయలు ఘనముగ వేమా!

క. జీవుని దెలియక వేఱుగ
దేవుని భ్రమ దిరుగునరుఁడు దేవుఁడు తలఁపన్
జీవుం డని వివరించిన
భావింపఁగ ముక్తి బట్టబయలగు వేమా! 1481

ఆ. జీవిలోన నుండు స్థిరమును గానక
తిరుగు నస్థిరముసె వరుస నమ్మి
స్థిరము నస్థిరమును దెలియ జీవికి ముక్తి, వి...

ఆ. జీవులెల్ల ముందు జీవాత్మ పరమాత్మ
జత లెఱుంగ పాపజడధిఁ బడరు
నావ నడుపువాఁడు నట్టేట మునుఁగునా? వి.1483

క. జెండా వేయఁగవచ్చును
కొండలు పెకలింపవచ్చు కుదిరినమదిలో
నిండారగ పరిపూర్ణము
జెండాడఁగ ముక్తిత్రోవఁ జెలఁగును వేమా!

తే. జాడ గలగుటిమేడలో జోడుగూడి
వేఁడి యష్టాక్షరములందు విధ మెఱింగి
కూడియాడెడువాఁడె పో కోవిదుండు
సత్వసంసిద్ధి పడయంగఁ జాలు వేమ! 1485

క. జ్ఞానికి కర్మం బేటికి
జ్ఞానికి గర్మంబు గలుగఁజాలదు చూడన్
జ్ఞానమె కర్మంబైనను
మానవులకుఁ గర్మముక్తి మహిలో వేమా!

తే. తనదు దేహమందు తనకున్న పరివార
మందఱిని బిగించి హర్ష మెసఁగ
నెల్లచావు లెఱిఁగి యిందందు యోజించి
నడవ మేటివర్తనమురా వేమ! 1487

క. తను దానై బయ లందుచు
ననుమానము లేక తానె యచలుం డగుచుఁ
వినయవిధేయత లొందిన
మనమే యానందరూపమయ మగు వేమా!

ఆ. తఱచు దమము బాసి తనువులు మఱచియు
బరమునందు మనసు బయలుపఱచి
కదియ నున్నయట్టి ఘను లెందఱున్నారొ, వి...

క. తలఁచిన తత్త్వం బగునే
తలఁపక తా నూరకున్న దత్త్వం బగునే
తలఁచుట తలఁపమి రెండును
తలఁపక తా నుండెనేని దత్త్వము వేమా! 1490

క. తా ననఁగ నెన్నఁడయ్యెనొ
యేనన నెవ్వాండు గలఁడొ యెఱుకగు దానిఁ
దానని మనమున నెఱుఁగక
పూనెడు జీవుండు జడుఁడు బొంకరి వేమా!

ఆ. తాను సకలమౌటఁ దనలోనిసకలంబు
తనదులోనివెలుఁగుఁ దానె యెఱిఁగి
యున్నమానవునకు నొనరును ముక్తిరా, వి...

తే. తాను సంకల్పరూపుఁడై తమకమందు
దాను సంకల్పరహితుఁడై తగులు ముక్తి
ముక్తి యన చిత్తశూన్యంబు మోక్ష మదియు
దీని నిక్కంబు గనువాఁడె మౌని వేమ! 1493

క. ధ్వని పుట్టిన నాలించుచు
ధ్వనిమధ్యమునందు జేరి ధ్వని తానై తా
గనుపించునంతఁ దనహృ
ద్వనజంబునఁ జూడ ముక్తి వశమగు వేమా!

సీ. ధరణిలోఁ జదువెల్ల పరమాత్మలోనాత్మ
నైక్యంబు సేయని యజునిసొడ్డు
పంచభూతఘటితప్రకృతిని దలపోసి
ఎఱుకెఱుంగనివాని నెత్తిసొడ్డు
పంచవింశతితత్త్వపద్ధతి నెఱుఁగక
వేదాంతి ననువాని మీఁదసొడ్డు
అంతరంగములోని యానుకూల్యము లేక
యోగి నేననువాని కొక్కసొడ్డు
తే. తాను తానైన తత్త్వంబు తగులుగలిగి
వెలినిలోనను నొకటను దెలివితెలిసి
బ్రహ్మవేదంబు గనలేని పామరునకు
వెనుక నొకసొడ్డు గల దింక వినుము వేమ! 1495

ఆ. నాకు నెవరుదిక్కు నడినాళములలోను
వేగుచుక్కవంటి వెలుఁగుదిక్కు

వెలుఁగుకంటె దిక్కు వెదుకంగ లేదయా, వి...

ఆ. నాదు నాదు చూడ నాతులయందుండు
నాదు లేనియట్టి నరులె లేరు
భేద ముడిగి దీని బ్రియపడి కనుఁడయ్య, వి...

ఆ. నిజము కళలమీఱి నిత్యుండు కావలె
పలుకులోనిపలుకు పదిలపఱచి
వేడుకలర ముక్తి వెన్నంటియుండురా, వి...

క. నే ననఁగ మేను గాదని
మానసమున నెఱుఁగకున్న మనుజులకెల్లన్
స్వానుభవసిద్ధి దొరకదు
తానగు పరమాత్మ నెఱుఁగఁ దరమా వేమా!

ఆ. నే ననువచనంబు నీ వనఁగా వచ్చు
నీవు నే ననఁబడు నిష్ఠదెలియ
నేను నీవె నీవె నే ననవచ్చురా, వి... 1500

ఆ. నేను నీ వనియెడి నెత్తంపుమాటలు
మాని యుండువాఁడె మానవిదుఁడు
తాను నే ననియెడి తమకంబు మానరా, వి...

క. పంచగుణక్షయబిందువు
పంచాక్షరినాద మంద్రు పరమమునీంద్రుల్
ప్రాంచితముగ నది తెలిసిన
మంచిగనన్ మ్రొక్కునతఁడు మహిలో వేమా!

ఆ. పంచతత్త్వములకు బ్రహ్మాల కొకసొద్దు
వారితండ్రి నెత్తి వైతు సొద్దు
నంతరంగ మెల్ల నాదిశక్తి యెఱుంగు, వి...1503

క. పంచమహాభూతములై
పంచశరీరములు గలిగి బ్రహ్మాండంబై
పంచావస్థలు దాఁటి న
టించుట పరిపూర్తిఁ జెందు డెంకిరి వేమా! 1504

ఆ. పంచశత్రువులను పంచబాణుని గోసి
పంచవర్ణములను బరనఁ జేసి
పంచముఖంబులఁ బ్రతిఫలించెడువాని
పంచఁ జేరువాఁడె పరుఁడు వేమ! 1505

క. పంచాక్షరిజపమందిన
సంచితకర్మములు వాయు సాకల్యముగా
మించును బరమజ్ఞానము
ద్రుంచును దుష్క్రియల మదిని రూఢిగ వేమా!

క. పడిపడి మ్రొక్కఁగ నేఁటికి
గుడిలోఁ గలకఠినశిలల గుణములు చెడునా
గుడిదేహ మాత్మ దేవుఁడు
చెడురాళ్లకు వట్టిపూజ సేయకు వేమా! 1507

ఆ. పదునుగల్లు మ్రాను పచ్చనై యుండును
ఈవి గలుగ లంజె యింటనుండు
తలఁపుగలుగ హరియు దనయొద్దనేయుండు, వి.

తే. పరమనిర్గుణవిద్యలో భావ ముంచి
మానసజ్ఞానపరిపూర్ణమననమందు
నేకరూపము మది నెంచి నిచ్చఁ గనుము
శాశ్వతానందసంసిద్ధి జరగు వేమ! 1509

ఆ. పరము గోరనట్టి పామరజనులకు
స్థిరము గాదు బుద్ధి చిక్కఁబోదు
తరముగానిపరముఁ దలపోత యగురోఁత, వి.

క. పరమాత్ముని వివరింపఁగ
నరుఁడా యణురేణువందు నతిసూక్ష్మగతిన్
బరికింప నన్నిరూపుల
గురుఁడై తా వెలుఁగుచుండు గుఱుతుగ వేమా!

ఆ. పరము పరమటంచుఁ బలుకుదు రందరు
పరమునందు నేమి ప్రబలముండు
పరమునందు నిందు పరిపూర్ణుఁడే కదా! వి...

క. పాదమున నడచు నరుఁడట
లేదనఁగా భూమి దిరుగు లెస్సగ దనకే
యేదైన హాని వచ్చిన
సాధనమగు పదము నడవ జరుగదు వేమా!

ఆ. గగన మమరఁ జూడ్కి కనుబాట నిక్కించి
నిలిపి చూడఁ జూడ నిలుచు సుఖము
సుఖములోనివరుస సూత్రింప బ్రహ్మము, వి...

క. ఘంటారవమును మదిలో
వింటె న్నే గంటఁ గంటి విమలపుకాంతిన్
వెంటాడక బ్రహ్మంబును
గంటివి వగకాదు నన్ను గనుఁగొన వేమా!

క. ఘనసార మగ్ని దొరకొన
ఘనసారం బగును కాదె కారణవిద్యా
ఘనసారము విద్యాగ్నికి
ఘనసారమె కంటకంబు గలుగుర వేమా!.1516

తే. చంద్రసూర్యాగ్ను లేర్పడ్డ చంద్రశాలఁ
జేరి పరశివు నాత్మలో చింతఁ జేసి
చిన్మయానందమునఁ జేర చన్మయంబు
ముక్తిమూలం బిదే జనమ్ములకు వేమ! 1517

ఆ చంద్రునీడ నునిచి చక్కఁగా రవిమీఁద
నుండఁ జూచి కొఱత నుండఁజేసి
వెన్నెలఁ గదియుటే వెలయంగ ముక్తిరా,వి...

క. చిత్తరువు ప్రతిమ కైవడి
చిత్తమును గల్ప మడచి చిరతరబుద్ధిన్
జిత్తునఁ దెలిసినవాఁడే
యెత్తినసుజ్ఞాని యందు రిహమున వేమా! 1519

క చిత్తము మనమును బుద్ధియు
హత్తు నహంకారగుణము నాత్మకు లోఁగా

మొత్తముఁ జేయఁగ నేరని
నుత్తులకును ముక్తి లేదు మహిలో వేమా!

తే. చోరులకు చిక్కిపోయినతీరె యగుట
నోట గుణియించు మంత్రము నీట గలియు
మాటలందును పరమాత్మ మరగి రాఁడు
చిత్తమున స్వస్థతయు లేమిఁ జెడుగు వేమ!

క. చన్నగవరీతి సంపద
కొన్నాళ్లకు వ్రేగుఁజూపి గొబ్బున వ్రాలున్
వెన్నెల చీఁకటి సరియగు
సన్నా శివలింగమాయ లన్నియు వేమా! 1522

తే. చూపు చెదరని వృత్తిలో చూడ్కినంటి
యేపుమీఱిన మదినందు రూపుమాపి
తన్నుఁ దాఁ గాంచుచుండును తత్త్వవేత్త
నిర్వికారుండు నా భువి నెగడు వేమ! 1523

ఆ. చావు వచ్చినపుడు సన్న్యసించున దెల్ల
కడకు మొదటికులము చెడుట కాదె
పాప మొప్పు వేఱె ఫలముండఁబోదయా, వి.

ఆ. చూపులోనిచూపు సుజ్ఞానదాయిని
మనసులోనిమనసు మాయఁ దవులు
ఎఱుకలోనియెఱుక నెఱుఁగుమురా మూర్ఖ! వి.

ఆ. చూపులోనిచూపు జూడ నేర్చినవాఁడు
చూపులోననుండి చూచువాఁడు

చూడచూడఁ దన్ను జూచును నిక్కము, వి...

ఆ. జంగమాఖ్యభక్తి సంధి వేఱుగ లేదు
సగుణభావ మిదియ శాస్త్రవిధియు
నిర్గుణంబు పీడు నెరవేది యోగము, వి...1527

తే. జన్మమరణావ్యవస్థఁ జాడ మీఱి
మన్మయం బగుపరిపూర్తి మఱుగుఁ జేరి
తన్మయాకృతి నొందుటే తత్త్వవంబు
నిర్వికారుని కిది కల్లు నుర్వి వేమ! 1528

క. జపములు చేసినఁ జిక్కదు
విపినములందున్నఁగాని విడుచునె భ్రమలా
జపమంత్రమూలసిద్ధికి
నెప మెన్నని మోక్షపదవి నిలుచుర వేమా! 1529

ఆ. జయము భయము దాఁటి చలపట్టి యుండును
దయకు పాత్రుఁ డగును ధర్మపరుఁడు
నయముగాను గురుని నమ్మి నెమ్మది వేఁడు, వి.

ఆ. జిహ్వ రసమువల్ల జీవంబు పోషించు
బ్రహ్మ మన్న రసముఁ బడయ లేదు
రసము ద్రాగనట్టి రాజులు సావరే? వి... 1531

ఆ. జీవగుణము గలుగుజీవంబు బ్రహ్మంబు
సాటివచ్చు నెట్లు సరవిఁ దెలియ
నూరికుక్క సింగ మొక్కటి యగునొక్కొ, వి.

ఆ. జీవనము దెలిసినఁ జెలఁగి మదిఁ జలించు
దైవ మగపడినను దగులు బుద్ధి
దీప్తభానుని గని తిమిరంబు నిలుచునా? వి...

క. జీవము శాశ్వతరూపము
భావముననను నిలిచి లోనె పరుఁడై యుండున్
గేవలనిర్గుణ మదె యగుఁ
గావరమును కడకుఁ ద్రోసి కనవలె వేమా! 1534

ఆ. జీవుఁ డనఁగ మీరు చిక్కులు పడ నేల
వాయు వాకసంబు వహ్నిఁ గూడి
దేహి యనఁగ నొప్పె దేహంబులం దొప్పి, వి.

ఆ. జీవుఁడె యగసాలి క్షితిలోనఁ దెలియంగ
భావ మైన తానె పరమశివుఁడు
వాయు వనెడియతఁడె వసుధ బ్రహ్మము కాదె, వి.

ఆ. జ్ఞానముద్ర చేత గనఁగ వచ్చెడి తళ్కు
కది యె మదికి శ్రేష్ఠమనుచు మునులు
పలికి రది యె తెలియఁ బరమార్థ మగునయా, వి.

తే. జ్ఞానసుజ్ఞానగతు లొప్పుజాడ లెఱుఁగ
నగును దైవజ్ఞు లగువార లరసిరేనిఁ
బాలు నీరును భేదింపఁ బరఁగు హంస
లట్టిసామర్థ్య మొప్పువా రవని వేమ! 1538

ఆ. టక్కు మెత్తి చెప్పు మొక్కఁడే దేవుఁడు
నిక్కముగను లోన నిలచియుండు

జక్కఁ జూచునతని సంతోషమున ముంచు, వి.

తే. తత్పదము నెన్న ప్రత్యగాత్మమ్ము సుమ్మి
త్వంపదం బన బ్రహ్మరూపమ్మె కదర
అసి పదమ్మున లక్ష్యమ్ము నైక్యము గన
సోహమేర్పడుఁ దెలియంగఁ జూడు వేమ! 1540

ఆ. తథ్యమైనపూర్ణతత్త్వము నీలోన
మిథ్య నరయగానె మిత్రమగును
సత్యనిత్యకర్మసాక్షి బ్రహ్మంబురా, వి... 1541

ఆ. తనదురూప మెల్ల తనలోనఁ జూచియు
మనసు దీపముగను మమత విడచి
యనుదినమును గాంచు నతఁడె సో బ్రహ్మము,వి.

క. తనగుణము తనకు నుండఁగ
నెనయంగా నొరుని గుణము నెంచును మదిలో
దనగుణము దెలియ కన్యుని
పనిగొని దూషించువాఁడు వ్యర్థుఁడు వేమా!

ఆ. తనదురూప మెల్లఁ దనలోనఁ జూచియు
మనసుదీపముగను మమత విడిచి
యనుదినమును గాంచు నతఁడెపో బ్రహ్మంబు,వి.

ఆ. తన్నుఁ దా దెలిసిన దానె సో బ్రహ్మంబు
తనువులోనిముక్తిఁ దగిలియుండు
తన్నెఱుఁగనివాఁడు తా నెట్టిబ్రహ్మంబు? వి...

ఆ. తన్ను వెదకి చూడఁ దానె యా జీవుండు
తత్త్వ మరయ నగును దానె యాత్మ
మన్ను మిన్ను లేదు మాయయు లేదయా, వి.

ఆ. తపము లేల యరయ ధాత్రిజనుల కెల్ల
నొనర శివుని జూడ నుపమ గలదు
మనసు చెదరనీక మహిలోనఁ జూడరా, వి...

తే. తపము మించినధ్యానంబు తత్పదమగు
విమలసుజ్ఞాన మనుప్రజ్ఞ విడిది గనుచు
నిర్ణయంబును గనుచుండు నేర్పుతోడ, వి.1548

ఆ. తఱచు తనువుఁ బాసి తఱితోఁ దను మఱచి
తాను నే ననఁ దగు తలఁపు మఱచి
యుండునాతఁడు గద యుత్తమయోగియా, వి.

తే. తలఁపుమఱపులు లేనందు దాఁకినపుడె
తాను బ్రహ్మంబులోఁ జేరి తలఁగకుండు
తత్పదంబును మరగిన తానె బ్రహ్మ
జ్ఞాన సిద్ధి యెఱింగిన ఘనత వేమ! 1550

ఆ. తల్లి యొకతె భువిని దండ్రియు నొక్కఁడు
నెల్లలోకములను నెంచిచూడ
గల్లగాదు గౌరి కఱకంఠు లే సుమీ,వి...1551

ఆ. తాను జన్మమెత్తి దానధర్మము లీయఁ
గర్మగతిని యముఁడు కష్టపఱచు
కర్మధర్మములను గడతోయు బ్రహ్మము, వి...

క. తా ననెడియహంకారము
మానక తను దానె చెలుచు మైమఱపించుకా
నేనని పలికెడివారికి
మానునె దుష్కర్మఫలము మహిలో వేమా!

క. తా నవుట దెలిసి మది నొక
తానును లేకుండు నెల్ల వను దానె యనం
దా నెఱిఁగి పరిణమించిన
మానవులకు ముక్తి గలదు మహిలో వేమా!

క. తానును నేనని వేఱుగ
మానసమునఁ బలుఁచునట్టి మానవుఁ డెటులుం
గానఁగ నేరఁడు తత్త్వము
మానులతోఁ దిరిగి నైన మహిలో వేమా!

క. తానును నేర్పరియైనను
దానకములఁ దన్ను దానె తప్పించికొనం
దా నెన్నివిధములను మఱి
తానే పరమాత్మ యనుచుఁ దలఁపర వేమా!

ఆ. తాను పుట్టుచోటఁ దాఁ జూచి పల్కినఁ
దాను దిరుగుబుద్ధి ధరణిలోనఁ
దాను బుట్టుచోటు తత్త్వంబు తలఁపోయ, వి.

తే. తావుఁబంటు బుద్ధిని దగులఁ బెట్టి
నియమనిష్ఠలు మదియందు నిగుడఁ జేసి

కావపవర్గము జయమంద గలుగు ముక్తి
ఆమహాత్ముని సేవింప నగుర వేమ! 1558

ఆ. తిరిగి తిరిగి నరుఁడు మరులుకొనుటె గాక
యందువలన నేమి యాస గలుగు?
నంతరాత్మ నిలుపునతఁడె పో బ్రహ్మంబు, వి...

ఆ. తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక
యూఱకున్నఁ జూడ నుర్విమీఁద
వాఁడగుపరమాత్మ వర్ణింప శక్యమా? వి...

ఆ. తిరిగి తిరిగి నరుఁడు ద్రిమ్మరి కాఁగానె
యందునల్ల నేమి యధికమొప్పు
నంతరంగ మెఱిఁగినప్పుడే శివుఁడౌను, వి...1561

ఆ. తెరువు ముక్కు చాయఁ దేఁగలిగినమీఁద
నందు గనఁబడునదె యరయలేరె
అరసిచూడ బయలె యల్లదె ముక్తిరా, వి...

ఆ. తెలుపువాఁ డెవండు తెలియువాఁ డెవ్వఁడు
గుట్టెఱుంగునంత బట్టబయలు
సొరిది భాండమందు సూర్యునిచందంబు, వి...

ఆ. తేకునమర బుద్ధి తెల్లముగా నిల్పి
తాక నది ప్రణవపుధ్యానమగును
సోకి మించువాఁడె సురలోకమును బొందు, వి.

ఆ. దాన మమరఁ జేయ దరిఁ జేర్చు నయ్యది
మనమె నమ్మె నేని మాయముంచు

జ్ఞానకలిక నమ్మఁ జంపురా వైరుల, వి... 1565

క. దృక్కునకు దృశ్యమునకును
మక్కువతో భేద మెంచ మఱిలేదుసుమీ
దృక్కునకు దృక్కు బ్రహ్మమె
నిక్కము నీయందు నిండి నెగడును వేమా!

ఆ. దూలములను బోలుదురవస్థ లవి యెల్ల
రోసి యాస లన్ని కోసివైచి
వాసనఁ ద్యజించు వాఁడెపో బ్రహ్మంబు, వి...

క. దేహియు జ్ఞానానలమున
దాహంబై దేహ మెల్లఁ దల్లడపడఁగా
దేహములోఁ బొర్లాడుచు
మోహము విడ శివుని జూడు ముక్తికి వేమా!

ఆ. దైవఘటన లేక దైవసుజ్ఞానం బ
దేల వచ్చు రెంటి కెఱుకపడక
యెఱుక నెఱుఁగువాని కెఱుకలోఁ గనిపించు,వి.

ఆ. దొడ్డవాండ్ర ననుచు త్రోవ డొంకలు గొట్టి
యడ్డ మైనజనుల నంటగట్టి
దోఁచుకొన్న నట్టి దోష మెక్కడఁ బోవు? వి.

క. ధూమాదులు నావృతమై
వ్యోమంబున కెగసి కలియు నుపమను దనలో
శ్రీమించు శివుని జేరును
కామాదుల గెలియఁ డతఁడు ఘనముగ వేమా!

ఆ. ధరను దేవళముల తగులు వీడిననాఁడు
తనువు గుడిగఁజేసి తన్ను నిలిపి
లోకబుద్ధి విడిచి లోచూపుఁ జూడరా, వి...

క నాదము బ్రహ్మం బనుచును
వేదములను జదువవచ్చు విని కనినంతన్
నాదంబు లేనిబయలున
నాదాంతమె పూర్ణపదవి నయముగ వేమా!

క. నాదము ముక్తికి తెరువగు
బాదును తెలియంగ నగును పరిపక్వముతో
భేదంబు మాని మదిలో
వేదికపైఁ జేరి వినుము వినువక వేమా! 1574

క. నిండినమతమున వెదకిన
నుండెడి కేవస్తువైన నుపము దలిర్పన్
దండిగ నిండినపిమ్మట
ఖండించిన వెఱ్ఱిగాదు గదరా వేమా! 1575

ఆ. నిన్నుఁ జూచెనేని తన్ను దా మఱచును
దన్నుఁ జూచెనేని నిన్ను మఱచు
నేవిధమున మనుజుఁ డెఱుఁగు నిన్నును దన్ను, వి.

తే. నిమిషమైనను మది నిల్పి నిర్మలముగ
లింగజీవేశులను గాంచి భంగపడక
పూజ మదియందుఁ జేయుట పూర్ణపదవి, వి...
పరముగోరిన నిదిచేయ బాగు వేమ! 1577

ఆ. నియతవృత్తి మీఱి నిటల దుర్గముఁ జేరి
భయము లేకయుండు బ్రహ్మవేత్త
జయము గల్గ ముక్తిఁ జని చూచుచుండురా, వి.

క. నిరతం బెడ తెగకుండఁగ
పరిపూర్ణబ్రహ్మ మాత్మపదమున నుండఁగ
నిరవద్య మైననడవిని
జరియించును జగ మెఱుంగ సత్యము వేమా!

ఆ. నిహతిపుట్టుపులకు నెల విహ మందురు
కుహరలోకమందు గుఱుక మేది?
దహరమందుఁ జూడఁ దగులును దత్త్వంబు, వి.

తే. నిర్గుణాంశము మది నెన్ని నేర్పు మీఱ
స్వర్గ మని యెంచుచుండిన శాశ్వతంబు
భర్గుఁడై తాను బాముల పాపునయ్య
దుర్గుణభ్రమలను బాయు దొసగు వేమ! 1581

తే. నిష్ఠయందును దృఢమైనదృష్టిఁ బూని
కష్టయోగంబులను మించి కాంక్షదీఱ
వ్యష్టిపరిపూర్ణ మందుట వదలకున్న
స్పష్టముఖ్యుడౌను సంతోషసరణి వేమ! 1582

క. నీరనుఁ బుట్టిన దుప్పగు
క్షారము నీరాయె నీరు క్షారము నొకటే
యీరీతి శివుని జీవుని
వారక మది నెఱుఁగ నగును వసుధను వేమా!

క. నీవాడిన నేనాఁడుదు
నీ వుండిన నేను నుందు నిర్విణ్ణుఁడనై
నీవు దలంచినఁ దలఁతుదు
నీవు నగిన నేను నగుదు నిజముగ వేమా! 1584

తే. నీవు నెఱిఁగను లోకంబు నీకుఁ దోఁచు
నీవు మఱిగినతోడ్తోడ నెందుఁ బోయె
ననెడి యెఱుకను విడనాడఁ డయ్యయోగి
దానఁ బరమార్థ మెఱుఁగంగ నౌను వేమ!

క. నేఁ జచ్చినతోడనె మఱి
దాఁ జచ్చును నపుడె పంచతత్త్వము లోకటౌ
రాజత్స్వరూపమందును
దా జితుఁడై నిలచియుండు తథ్యము వేమా!

ఆ. పంచభూతములను బరగియుండినవాఁడు
పంచలింగములను బ్రబలియుండు
పంచబీజమునను భావింపఁ దానయా, వి ....

ఆ. పంచభూతములను బరగ నింద్రియముల
సంచరించినపుడు జగము కలుగు
సంచరింపకున్న జగమెట్టు కలుగురా? వి... 1588

ఆ. పటిమమీఱ మనసుఁ బాటించి చూడక
కిటుకుఁ దెలియరాదు కెరలుటకును
జటిలవేష మేల జైత్రుఁడై సాధింప, వి....1589

క. పంతము విడకయె నెమ్మది
చింతనమున గుర్తుఁ దెలసి చిన్మయమందన్
వింత లడంగును మానస
మింతింతని చెప్పరాని దెలుఁగుము వేమా!

ఆ. పనితొడవులు వేలు బంగార మొక్కటి
పలుఘటములు వేలు ప్రాణ మొకటి
యరయ దిండ్లు వేల టాకలి యొక్కటి, వి....

ఆ పరగ బొందులు పది ప్రాణంబ దొక్కటి
పుష్పజాతులు పది పూజ యొకటి
పసులవన్నెలు పది పా లన్ని యొక్కటి,వి....

ఆ. పరధనంబునకును బారుగాఁ జేఁ జాచి
సత్య మింత లేనిచట్టుద్విజులు
ద్విజుల మనుచు నెంత్రు తేజ మింతయు లేక,వి.

ఆ. పరగ బొమ్మగుడ్డు పరికించి చూచిన
గులములన్ని యందె కూడి పుట్టె
నంచ యొకటఁ గలియ నన్నదమ్ములె కదా! వి....

క. పరులను నీ పని తలఁచెడి
పరబుద్ధిని మీర కీవు పదరక యున్నన్
స్థిరవేత్తృ తందు దోఁచెడు
పరిపూర్ణమె బట్టబయలు బాగుగ వేమా! 1595

ఆ. పలుగురాళ్లఁ దెచ్చి పరగ గుడులు గట్టి
చెలఁగి శిలలసేవఁ జేయ నేల?

శిలలసేవఁ జేయ ఫలమేమి గల్గురా! వి... 1596

ఆ. పాలు ద్రాగినపుడు ప్రాణంబు రక్షించుఁ
బాలు ద్రాగకున్న బడలి కౌను
పాలవలన ముక్తి ఫలమందఁగా లేక
చాల రోగపడును జగతి వేమ! 1597

ఆ. పాలు పెఱుఁగు వెన్న పరగు నన్నముఁ దిని
స్త్రీల గననివాఁడు శీలవంతు:
డొక్కఁడైనవాఁడె యుత్తమశివుఁడయా, వి.

ఆ. పిండ మండమందు బెనఁగుచునున్నట్టి
తండ్రిబిందునాదు దనరఁ గూడి
యండమై నిలిచిన యపుడు గర్భ మటందు
రవనిజనము లెప్పు డరయ వేమ! 1599

ఆ. అండ పిండము నడిబిందు వాత్మజ్యోతి
యర్కజ్యోతి సరసిజాండమందు
నాదబిందువులకు నడుమ నద్భుతజ్యోతి, వి...

ఆ. పిడుగుపడినతావు దడదడగా నుండు
పిడుగుపడినఁ గొంప నశికిఁ గూలు
పిడుగుపడినవానిప్రేత మేమనవచ్చు? వి 1601

ఆ. పిన్నవాండ్ర స్వేచ్ఛ మన్ననఁ జెఱచును
ఆఁడువాండ్ర స్వేచ్ఛ గోడొనర్చు
పురుషవరుని స్వేచ్ఛ భూతిని గూర్చుఁగా, వి...

క. సిరిగొనుహంసను మదిలోఁ
బిరబిర గుంభించి పట్టి చిత్తరవోకఁణ
స్థిరభావసిద్ధిఁ గైకొని
పరిపూర్ణసమాగమమును బడయును వేమా!

క. పిండము పృథివిని బడఁగా
నండనె తగుమంత్రసాని యది దెల్పుచు దా
మెండుగ సుగవాఁ డంచును
దండిగ నీజనము లెఱుఁగ ధరలో వేమా! 1604

ఆ. పిడుగును నలుచేత బిగఁబట్టి యందులో
గల్మషంబు లెల్లఁ గడకు తీసి
కడమకరముచేతఁ గలిజనములఁ బ్రోచు
కర్మకర్త నెఱుఁగఁ గదర వేమ! 1605

క. పిలిచినఁ బలుకును దేవుఁడు
పలుకుననే నిండియున్న ప్రభువై యుండుఁణ
వెలుఁగున వెలుగై మించెడు
వెలుఁగే పరమాత్మ బయలువిడ కది వేమా!

ఆ. పిసినివానియింట పీనుఁగు వెడలినఁ
గట్టెకోలలకును గాసు లిచ్చి
వెచ్చమాయె నంచు వెక్కివెక్కి మఁ తేడ్చు, వి.

ఆ. పుక్కిటిసతివానిఁ బూజింప దోషంబు
యురముసుదతివాని యూహ లెస్స
నెత్తియువిదవాని బత్తియే పర మిచ్చు, వి...

ఆ. పుట్టలోను తేనె పుట్టినరీతిని
గట్టుమీఁద మణియుఁ బుట్టునట్లు
కట్టెలోన నగ్ని పుట్టినవిధమునఁ
బుట్టి మెట్టవలెను భువిని వేమ! 1609

ఆ. పుట్టి చచ్చు నరుఁడు పూర్వమే మెఱుఁగక
బట్టబయలనుండి భ్రమసి యైనఁ
దెలివి విడిచి భూమి దిరుగంగ నేటికి? వి...1610

ఆ. పుట్టినదియు మొదలు పురుషుఁ డేర్పడుదాఁక
మంత్రసానిగూడు మరగి యంత
పోయి రావె యనుచు పుత్తురు సెలవిచ్చి, వి...

ఆ. పుట్టినపుడె బొడ్డు పట్టి కోయుచు నుండ
నప్పుడు గురుముద్ర లానతిపడె
ముద్రలేనివారు ముజ్జగంబుల లేరు, వి...1612

తే. పుట్టినప్పుడు తెచ్చెనే పుడమి విడచి
గిట్టునప్పుడు గొనుపోకో యట్టిధనము
నడుమ నీయాజ్ఞ వచ్చెఁ ద్రినయన యనుచు
నర్థికిని నీయఁడేమందు వ్యర్థ వేమ! 1613

ఆ. పుట్టువార లెవరు పుట్టకుండు రెవరు
పుట్టి గిట్టనట్టిపురుషు లెవరు
పుట్టి పుట్టనట్టు బోధించి చూడరా, వి... 1614

ఆ. పుట్టుశక్తు లైదు పుడమి నటింపంగ
విప్రులెల్ల వేదవేత్త లండ్రు

శ_క్తిపుత్రులము జగతి నెఱుంగరో, వి...1615

క. పుడమిని గలనడజీవులు
బడబాగ్నియు దీవులనను భానుని యెడలన్
జడమును గూడినయప్పుడె
వెడలని ప్రళయంబులకును విధమిది వేమా!

ఆ. పుడమిలోన నరులు పుత్త్రులఁ గనఁగోరి
యడలుచుందు రనుపమాశచేతఁ
గొడుకు కలిగినంతఁ గుల ముద్ధరించునా? వి...

ఆ. పుత్రసంతు లేక పుత్త్రుండు జగతిలోఁ
బుణ్యలోక మెట్లు పొందఁగలఁడు ?
పుత్రహీనునకును బుణ్యంబు గల దెట్లు? వి...

ఆ. పురుషచిహ్నఁ జూడ బుట్టె స్త్రీలకు భ్రమ
పురుషుఁ డేహ్యమనుచుఁ బుట్టరాదె
శిపుఁడు పురుషుఁడైన స్త్రీలకు జిక్కునా? వి...

క. పురములు నాటేటిపై నొక
పురమందున మూలశక్తి పూనిక గనుమా
యురమున గురి గనినంతట
పరిపూర్ణ పుబ్రహ్మరూపు బయలగు వేమా!1620

ఆ. పురహరునకు నేతపురుపు తా నేసిన
స్థిరము కలుగు జ్ఞానజీవమయ్యో
నేత కేమి వచ్చె నిజభక్తిహేతువు?, వి...1621

ఆ. పుసు గుంబిల్లి యేల పుట్టించువాసన
ల్దాసిన హీను లేమి ధరణిలోన
బ్రహ్మచేతలెల్ల పాడైనచేంతలు, వి.... 1622

ఆ. పురుషభాగ్యమునసె పుణ్యపతిదొరకుం
బుణ్య తికినట్టి పుట్టు సుఖము
నిరుపు రనుభవింప హితులును మిత్రులు
అష్టభోగములును నమరు వేమ!

ఆ. పూజ సేయం జేయం బూజారి తానాయె
పూజ్యవస్తు వెన్న భువిని దానె
ఏడం బూజ సేయ నెల్లదిక్కులు తానె
తాను నేను నేను దానె వేమ!

తే. పూని సుఖదుఃఖముల మీాంటి లోనం జేరి
తాను తానగుతత్వంబుం దాంకి తాంకి
పోరి పరిపూర్తి నొందుట పుణ్య మయ్య
ఇట్లు కాకున్న కడతేరు టెట్లువేమ! 1625

క. పూర్ణమగుయుక్తి యోగికిం
బూర్ణము సాధనము సపరిపూర్ణము సంసా
రార్ణవతారకగోచర
పూర్ణము పరిపూర్తిం జెందం బూనుము వేమా!

ఆ. పెక్కుచదువు లేలం జిక్కువాదము లేల
నొక్కమనసుతోడ నూరకున్న
సర్వసిద్ధిం డగును సర్వంబుం దానగు, వి...

ఆ. పెట్టువార లెవరు పెట్టకుం డ్రెవ్వరు
పెట్టి పెట్టనట్టి దిట్ట లెవరు
పట్టుఁ దప్పకుండ భావించి చూడరా, వి

ఆ. పెట్టి పోయువాఁడు కట్టడిగలదాత
తిట్టి పోయువాఁడు తుట్టెపురువు
రట్టు సేయువాఁడు రాణింపునకు రాఁడు, వి...

ఆ. పెరటఁ జెట్టు బెట్టి పరికింపకుండిన
వెలుగుదాఁటి తీఁగ వెడలబాఱు
నాఁడుదాని గుణము నటువలె నుండురా, వి...

ఆ. పొట్టివాఁడు కీడు పొడలపుఱుగు కీడు
పట్టియాశ కీడు వరదు కీడు
పొట్టిచేయి కాలు పొసఁగుట కీడురా, వి...

క. పొందము హృది గురిదగు నా
నందము సదసద్వివేకనాదము పైగా
నిందించు భ్రమల నెల్లను
సందియసబయలు చేరు సాటిగ వేమా! 1632

ఆ. ప్రణవమంత్రమహిమ భావింప లింగంబె
మూఁడుమూర్తులందు మొనసియుండు
మాన్యు లెఱిఁగి కొలువ మనుజుల శక్యమా, వి.

క. ప్రత్యక్షము రవిచంద్రులు
ప్రత్యక్షము వాయు వగ్ని పానీయంబుల్

ప్రత్యక్షము భూదేవత
ప్రత్యక్షము విశ్వ మెల్లఁ బరగెడి వేమా! 1634

ఆ. ప్రణవ మెఱుఁగ నతఁడు భక్తుండు తాఁగాఁడు
జ్యోతి జూడ నతఁడు జోగి గాఁడు
నిత్య మెఱుఁగ నతఁడు నిర్వాణి కాఁడయా, వి.

క. ప్రత్యక్ష మగుము శివ యని
నిత్యము మదిలోనఁ దలఁచి నిలచినయపుడే
సత్యముగ జ్యోతి కనఁబడు
నిత్యములో తృప్తిఁ జెంది నెరయుము వేమా!

క. ప్రథమమున మాతృదేవత
పదపడి జనకుం డటగును బరికింప నిఁకన్
గుదిరినసదమలగురుఁడే
తుదిదైవము వెరలు వేరు తోరము వేమా!

ఆ. ప్రభుల కిచ్చునట్లు రహి పేదలకు నీరు
వనిత కిచ్చునట్లు వటుల కీరు
సురకు నిచ్చునట్లు సుధకును నీయరు, వి...

ఆ. ప్రవరయున్న పేరు పరిఢవిల్లిన నేమి
దానియందు నేపు తగ్గె మీకు
నిజము దెలియ మీరు నిత్యము పూజ్యులై, వి.

ఆ. ప్రాకటముగ నింత లోకమందున గుంటి
పల్లెముత్తఁ డెన్న పరమగుణుఁడు
అన్నదానమునను హరిపూజచేతను

హరునిలోనఁ గలిమి కతఁడె వేమ! 1640

ఆ. ప్రాణబంధములను బంటకా పెఱుఁగునా
యెఱుకగలుగు జ్ఞాని యెఱుఁగుఁ గాక
ముద్రలందు లేదు మూలమందే కాక, వి...

ఆ. ప్రాణమగును గాలి బ్రహ్మాండ మగుమేను
మిత్రచంద్రశిఖులు నేత్రచయము
మఱియు దేవుఁ డింకనుమహిమీఁద నెవరయా?వి

ఆ. ప్రాణ మిలను లేక పరమందఁగా రాదు
ప్రాణముండఁగానె పరము కలదు
ప్రాణి పరము గనుటె భావింప నేరరే, వి...

ఆ. ప్రాణరక్షణ కిల పరమశివునిమీఁద
ధ్యాన మమర లేమి దగిలి నరుఁడు
పుట్టు చచ్చుచుండు పుడమిలోపలఁబుట్టు
చెదలుగానువాఁడు చెడును వేమ! 1644

ఆ. ప్రాణిచేరనాఁడు పరగ దేహమునకు
హాని లేక యుండు నరయ నంట
ప్రాణి పోయినపుడు పనికిరా దీదేహ
మనుచుఁ బలుకుదు రిల జనులు వేమ! 1645

ఆ. పృథివివారి కెల్లఁ బెట్టును నొకగిన్నె
పొత్తు గుడిచి కులము పొలియఁ జేయ
తలను చేయి వెట్టి తగ నమ్మఁ జెప్పును
వారకాంత నమ్మవలదు వేమ! 1646

ఆ. ప్రొద్దు పొడుచుచోటుఁ బ్రొద్దునిలుచుచోటుఁ
బ్రొద్దుగ్రుంకుచోటుఁ బొసఁగఁ జూచి
ప్రొద్దెఱిఁగినవాఁడు పొలుపైనయోగిరా, వి.

ఆ. ప్రియము లేనివిందు పిండివంటల చేటు
భక్తి లేనిపూజ పత్రి చేటు
ఓజమాలు నాలదోలిమాడల చేటు, వి...1648

ఆ. ప్రొద్దుపొడుచు టెఱిఁగి ప్రొద్దునడ యెఱింగి
ప్రొద్దుగ్రుంకునట్టిపోలి కెఱిఁగి
ప్రొద్దుదెలియునతఁడె పొలుపొంద బ్రహ్మంబు,వి.

ఆ. ఫణితి దెలిసి మాఱు పల్కుటె యుక్తము
గణన కెక్కునట్టి ఘనుఁడె యెపుడు
గుణము లేకయున్న గుదురునే యూహలు, వి.

ఆ. ఫలక మెడమచేతఁ బట్టి ఖడ్గంబూన
బంటుతనము రాదు ప్రతిభ లేమి
వీథిలోను దిరుగ వెలఁది పురుషుఁ డౌనె, వి....

ఆ. ఫలము లేనికార్యములు సేయ నొల్లరు
కలజనంబు లెల్ల నిల నిజంబు
ఫలము మంచిదైన బరమందు ముదమందు, వి.

ఆ. ఫాలనేత్రుఁడైన భావింపలేఁడయా
ఆలి మీఱఁ బెట్టి యాదివరవ
గోలయనుచు నమ్మకూడదు వెఱ్ఱియై, వి...

ఆ. బంగి త్రాగి తిరిగి బకము చాడ్పున నుండ

సంగ్రహింపరాధు చంద్రకళలు
బ్రుంగు మదిని లోగి మిన్నంది యుండరా, వి.

ఆ. బట్టత్రాళ్లతోను బంధించి గట్టఁగా
లింగ మెవరిసొమ్ము దొంగిలింప
నాత్మలోనిలింగ మటువలె యుండునే, వి...

ఆ. బంగి త్రాగువాఁడు భావము నందఁడు
సింగి కెగయుకైపు నిల్వలేఁడు
లింగ మమర బంగి లీలను జెందునా!వి....1656

క. బట్టబయలందు శ్వాసము
ముట్టుచు నెగరోజ ట్టి మూలమునందే
నెట్టుచు విడుచుచు నుండిన
గుట్టుపరబ్రహ్మమంచు గూడుము వేమా! 1657

తే. బట్టబయలైన [illegible] చే బ్రహ్మ మనఁగ
నిట్టనిలుచున్న [illegible] నగడవలెను
దట్టిగట్టిన జయమున్నె జెట్టినలెను
గుట్టులో గుట్టు పరమంబు గూడు వేమ! 1658

క. బట్టబయలైనబ్రహ్మము
గుట్టును మది నెంచి లోన గుణము పడినచో
దిట్టముగ జగము గిట్టును
దిట్టరివై యెఱుక మఱచి తిరుగుము వేమా!

ఆ. పటువుగాను బుద్ధి పరికించి నొక్కుచు
కుటిలగుణములన్ని కూల ద్రొక్కి

పటుతరంబుగాను బలపడఁ జూడరా, వి...

ఆ. బండదానికేల బంగరుమొలత్రాడు
విధవరాలికేల వెండిగొలుసు
ముచ్చుముండకేల ముంజేతికడియాలు? వి...

తే. బంధముక్తుల రెంటిని పదిలముగను
కోరరాకయ మదియందుఁ గోర్కెలడఁచి
చేయుపనులెల్ల బయటను జెనకి యించు
వలయునది కూడు నీకె యావలను వేమ! 1662

ఆ. బంధుకోటిఁ బాసి బయలును దెలియక
సింధుపుత్రిమాయఁ జిక్కెకాదె
శార్ఙ్గియంతవాఁడె జనులకు శక్యమా? వి...

ఆ. బన్నపడగ గుఱిని పట్టులో పట్టుగా
చిన్నబలముఁ జేర్చి చింతవిడిచి
యున్నవాఁడె ముక్తి గన్నవాఁడగు సుమ్మి, వి...

క. బయలందె పుట్టు సర్వము
బయలందే లీనమగును బ్రహ్మాండంబుల్
బయలని మదిలోఁ దెలసిన
బయలందే ముక్తి బట్టబయలగు వేమా! 1665

క. బయలున పుట్టినబంధము
బయలందే లీనమగును బరమాత్మునకున్
బయలున పుట్టెడిసంపద
బయలుగ కలుపంగ ముక్తిబయలగు వేమా!

ఆ॥ బయలు బయలుగాను పరికింపఁ జాలక
బయలులోనివారు బయటపడిరి
బయలులోనిచాలు పరికింప తత్త్వమా, వి...

ఆ. బయల నిల్లు గట్టి పరికింప సేరక
భ్రమసి తిరుగువాఁడె పామరుండు
బయలుపడిన తానె బ్రహ్మమై పోవును, వి...

క. బయలనుచు బయలుపొడఁగన
బయలునఁ దనమనసు నిలిచి బాగుగఁ దనరున్
బయలని తలఁచెడిభ్రాంతియె
బయలై తనుదానె కాంచు బ్రహ్మము వేమా!

క. బయలున బంధము పుట్టును
బయలున పరమాత్మునకును బంధము కలుగున్
బయలున గంధము గదిసెను
బయలున బయ లయ్యెడిదియె పరమగు వేమా!

ఆ. బయలు బయలుగాను బలపడినప్పుడే
తెగువతోడ నైక్య మగును మదిని
జ్ఞప్తియందు నెఱుక గనుటయే లేదయా, వి...

ఆ. బయలు బ్రహ్మ మనుచుఁ బరికించుచుందురు
బయ లదేల దాను బ్రహ్మ మగును
బ్రహ్మమైనబయలు పరికింప తత్త్వమె, వి...

ఆ. బయలురూపు తనకు బయలుగాఁ జేసి యా
బయలురూపు నంటి భ్రమయకుండి

బయలులోనిబయలు భావింప పరమాత్మ, వి.

ఆ. బయలురూపురూపు బయలుగా చేసియు
కంటిరూపుబయటఁ గదియఁజేసి
బయలుకానిబయలు పరికింప తత్త్వము, వి...

ఆ. బయలు రూపు లేనిభావంబులో నెంచి
బయలురూపుబట్టి బయలుచేసి
బ్రహ్మముబయలనుచు భావింప తత్త్వము,వి....

ఆ. బయలులోన పెనఁగి బయలులో మునిఁగియు
బయలు దెలియలేఁడె బంధకుండు
బయలు బ్రహ్మ మనుచు భావించి చూడరా,వి.

ఆ. బయలులోనిబయలు పరికించి చూడక
బయలు రూపుఁ జూచి వలచు నార
ముఱికిదేహమందు మోహంబు విడఁడయా, వి.

క. బయలే చూడఁగ సర్వము
బయలున లీనములు చూడ బ్రహ్మాండంబుల్
బయలని తోఁచెడి మదిలో
బయలందిన ముక్తి బట్టబయలగు వేమా! 1678

క. బయ లయినది యెంతెంతయొ
బయలున బ్రహ్మాండమునకు పట్టది యెంతో
రయమున రవి తా నెంతో
భయపడుదురు దానిఁ జూడ బయలని వేమా!

ఆ. బత్తె లట్టు లరవ ఫలమేమి కలదురా
అందు సార్థకంబు జె.దకున్న
విన్న వారు వారి వెట్టులుగా నెంత్రు, వి...

ఆ. బలముకొనఁగ గాలి బట్టి రేచించుచు
గలియఁ బూరకంబు గడలుకొనఁగ
విలయకుంభకంపువిధ మంది చూడరా, వి...

ఆ. బలము చూపుటేల బలవంతముగ రాదు
కులము జూచి మెచ్చ గుదురఁ బోదు
తలముఁ ద్రొక్కి యట్లు తలకొని విడరాదు, వి..

క. బహువిధవస్తువులందును
మహి గలిగెడి యెల్లజాతి మనుజులయందుఁ
రహిమించు బ్రహ్మవని మది
గ్రహియింపుము బాహ్యశబ్దకథితము వేమా!

ఆ. బాగుగాను ముక్తిఁ బడయంగ ముందుగా
యోగిగాఁగ గురుని కేఁగి మ్రొక్కి
వేగ బుద్ధినొక్కి విలయమొందుట తగు, వి....

ఆ. బాట తెలియకున్న బహుదూరమై తోఁచు
చోటు తెలియకున్న చూపానరదు
కోటకొమ్మమీఁద గుదురుగఁ జూడరా, వి...

ఆ. బాతెఁడేసి జడలు భస్మాంగలేపనల్
మహనముదముతోడ మాటుమలయ
కోక లుడిగి యంగరేనులుబలిసెరా, వి... 1686

తే. బాలప్రాయంబునను ము_క్తి బడయరాదు
వయసునందును కామంబు వదలఁబోదు
ముదిమియందును చింతలో ము_క్తిలేదు
చచ్చి సాధింప నగునేమొ జగతి వేమ. 1687

ఆ. బాలప్రాయమందె భ్రమల నడంపక
మేలుపొంద రెపుడు మేదినందు
కీలు దెలిసి మదిని కీడ్పడకుండుము, వి.... 1688

ఆ. బాల్యమందు స్వామిభ_క్తి లేకుండును
యౌవనమున హరుని లేనఁ గనరు
వార్ధకంబునందు వర్ణింప లేరిఁక, వి... 1689

క. బాలుఁడవై యున్నప్పుడు
చాలవు యౌవనమునందు సంపదరూపుల్
మేళనమౌ ముదిమియె యే
వేళను గన లేర్పశివుని వెదకుర వేమా! 1690

ఆ. బిందునాదు నాదుబిందునుగాఁ జేసి
నాది బిందులాది నాదుఁ జేసి
బిందులోనినాదు భేదించిచూడరా, వి.... 1691

ఆ. బిందుర_క్తములను బెరసిన దేహము
చంద మెఱుఁగక ద్విజశబ్ద మిడుచు
నడచినట్టి విడుచుర నరకంబు మృత్యువు, వి...

ఆ. బిందు వనఁగ మాయ బీజంబు శివుఁడయా
అందు కనక మయ్యె నప్పులయ్యె

ఆ సంధి వెలయ జగము సర్వంబు తా నాయె, వి.
బిందువందు పుట్టె పెంపైననాదము
నాదమందు పుట్టె నాదిశివుఁడు
శివునిమధ్యమందుఁ జెలఁగును సూక్ష్మంబు, వి...

ఆ. బిందుసేవకుండు బీజమై యుండును
సాధుసేవకుండు సర్వహితుఁడు
తీర్థసేవకుండు తిరుగుచుండెడి గదా! వి...

ఆ. బొంది వేలు కాని భువి ప్రాణ మొక్కటి
అన్నము లిల వేలు ఆఁక లొకటి
పుష్పము లిటు వేలుపూజ యొక్కటిసుమ్ము,వి

ఆ. బ్రహ్మ గుజ్జుమయ్యె భవుఁడు పల్లంబయ్యె
నాదివిష్ణు వెన్న వంకమాయె
సందుమీఁద నుండు నాఁడుదో మగవాఁడో, వి..

ఆ. బ్రహ్మ జంపి విష్ణుభాగంబున గలిపి
విష్ణుఁ జంపి శివుని పీటఁ గలిపి
శివుని జంపి తాను శివయోగి కావలె, వి...

తే. బ్రహ్మ తన్మయచింతన భవహరంబు
బ్రహ్మ మాత్మావలోకనప్రముదితంబు
బ్రహ్మమం దైక్య మగునాత్మ పరవశంబు
విమలమతి నెంచునపు డిదె విధము వేమ!

ఆ. బ్రహ్మబ్రహ్మ యన్న బ్రహ్మం బదెట్టిదో
పలసి తెలిసి చూడ దద్దనుండు

ముద్రలోన నుండు ముద్రిక గానరు, వి... 1700

ఆ. బ్రహ్మ మవల నున్న ప్రళయకాలంబైన
నదియు బ్రహ్మచేత నందవచ్చు
బ్రహ్మ మనఁరు జప్తి పట్టులో కట్టురా, వి...

ఆ. బ్రహ్మ నున్నచోటు పరగంగ తెలియక
ఎందొ వెదుక బ్రహ్మ మేల గలుగు
నంజనంబు లేక యానొమ్ము దొరకదు, వి...

ఆ. బ్రహ్మమును తెలియవు భావమం దుంచిన
తనువు గుడిగఁ జేసి తన్ను నిలిపి
లోకబుద్ధివిడచి లోఁజూపు చూడరా, వి...

తే. బ్రహ్మ మెఱుఁగనివా రెట్లు పారులైరొ
జిహ్వ రుచులకు దోఁపదో జీవులార
గహ్వరంబైనమదియందు కనుఁడి మీరు, వి...

ఆ. బ్రహ్మ మెఱుఁగు జ్ఞప్తి పదిలంబుగా నుంచి
తనువుమఱచి వేగఁ దన్ను దలఁచి
లోకబుద్ధి మఱచి లోఁజూపు చూడరా, వి...

ఆ. బ్రహ్మ యెవనికొడుకు పరికింపఁగా భువి
విష్ణు వెవనికొడుకు వెలయఁ జూడ
శివుఁ డెవరికి కొడుకు చిత్తమందుంచరు, వి...

ఆ. బ్రహ్మవంశభవులు ప్రబలులై యుండఁగా
నితరజాతులకును గతులు గలవె
వనములోనిక్రోఁతి వసుమతి నడపునా వి...1707

ఆ. బ్రహ్మవాదు లెల్ల బ్రహ్మం బనంగను
వలసి తెలిసిచూడ వ్యర్థనుండు
ముందునున్నయట్టి ముద్రికం గానరు, వి...

ఆ. బ్రహ్మవిష్ణుశివుల భాగంబులను విప్పి
పరమయోగియైన బ్రహ్మ మగును
బ్రహ్మమైనవాని భావింప శక్యమా, వి... 1709

ఆ. బ్రహ్మవేత్తల మని పౌరుష మాడేరు
బ్రహ్మమేమి దానిభావ మేమి
తెలుపా నలుపా యెఱుపా తెలిసినపలుకుండీ,వి

ఆ. బ్రహ్మసంతతి యన భక్తులై వెలసిరి
ఋషులజాతు లెన్నొ రీతు లయ్యె
శ్రోత్ర కెక్క వారి రోయకపిలుతురా? వి. 1711

తే. బ్రహ్మసుఖతత్త్వవిజ్ఞానపరముం గోరి
గురుకళాజాలనియతమాకోర్కి మిగిలి
యోగనిర్ముక్తరూపుండై యున్నయెడల
పరమశివుండని భాసిల్లు ధరణి వేమ! 1712

ఆ. బ్రహ్మవిష్ణువులకు పరగంగ రుద్రుండు
సిగయ మగుట నెఱింగి సృష్టిజనుల
రుద్రనిందం జేసి రూఢి తప్పుదురయా, వి...

ఆ. బ్రహ్మపరువు చెడును బ్రాహ్మణు లాదొడ్డ
బ్రహ్మవలనం బుట్టి పరగి రనంగ
బ్రహ్మవేత్త యగును బ్రాహ్మణుండే యైన వి...

ఆ. అంగమందు లింగ మమరంగ మర్దించి
జంగమందు బెట్టి యంగుపఱచి
రంగుగాను వసుధ గ్రుంగఁగఁజూడరా, వి...

క. అంచ ఘనాక్షరబిందువు
పంచాక్షరినాదమంత్ర పరమమునీంద్రుల్
ప్రాంచితముగ నది తెలిసిన
మంచాసన మెక్కువాఁడు మహిలో వేమా!

ఆ. అచరచరసమూహ మంగను లింగము
సరణి దెలిసి యట్టి శైవమేల
అష్టతనువు లమర హరుఁడౌట నెఱుఁగరా, వి.

ఆ. అందలమును మోయ యందలపై నుండి
పొంది వేశ్య మీఱు పూర్ణుఁడతఁడు
అతనిపూజఫలము నందఁగఁ జేయును, వి...

క. అనుచితపురుషుం డొక్కఁడు
విను నిత్యానిత్య మనెడి విధ మెట్టి దనం
దనసంకల్పమె బంధము
తనసంకల్పంబె క్షయము దనరఁగ వేమా! 1719

క. అనుభవకేళికి లోనగు
తనువులు మూఁడుడిగి లోనితథ్యము గని యా
జనానాంతర మమరంగను
కనుసదె బ్రహ్మంబు మదిని గట్టిగ వేమా! 1720

ఆ. అనువుమీఱు మదిని నానంద మందెడి
నరుఁడు పరుఁడు గాఁడె నయముగాను
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి.

తే. అన్యు లుండనిస్థలమందు నాత్మవిద్య
చిత్తతిమిరమ్ము నణఁగించి చెంగలించి
పండువెన్నెలకాంతిలో బ్రాఁకిచూడు
మప్పు డానందమును బొంద నగును వేమ! 1722

ఆ. అమల మవ్యయంబు నంతరాత్మకు లోన
విమలదృష్టిఁ జూని విడక మించి
తెమలకున్నవాఁడు తెరబయ ల్సేరును, వి...

క. అభవుని మదిలో గాంచెడు
శుభకరమగుచూడ్కి నంది సొంపలరంగా
నభిముఖదృష్టిని జూనుము
రభసము లేనట్టియెఱుక రాజిలు వేమా! 1724

ఆ. అయిదునై దునైదు నైదింటఁ జేకూడు
మూఁడు మూఁటఁ జేరి మరియు నొకటి
ముగిసిన సకలంబు మోహించి యుండురా, వి.

ఆ. అయిదువర్ణములను నానంద మెఱిఁగిన
నందె చూడ ముక్తి యలరు చుండు
అయిదులోనఁ దెలియుటదియెపో బ్రహ్మంబు, వి.

ఆ. అల్పసుఖము లెల్ల నాశించి మనుజుఁడు
బహుళదుఃఖములను బాధపడును

ఆ. అంగమందు లింగ మమరంగ వర్దించి
జంగమందు బెట్టి యంగుపఱచి
రంగుగాను వసుధ గ్రుంగఁగఁజూడరా, వి...

క. అంచ ఘనాక్షరబిందువు
పంచాక్షరినాదమంత్రు పరమమునీంద్రుల్
ప్రాంచితముగ నది తెలిసిన
మంచాసన మెక్కువాఁడు మహిలో వేమా!

ఆ. అచరచరసమూహ మంగము లింగము
సరణి దెలిసి యట్టి శైవమేల
అష్టతనువు లమర హరుఁడౌట నెఱుఁగరా, వి.

ఆ. అందలమును మోయ యందఱుపై నుండి
పొంది వేఁక మీఱు పూర్ణుఁడతఁడు
అతనిపూజఫలము నందఁగఁ జేయును, వి...

క. అనుచితపురుషుం డొక్కఁడు
విను నిత్యానిత్య మనెడి విధ మెట్టి దనం
దనసంకల్పమె బంధము
తనసంకల్పంబె క్షయము దనరఁగ వేమా! 1719

క. అనుభవకేళికి లోనగు
తనువులు మూఁడుడిగి లోనితథ్యము గని యా
జననాంతర మమరంగను
కనునదె బ్రహ్మంబు మదిని గట్టిగ వేమా! 1720

ఆ. అనువుమీఱు మదిని నానంద మందెడి
నరుఁడు పరుఁడు గాఁడె నయముగాను
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి.

తే. అన్యు లుండనిస్థలమందు నాత్మవిద్య
చిత్తతిమిరమ్ము నణఁగించి చెంగలించి
పండువెన్నెలకాంతిలో బ్రాఁకిచూడు
మప్పు డానందమును బొంద నగును వేమ! 1723

ఆ. అమల మవ్యయంబు నంతరాత్మకు లోన
విమలదృష్టిఁ జూని విడక మించి
తెమలకున్నవాఁడు తెరబయ ల్సేరును, వి...

క. అభవ్రుని మదిలో గాంచెడు
శుభకరమగుచూడ్కి నంది సొంపలరంగా
నభిముఖదృష్టిని జూనుము
రభసము లేనట్టియెఱుక రాజిలు వేమా! 1724

ఆ. అయిదునైదునైదు నైదింటఁ జేకూడు
మూఁడు మూఁటఁ జేరి మరియు నొకటి
ముగిసిన సకలంబు మోహించి యుండురా, వి.

ఆ. అయిదువర్ణములను నానంద మెఱిఁగిన
నందె చూడ ముక్తి యలరుచుండు
అయిదులోనఁ దెలియుటదియెపో బ్రహ్మంబు,వి.

ఆ. అల్పసుఖము లెల్ల నాశించి మనుజుఁడు
బహుళదుఃఖములను బాధపడును

పరసుఖంబు నొంది బ్రదుకఁగ నేరఁడు, వి...

ఆ. అక్షయమనుటంక మండంబుతోఁ గూర్చి
అమరగుణవికార మనుభవించి
అక్షయంబునంట నక్షయంబై యుండు, వి...

క. అక్షరపదవికి పదివే
లక్షరముల నఱవ నేల నల శివ యనురెం
డక్షరము లణఁచు దురితము
తక్షణమే పదవి గలుగు తథ్యము వేమా! 1729

క. అక్షరపుటడవిఁ జొరకయె
యక్షరమగుమహిమ గాన నవనిం దొలుతా
నక్షరమును జపియించిన
నక్షయముగ నదియె చాలు నరయుము వేమా!

ఆ. ఆకసంబు శూన్య మందు శబ్దము పుట్టె
శబ్ద మధ్యమునను సరగఁ జూడ
శబ్దరహిత మగుచు చెలఁగును బ్రహ్మంబు,వి....

ఆ. ఆత్మ తేజమూని యనువుగా శోధించి
తేజ మాత్మయందు తేటపఱచి
మింటిమంటి నడుమ మిన్నంది చూడరా, వి...

ఆ. ఆది నంటిచూడ నలవి గా దేరికి
సోదె చెప్పఁదరమె సుఖమెఱింగి
వాద మేల బయలు వర్ణించి చూడరా, వి...

ఆ. ఆలుమగఁడు సుతుఁడు నందఱిలో నాత్మ
మేలుగానె యుండి మెఱయుచుండు
వేలువేలుగానె వెలసె రూపంబులై, వి... 1734

ఆ. ఆశపాశము బట్టింతు రాలుసుతులు
గానిపడెదవు కూటికే గడపరాదు
శోకమందిన కాలుఁడు తాఁకి విడఁడు
పాకమెఱిఁగిన బ్రహ్మంబు పరఁగు వేమ! 1735

ఆ. ఇట్టియావనమున నీశ్వరధ్యానంబు
గలిగి జేయవలయుఁ గడకతోడఁ
జేయకున్న యెడల తీఱి సౌఖ్య మేదయా, వి...

ఆ. ఇట్టిలింగమందు నీరేడుజగములు
పుట్టి బ్రదుక నరులు భువిని వెలసి
గట్టిగా యమునికి కానుకలై యుంద్రు, వి...

ఆ. ఇతరచింతలన్ని వెతలని మది నెంచి
జతుకమంటురీతి జగము మఱచి
సతత మాత్మయందె సయ్యాటలాడరా, వి...

క. ఇదియది గానిది మదిలో
చెదరనిగుఱితోడఁ జూచి చేపట్టికనన్
గదలక మెదలక తోఁచెడు
విదితం బే దందు బెనఁగి వెలయుము వేమా!

క. ఇది రాజమార్గభావము
సుభమై జగములకు నెల్ల నాత్మాకృతియై

సదమే వతిమైయె తోఁచెడు
నదియే పరమయినబయ లనందగు వేమా! 1740

క. ఇది లేక జరుగ దనుచును
మదిలో నేవస్తువైన మమతఁదగు మతిం
గదిసి విడిచి పోఁజాలని
దదెపో సంసారబీజ మనఁబడు వేమా! 1741

క. ఇంద్రియపరవశుఁ డధముం
డింద్రియపరవశుఁడె భ_క్తియెడ మధ్యముఁడౌ
నింద్రియజయుఁ డు_త్తముఁడు జి
తేంద్రియసమధికుఁడు విన మహేశుఁడు వేమా!

క. ఇరుమూఁడక్షరసాధన
పరుఁడగు నిర్వాతదీపపద్ధతి మదిలో
గుఱిమీఱి బయలు సేరిన
నిరుపమసానందమూ_ర్తి నిత్యుఁడు వేమా!. 1743

ఆ. ఈజగమున ము_క్తి కిరుమూటి కవ్వల
రాజమార్గ మమరు రంగుగాను
తేజ మూని నొక్కి తెంపుగాఁ జూడరా, వి...

ఆ ఈడుగానిదాని తోడికిఁ బొల్పడి
జోడుగూడరాదు నూటిగాను
కూడి తప్పె నేని గుణములు కొంచెమా, వి...

క. ఉ_త్తమమగుజ్ఞ_ప్తికి నై
గనము నిజరూపభావసాదృశ్యములోఁ

బొత్తున పారంగతుఁడై
హత్తెడునధ్యాత్మవిద్య ననువుగ వేమా! 1746

క. ఉదయాద్రికి పైనుండెడు
సదయుని మది నిల్పి చూడ శక్యము గాఁగాఁ
గుదురుపడు జ్ఞ పి నిలిచిన
నదియే పరిపూర్ణసౌఖ్య మందెడు వేమా! 1747

క. ఊకొనఁ జెప్పిన విన వది
ప్రాకటముగ లోకములను బాలించెడు నా
పాకము మదిలో బయలని
యేకాకృతి నవిరతముగ నెన్నుము వేమా!

క. ఊకొని వినఁగావచ్చును
బ్రాకటముగ కథల నెల్ల బలుదెఱఁగులుగా
నేకీభావమునందును
జోకుట దుర్లభము మదికి సుడివడు వేమా!

క. ఊపిరి లోనికి లాగుచుఁ
బ్రాపుగ లోనిలుపఁ జూచి పనుపుగ విడుచున్
జూపోర్వనిబయలందుచు
గాపుగ నీలోన నిన్నె కనవలె వేమా! 1750

తే. ఊపి రున్నంతవఱకును కాపురంబు
చేసి కడతేఱలేకయే చిక్కువడరె
పాపలో చూపుమించుటె పావనంబు
దాని మార్గంబె తెలియఁగాఁ దగును వేమ!

ఆ. ఎక్కు వెట్టి పరము నేకాంతమును గోరి
ముక్కుకొనను చూడ్కి మొనయ నిలిపి
సాక్షియుండు టదియె సోహంస్వరూపము, వి.

ఆ. ఎక్కువెట్టి మనసు నేకాంతమునఁ జేర్చి
మ్రొక్కువాఁడె పరము దక్కువాఁడు
నిక్కి చూచునపుడె నిర్భ్రాంత మబ్బురా, వి...

ఆ. ఎక్కువెట్టి మనుజుఁ డేకాంత మమరఁగా
దక్కగోరుచుండు ధన్యుఁ డరయ
బ్రక్కనుండు నెఱుక పరిపూర్ణమందురా, వి..

తే. ఎచ్చుగచ్చులు నుడివిన నేమి ఫలము
మ్రుచ్చువేషంబు పూనిన మూల మేది
అచ్చుపడ తన్నె ఱింగినయతఁడె యోగి
సచ్చిదానందపూర్ణుఁడౌ జగతి వేమ! 1755

తే. ఎండమావులచాడ్పున నుండు జగము
లుండుపరమాత్మ యందును దండిగాను
నిండుమదిలోన శోధించి నెగడవలెను
మిథ్యయనునమ్మకము నీవు మీఱి వేమ! 1756

ఆ. ఎంత కడుగ నోటి యెంగిలి పోవునే
యెల్లకాలమందు నెంగిలిగను
ననుదినంబు చూడ నన్నృతమాడెడు నోరు, వి.

తే. ఎదుట గాన్పించుదానిని యెంచరాదు
మదిని గుఱుతొంది యుండుట మానితంబు

సదయహృదయత సాక్షిగా సంతరించు
హృదయరంజక మపుడగు నెన్న వేమ. 1758

క. ఎందును తలఁపఁగ లేఁడఁట
పొందుగఁ బరమాత్మ నీకను బొందుట యెట్లో
ముందుగఁ దను దా దెలిసిన
నందే పరమాత్మ తెలియు నజ్ఞుని వేమా! 1759

తే. ఎదుట నిల్చినచూపులో నేక మమర
నెఱిఁగి మరగినతోడనే యెంచరాదు
మదికి లోవెలి బయలగు మఱుగుఁజేరు
స్థిరత చిత్తంబునకుఁ గూర్పఁ దివురు వేమ! 1760

ఆ. ఎనిమిదక్షరముల నేర్పడ నెఱిఁగియు
వినియు కనఁగరాక వెలయువాని
తనువు మఱచి తెలియఁ దత్వాత్ముఁడగును రా,వి.

క. ఎనిమిదిదిక్కులు బయలై
యెనిమిదిఁటికి నారి కెన్న నెక్కుడుబయలై
వినరానిబయల నడచినఁ
గనరా యచ్చోట నన్ను గలసియు వేమా!

తే. ఎన్నిదినములు బ్రతికిన నేమి ఫలము
పిన్న పెద్దలు చెలరేగి పేరులేక
యన్నదమ్ములు నాప్తులు నందె చనిరి, వి...

తే. ఎన్నివిద్యలు నేర్చిన నెఱుఁగరాదు
తన్ను నిర్గుణమను జ్ఞప్తి తాఁకవలెను

నిర్ణయోనాస్తి యన్నది నిండియుండు
గురునిబోధకు నన్యమే కొలంది వేమ! 1764

క. ఎనుబది నాలుగు లక్షల
టనఁబరఁగిన జీవరాసులందును మును దాఁ
జనియించువిధము దెలిసిన
మనుజుఁడెపో దారి గాంచు మహిలో వేమా!

ఆ. ఎల్లి నేఁడు నిన్న నేలాగునను గాని
మనసు నిలువువాఁడు మంచివాఁడు
శివుఁడు భర్తకర్త చింతింప నేలరా? వి...1766

తే. ఎవ్వరెవరన నేనను నేమెఱిఁగియు
తానెవం డైన నెఱుఁగనిమానవుండు
అడిగినపుడైన లక్ష్యంబు నమరఁజేయు
గొంత తెలిసెడిఁగాదె యీవింత వేమ! 1767

తే. ఎవ్వరెఱుఁగనితత్త్వంబు నెఱుఁగు టెట్లు
లోను చూడంగఁ జూడంగ లోక మగును
తలఁపు మఱపులు దాఁటుట తన్మయంబు
నిత్యపూర్ణత సానందనిరతి వేమ! 1768

క. ఏకాంత మిరవు గన్గొని
లోకాంతముఁ జేరఁబోయి లోభయలగునా
పాకంబు బూని మించిన
నీ కింపగుచిత్వరంబు నెలవగు వేమా! 1769

క. ఏకాంత మిరవు గన్గొను
శ్రీకాంతుని బ్రహ్మమయుని జిన్మయుఁ బరుని
న్నాకారరూపు సాక్షి ని
జాకారమె పరమపదవి యారయ వేమా! 1770

క. ఏకం బ్రహ్మ మనంగా
వైకల్పితమై జగంబు వారల కెల్లన్
సాకారత్వము లుడిగిన
శోకము మోహంబు లేదు శుభమగు వేమా!

క. ఏచినపంచేంద్రియసుఖ
నీచవ్యాపార ముడిగి నిజముగఁ దానై
లోచూపుఁ జూడ నొల్లక
వాచా బ్రహ్మంబు పలవలదుర వేమా! 1772

ఆ. ఏకసమమునందు నెఱుక గల్గినయోగి
పరు లెఱింగి చూడ భావమందు
ఆశ లేక మించి యన్నిట దా నగు, వి...1773

క. ఏజనుఁడు గుణకదంబము
నీజగమునఁ బట్టనేర్చు నిమిడికపడఁగా
నాజనుఁడె ముక్తి కర్హుఁడు
రాజితపరిపూర్ణహృదయరంజక వేమా! 1774

క. ఏతత్త్వ మమర గోచెదొ
ఆతత్త్వము సరిగ నడపు మారసి స్వరముల్

ఖ్యాతిగ వర్ణము లెన్నక
యాతురత న్నిలుపు మదిని ననువుగ వేమా!

తే. ఏది తినకయు బ్రతికిన నేమి గలదు
వాదునకు జిక్కఁ దక్కనివరుస గనుము
భేదబుద్ధిని జూచిన బెరఁగఁబోదు
సమత గలవాఁడె యోగ్యుఁ డీ జగతి వేమ! 1776

ఆ. ఏది యేదని మదిలోని పాదు దెలిసి
కాదు కాదని పరికించి కనులు దెఱచి
ఆదిమూలము గనుచుండు నాత్మవేత్త
దానఁనే పరమానంద మూను వేమ! 1777

ఆ. ఏమి కానిదాని నెఱుఁగుట లక్ష్యంబు
సాముచేసినట్లు సాధ్యపఱచి
నియమనిష్ఠ వదలి నిర్ణయ మందరా, వి...1778

తే. ఏమిసాధనముల నంద నేమిఫలము
తామసాన్విత మగును క్తి దగుల బెట్టి
నీమనిష్ఠలు మదియందు నెఱపఁ లెను
మనసునిలుకడ గనునట్లు మనఁగ వేమ! 1779

క. ఏరికిఁ దక్కనిచిన్మయు
దారికిఁ దోఁప్పడుట నెఱుక తనలో దానై
పోరుచు బైకొనుచుండును
సారెకు సమయింపఁ జూడు సరసత వేమా! 1780

క. ఏవంక మనసు కలిగిన
నావంకను నింద్రియంబు లన్నియు నేగు
న్నీవంక మనసు కలిగిన
నేవంకకు నింద్రియంబు లేగవు వేమా! 1781

క. ఒకటని రెండని యెన్నుచుఁ
బ్రకటితముగ లెక్కఁబెట్ట బైకొనుచుండున్
నికరముగ నెలుక దాఁటిన
సకలేశుని గాంచుటకిది సరసము వేమా! 1782

క. ఒంటరిగా నున్నప్పుడు
గంటికి మింటికిని నడుమ గాపురముగ నీ
యింటను గన్గొని పిమ్మట
జంటించు జితాత్మయుని జపమున వేమా!

ఆ. ఒంటికంబమందు నొనర నంకణ మాను
ఆరునంకణముల నమర నిప్పి
ఆవల నింక చూడ నమరును తత్వము, వి...

ఆ. ఒంటిమేడలోన నొనరంగఁ జూచిన
మంటిమింటినడుమ మహితముగను
కంటిజ్యోతిమిగిలి కలియ నెక్కుము హంస, వి..

ఆ. కడఁకతోన నరుఁడు కామంబు గట్టినఁ
జిత్తమునను చికిలి చిత్రరూపు
కైవడి నిలనుండు ఘనుఁడాతఁడేసుమీ, వి...

క. కడలేనియాదికాలం
బెడఁబడకుండఁగను జ్ఞాన మెఱుఁగక యున్నన్
విడువఁడు జడమతులను మఱి
నడువ్రఁడి ఘనులెల్ల ముక్తినట్టుగ వేమా! 1787

ఆ. కడుపునిండ సుధను క్రమముతో ద్రావిన
పాలమీఁద నేలఁబౌఱుమనసు
తత్త్వ మెఱుఁగు వెనుక తన్వంగు లేటికి? వి...

తే. కదలకుండఁగ మది నిల్పి కదిసి పట్టి
నిదురలో నిద్రచూచుచు నేర్పు మిగిలి
పదరకుండెడివాఁడె పో బ్రహ్మనిష్ఠుఁడు
నిదియె సంతోషముల కెల్ల నిజము వేమ! 1789

క. కదలనిజీవములందును
తుదిమొదలుగనాపరుచులు తొలఁగకయుండున్
గదలెడిజీవములందును
వదలవు కష్టంబు సుఖము వసుధను వేమా!

క. కనుచాటు తప్ప కాగుఱి
మననంబునఁ జేరి నొక్కి మార్కొనినంతన్
వినుచుండుఁ బ్రణవరవమును
గని దాఁటున నిర్గుణంబుగతి యగు వేమా!

తే. కనులచూడ్కిని జెదరక పట్టి నొక్కి
తనువుపై నాస విడిచిన తావు బట్టి

యున్న మనుజుఁడె శివుఁడయా యుర్విలోన
నతని కేటికి సుఖదుఃఖవితతి వేమ! 1792

ఆ. కనులఁ జూడఁబడని కలుషవిదూరుని
మనమునందు జేర్చి మరులుకొనక
తనకు ముక్తి లేదు తలఁపులు మెండైన, వి...

క. కప్పయు పామును బోరం
గప్పను సర్పంబు మ్రింగుకై వడి మెఱయం
గప్పను వెడలం ద్రోసెడి
యొప్పున నాచొప్పు దెలిసి యుండర వేమా!

ఆ. కపటమైన పనులు కడఁబెట్టి చూడక
తత్త్వ మెట్లు తనకు తగులువడును
దగులువడినఁ గాని ధన్యత నొందఁడు, వి...

ఆ. కంబమునను జొచ్చి కడ తేఱిపోయెడి
తెఱువెఱుఁగకయుండెఁ దిరిగివచ్చి
తెరువుదెలిసి దాఁట దేవుఁ డందురు కదా,వి...

క. కర్మజ్ఞానేంద్రియములు
నిర్మలహృదయమున జేర్చి నిర్గుణమతితో
ధర్మంబని వివరించుట
మర్మం బధ్యాత్మయోగమహిమము వేమా!

ఆ. కల్ల నిజము తెలిసి గాలిభూతము రోసి
యింటిమీఁద నాస యేల విడరొ
నీటిమీఁద బుగ్గ నిలుకడ కాదయా, వి...1798

తే. కలుషములనెల్ల ఖండించు గతి నెఱింగి
చిన్మయానందపట్టాభిషిక్తుఁడైన
వాని నెన్నంగఁదరమె యీవసుధయందుఁ
బరశివుండని వర్ణింపఁబడును వేమ! 1799

ఆ. కాంతపైనిప్రేమ స్వాంతము రంజించు
జింతదీఱు దరుణి చిక్కినపుడె
వింతయమరఁ బోదు విశ్వసాక్షిని గూడ, వి...

క. కించిన్మాత్రమును మదికిఁ
జంచలమును బుట్టనీక జాగ్రతతో సా
నంచితమగు గురుభక్తిని
మించినపరిపూర్ణమూని మెలఁగుము వేమా

ఆ. కీలుదెలిసి మదిని గేవలాత్మను గూడి
భావమందు సాక్షి బయలుదాఁకి
చేరియుంట ముక్తిఁ జెందంగఁ బూనరా, వి...

క. కుండలియోగము దెలిసిన
బండాలము యోగి కేల బాలికబొందం
దండిగ నాతను వందునె
మెండుగ నిల ముక్తికాంత మెలఁగుర వేమా!

ఆ. కేవలాంతరాత్మ జీవుండు నిజమని
పట్టివాదులాడువారి ద్రొక్కి
త్రొక్కి పట్టి నాల్క తుదిఁ గోయ-పాపమా? వి

ఆ. కొండమీఁద జ్యోతి కొమరు దీపింపఁగా
నిండి పూర్ణముండు నిబిడముగను
అండఁజేరకున్న నంటగరాదయా, వి... 1805

ఆ. కోరి మదిని గురుని కొలువు జేయుట మేలు
గారవమున దెలుపు గహనవిద్య
దూరదృష్టి నిలిపి తొడరుట మోక్షంబు, వి...

క. క్రమమున దేహత్రయములు
విమలజ్ఞానంబుచేత వివరించినచో
నమలం బగునజ్ఞోకము
కొమరొప్పగ జాగ్రతందు గూడును వేమా!

తే. ఖండపరశువుఁ బూజింప దండిదావి
భూతి నిచ్చును గావున నీతి గలిగి
శివుని బ్రార్థించుతరి ననుభవమునందఁ
జేయు నైశ్వర్య మిచ్చుటచేత వేమ! 1808

తే. గట్టురాచూలిపతియైన గంగధరుని
గుట్టు మదిలోనఁ దెలిసినఁ బట్టువిడక
చట్టువలె మనమందుట శాశ్వతంబు
దిట్టయగునట్టి యాతఁడె తెలియ వేమ! 1809

తే గగనగోచరనిర్గుణగమ్యు మూని
తమము మీఁటినధ్యానంపుతత్పరమున
దెమల కందుట మోక్షంబు తెరువు గాదె
విమల సుజ్ఞాన మబ్బిన వెలయు వేమ! 1810

తే. గమనగమ్యనిరాలయగతిని మనసు
సమరసత్వంబుగా నెంచి సాక్షి యగుచు
భ్రమ లడంచిన బ్రహ్మంబు బట్టబయలు
క్రమ మెఱుంగమి లోనెల్లఁ దమమె వేమ! 1811

తే. గగనగోప్యనిరాలయ ఘట్టమందు
విమలనిర్మలనిష్కళ వేదిఁ జేరి
తన్ను గని చింత చేయుటే తత్పదంబు
గురుకటాక్షము లభియింప గుదురు వేమ! 1812

ఆ. గుడులు దేవతలని గుర్తులు గావింత్రు
ముష్టిబాపలనుచు మూల్గ నేల
మొప్పెలకును దారి మరియఁగఁ జూపిరి, వి...

ఆ. గుణికి జ్ఞానమహిమ గోరంతఁ జెప్పిన
కొండ యగును వాని గుణముచేత
గుణవిహీనున కెట్లు గుదురు నారీతిగ, వి...

ఆ. గురువు లేక విద్య గుఱుతుగా దొరకదు
నృపతి లేక భూమి తృప్తి గాదు
గురువు విద్య లేక గురుతరద్విజుఁ డౌనె? వి...

తే. ఘనచిదాకాశ మైనట్టిగతి నెఱింగి
యనిల రేచకపూరకం బనువుగాను
పనుపడఁగ లాగి కుంభించి పాటుపడర
మనెదు సుజ్ఞాన మమర నేమరక వేమ! 1816

ఆ. చింతమూనుకొనను జేసిన నలకాంత
వింతఁ జూపి చనును విడువరాదు
పంతగించి దాని పట్టినసే మేలు, వి... 1817

తే. చిన్మయానందపురి నడిసీమఁ జేరి
తన్మయుండైన పరశివతత్త్వవేత్త
వన్మయంబగు రాజ్యంబు వఱెగి యుండు
జన్మరాహిత్యమందు నిజమ్ము వేమ! 1818

క. చెప్పియుఁ జూపఁగ రానిది
మెప్పుగ నడిలోనఁ జూచి మెలఁకువతోడన్
త్రిప్పులు వడకయ చూచిన
నొప్పుగ జగ మెల్ల నిండి యుండిన వేమా!

తే. చెప్పవచ్చును దా నెంతో చేసినట్లు
ముప్పు త్రిప్పలు దలఁగను మూలమేది
చెప్పుమాటలు తనమది నేఁతలగునె, వి...1820

ఆ. చెలిమితోడ ముందు చింతించి గగనంబు
బలముతోడ బ్రాకి భావ మూని
ఫలవిహీనమైన భావ చిన్మయమంది
విలయమందువాఁడు విభుఁడు వేమ! 1821

ఆ. చక్కగాను మదిని సాధించి కనవలె
నిక్కి చూచు నెఱుక నేర్పుమీఱ
ముక్కుతుదిని చూపు ముదమందఁ జూడరా, వి.

తే. చేరి యష్టాక్షరము లెంచి దారిమిగిలి

కోరికలు లేనిమోక్షాధికారి యగుచుఁ
బోరి చిత్పదమందినఁ బొంచి మించు, వి...

ఆ. చక్కఁజేసి మదిని సాధింప నేరమి
ముక్కుమీఁద దృష్టి మొనయు టరుదు
నిక్కమైనజ్యోతి నిన్నంటియుండురా,వి...1824

క. చక్కనిపూనికతోడను
ముక్కుతుద న్నిలిపి మనసు మూలము గనమి
న్దక్కదు నిత్యవినోదము
దృక్కగునాబయలు సేర దృఢమగు వేమా!

ఆ. చందమామ వెలుఁగుఁ జక్కఁగాఁ బరికింపు
వెన్నెలం దలరెడి వెలయు బయల
దానిరూపుఁ దెలియఁగానె ముక్తి ఘటిల్లు,వి...

ఆ. చదువులందు లేదు శాస్త్రంబులను లేదు
వాదములను ద్వైవభేదములను
బయల నున్నముక్తిఁ బాటించి చూడరా, వి...

ఆ. చదువులన్ని చదివి చాలవివేకియై
మగిడి తన్నెఱుఁగక మందజనుఁడు
విసుగుచదువటంచు వెఱ్ఱియై చెడిపోవు, వి...

ఆ. చాయలోనిచాయఁ జక్కఁగా గుర్తించి
గోయవలెను భ్రమలఁ గొంకులేక
మాయమాయ మానుమహిదత్త్వమందురా,వి.

తే. చూపురూపుల రెంటిని జూచి దాని
నిరుకు తెలియంగ మదినుంచ నేర్పు గనుచు
గాపురంబగు కైవల్యకార్యమౌను
నిర్మలజ్ఞాని పని బూని నిజము వేమ! 1830

తే. చూపులో చూపు వెలిచూపు చూడ నేల
నాదియంత్రము లేనట్టి యచల మగును
వేదగురుమూర్తి మది నుంచు వేగముగను, వి.

తే చూపురూపుల రెంటిని జూచి దాని
నన్నియును గాక తన్ను దా గన్నదాని
నిర్మలంబుగ మది నెంచు నిర్మలుండు
నిర్గుణబ్రహ్మ మరచేత నిలుపు వేమ! 1832

ఆ. జగమునందు లేదు జలములందును లేదు
నిగమవేద్యమైన నిజపదంబు
సగుణనిర్గుణముల సాధించి చూడరా, వి...

ఆ. జతుక మంటురీతి జాబిల్లి వెలుగంది
ప్రతిఫలింప గుత్తిని బరిణమించి
వెదుకవలెను మదిని వేదాంతమర్మము, వి...

ఆ. జననమరణవేళ స్వాతంత్ర్యమూ లేదు
తేను లేదు మున్ను పోను లేదు
నడుమఁ గర్తననుట నగుఁబాటు గాదఁటే,వి...

ఆ. జాతికులములంచు జనులెల్ల బద్ధులై

భావపరమునందు బ్రాలుమాలి
చచ్చిపుట్టుచుండ్రు జడమతులై భువి, వి...

ఆ. జాతిమతము విడిచి చని యోగిగా మేలు
జాతితోనె యున్న నీతివలదె
మతము బట్టి జాతి మానకుంట కొంత, వి...

ఆ. జీవభావ మెఱుఁగఁ జెడ దెన్నటికి మతి
దైవమును నెఱుంగ దనరు బుద్ధి
తేజ ముదయమంద దిమిరంబు నిల్వదు, వి...

ఆ. జీవవశమురీతి జన్మాత్రతను మించి
భావమతనమరు పట్టుఁ బట్టి
కలియుహంస మదిని గర్మసన్న్యాసియై, వి...

క. జవదాఁట నేల గుఱిగా
భవహరమగు భక్తి బూని పరిపక్వముగా
ధ్రువమైన బయలు జేరఁగ
శివ మన్మయచిన్మయంబు చేకురు వేమా! 1840

ఆ. జాలి నొందరాదు జవదాఁటి కనరాదు
ఆదిమూల మైనయాత్మ మఱుగు
పోరిచేరి పొంది పూర్ణము నందురా, వి....

ఆ. జ్ఞాననిష్ఠఁ బూని మేను మఱచువాఁడు
కామిగాఁడు మోక్షకామిగాని
నీమనిష్ఠ లుడిపి నిర్గుణ మందురా, వి... 1842

క. తక్రముతో నుద్భవమై
తక్రమ్మున దేలు వెన్న తరబడి సంసా
రక్రమమున బుట్టియు మన
చక్రము గుర్తింప నగును జతురత వేమా!

క. తననిజరూపము జూడం
గను దగుమార్గంబు తెలియఁ గాపలె నన్నన్
ఘనగురునియండ జేరక
యొనఁగూడున సాముఁ జేయ నుర్విని వేమా!

క. తనలోపల సకలంబును
తనరం దా నగుట నెఱిఁగి తారక మాత్మం
గనుఁగొనుచు బరిణమించిన
మనుజునకును ముక్తి గలదు మహిలో వేమా!

క. తనలో సర్వం బుండఁగఁ
దనలోపల వెదుకలేక ధర వెదకెడి యీ
తనువుల మోసెడియెద్దుల
మనములఁ దెల్పంగవశమె మహిలో వేమా!

క. తనమతమును తా నెఱుఁగఁడె
మనమునఁ దలపోయ నెవని మార్గం బగునో
యనయము నిజాలంబును
గని మెలఁగుట ముక్తి కిరవు గదరా వేమా!

క. తనుఁ దా దెలియుట తత్త్వము
తన కన్యులు బోధసేయ ధరలో గలరా

తను దాఁ దెలియక యుండిన
తన కెవరును తెలుపలేరు తథ్యము వేమా!

తే. తాను తానైన బయలున దనరి బుద్ధి
పూనికను నిల్చునప్పుడే పూర్ణమంది
నిర్ణయో నాస్తి సర్వత్ర నిండునదియె, వి...

ఆ. తావు లేనిచోట తావు తానై యుండు
తావు గలుగుచోటఁ దాను లేఁడు
తావు తానె యైనఁ దత్త్వంబు తెలియునా? వి.

క. తొమ్మిది తొట్టెలతిత్తిని
నమ్మి శివుని దలఁప లేక నశియింతువు నీ
విమ్మహి గృధ్రచయంబులు
సమ్మతిగా నిన్ను దినును చక్కఁగ వేమా! 1851

ఆ. త్రాడు పామటంచు తాఁ జూచి భయపడుఁ
దెలిసి త్రాడటన్న దీఱు భయము
భయము తీఱినపుడె బ్రహ్మంబు తానగు, వి...

తే. దర్పణంబున దనరూపు తగిలినట్లు
నేర్పు గలిగినమదిలోన నీదురూప
మర్పణంబుగ నెఱుకలో నడచిచూడ
నోర్పు కలవాఁడె నేర్చు తా నొనర వేమ!1853

ఆ. దాపున నున్నది యద్దము
రూపున నీరూపుఁ జూచి రూఢిగ గని యా
పాపను లోనగుచూపున

బ్రాపై శివుడుండుఁ గనుము పసుపడి వేమా!

ఆ. దూరయోచనలకు దూరమౌ దైవము
తనువు దూరమైనఁ దగులునపుడు
జీవిదవ్వుచేయ దేవుఁడై నిలుచును, వి... 1855

ఆ. దేహమూలమందు దేహి దేవుఁ డటంచుఁ
దెలిసియున్న బుధులు తీర్థయాత్ర
లరయ బోరు జగతి నాత్మ తామై యునికి, వి.

ఆ. దొమ్మ మాయకోఁటకు నమ్మవారికి వేఁట
లిమ్మటంద్రి దేమి దొమ్మతెవులొ?
అమ్మవారిపేర నందఱు దినుటకా, వి... 1857

ఆ. ధాత్రిజనుల కెల్లఁ దగ నెఱింగించెద
నొనర హరు నెఱుంగు నుపమ యొకటి
మనసు చెదరనీక మహిమతోఁ జూచుటే, వి...

క. నాదను దెలిసినయోగియె
వేదాంతములోన నున్న విధి దెలుపుమది
న్నాదంబె ము క్తిపదమని
యాదరమున జనులతోడ ననరా వేమా! 1859

ఆ. నాదునాదు గూడి నామరూపంబైన
నాదులోన నాదు నాటియుండు
వాదుఁ జేయువారు వర్ణింపలేరయా, వి...

క. నాలుగువీథుల మధ్యను
మేలుగ బ్రహ్మంబు నుండ మెలఁకువతోడం

జాలగ గురుమూలంబున
పేలుగఁ బొందంగ నగును వినరా వేమా! 1861

ఆ. నిజము వరుస నెఱిఁగి నిర్గుణత్వం బంద
పలుకులో నిశబ్ద మలర దెలియఁ
బలుకకుండువాఁడె పరమాత్ముఁ డందురు, వి....

తే. నిత్యసత్యనిరామయనిర్గుణంబు
మృత్యుసమదృష్టిలో నెంచి మిన్నకుండి
భృత్యభృత్యానురాగుఁడై భ్రుకుటి నంటి
నృత్యమాడుచు నుండుటే నియతి వేమ! 1863

తే. నిత్యసత్యవ్రతాచారనిపుణుఁడ వయి
పరమధర్మార్థముల నెల్లఁ బట్టి చూచి
సిద్ధిబొందెడి పరిపూర్ణచింతః బూను
మప్పు డానంద మమితమా నయ్య వేమ! 1864

క. నిత్యానందవివేకము
సత్యంబుగ దెలియకున్న శక్యంబగునా
ముత్యము సరిగురుమర్మము
భృత్యుఁడవై మది నెఱుంగఁ బెంపగు వేమా!

ఆ. నిద్రమేలు తెలిసి నిలుపుఁడీ మీలోన
బ్రాణిమేలు తెలిసి బాయకుండుఁ
బ్రాణి నిదురసందు పరమాత్ముఁ డుండును,వి...

క. నిను నీ వెఱుఁగఁగ నెంచిన
మనమున సంకల్పములను మానఁగవలెరా

అనుమానరహితముగ గుఱి
వినయంబున గురుని బట్టి వెదకుము వేమా!

నిన్ను జూచు చుండ నిండును తత్త్వంబు
తన్ను జూచు చుండ దగులుమాయ
నిన్ను యెఱిఁగినపుడె తన్ను దా నెఱుఁగును, వి.

నిర్మలాత్మవిద్య నిత్యసత్యజ్ఞాన
నిరతుఁ డైనవాఁడ నేర్పుమీఱ
ననుభవింపఁ గోర నలసట బొందును, వి...

నీతియు భక్తియు జ్ఞానము
రీతుల వర్తించు మదిని రేవెలుఁగగుచుణ్
జ్యోతిని నాకగు బ్రహ్మము
భూతాత్ముఁడు నిన్నుఁబొందు బోడగను వేమా!

నీలోని యెఱుక యనునది
నీలోననె పెరిఁగి పెరిఁగి నీలో నడఁగుణ్
నీలోనిచిత్ర మడఁచిన
నాలోనన బ్రహ్మ బయలు నందును వేమా!

నీళ్ల మునుఁగ నేల నిధుల మెట్టఁగ నేల
మొనసి వేల్పులకును మ్రొక్కనేల
కపటకల్మషములు కడుపులో నుండఁగా, వి...

నీవనినను నేననినను
భావమ్మున నెఱుక యొక్క పద్ధతి యగునా?

భావంబు దెలిసి మది ని
ర్భావముగా నిన్ను గనుట పరమగు వేమా!

ఆ. నీవు నిలిచియుండు నిఖిలంబు నిలువదు
నిలిచియుండు నెండ నీరువలెను
నీవు నిశ్చయంబు నిఖిలంబు మాయయా, వి...

ఆ. నీవు పలుకుచున్న నిత్యపూజితుఁ డౌను
నీవు పలుకకున్న నిదురపోవు
నీవు పలుకుపలుక నిర్మలుం డగునయా, వి....

ఆ. నీవు వినగ నొకటి నిలిచి యుండఁగ లేదు
నిలువ నెండమావి జలములట్లె
నీవు నీన్నెఱుఁగుట నిశ్చయం బాయెరా, వి...

ఆ. నేయి వెన్నకాఁచి నీడనే యుంచిన
పేరి గట్టిపడును పెరుఁగు రీతి
పోరిపోరి మదిని పోనీక పట్టుము, వి... 1877

ఆ. పంచభూతములను పరఁగ వలను బట్టి
సంచరింపకుండు సరణి దెలిసి
వేఁటలాడి బెస్తవాటంబు నెఱుఁగుము, వి...

ఆ. పంచఋషులు భువిని పరమపవిత్రులు
మించి లోకమునకు మేలుకొఱకు
సంచితార్థములను సమసింపఁ జేయరా, వి....

ఆ. పంచముఖములందు పంచాక్షరి జనించె
పంచవర్ణములను బ్రబలె జగము

పంచముఖుని మీరు బ్రస్తుతి సేయుఁడీ, వి. 1880

ఆ. పంచవర్ణ మెఱుఁగ పరము నెఱుంగును
పరము నెఱుఁగ నిచ్ఛ బ్రజ్వరిల్లు
బ్రజ్వరిల్లువాఁడు పరము తా నగునయా, వి.

క. పడయఁగరానిది పూర్ణము
తడఁబడకలమనసమందు దలపడినంతం
జిడిముడి లేకటు నిల్చిన
విడనాడఁగ బట్టబయలె వెలయును వేమా!

క. పసుపడి నిర్గుణ మనునది
తన కెద్దియుఁ దోఁపఁ బోదు తత్త్వ మెఱుఁగకే
మనసాంతరంగమందును
వినయం బగుబయలు జేరి వెలయును వేమా!

తే. పరమసిద్ధాంతమగునట్టి బయలు చేరి
పట్టువిడుపులు వదలి తాఁ బ్రాఁకి నిలిచి
పట్టికని లోకపాశంబు వదల నగును, వి...

ఆ. పరుస మినుము సోఁక బంగారమైనట్లు
కప్పురంబు జ్యోతి గలసినట్లు
పుష్పమందు దావి పొసఁగిన ట్లగు ముక్తి, వి...

ఆ. పరమసిద్ధికోఱకుఁ బాపల నిగుడించి
శ్రవణమననవృత్తి సంగ్రహించి
యెఱుక మఱచువాఁడె యేకాగ్రచిత్తుఁడు, వి.

క. పరమాత్మునిచింతనలోఁ
దలుచుగ నుండుటయె పగును ధర నాఁకటికిం
దిరిపము నెత్తి భుజించుచు
దొరవలె గృహవేదికందు తొంగును వేమా!

క. పరిశీలించినజ్ఞప్తిని
గుఱినిల్పెడుభక్తిచేత గోర్కె లడఁగెడిన్
స్థిరరూప మంది పొందెడు
పరిపూర్ణసమాగమంబుఁ బడయును వేమా!

ఆ. పలుకులోనిపలుకుఁ బరగంగఁ జూచినఁ
బలుకులందు బ్రహ్మపదము గలుగు
పలుకుఁ గాన లేక పరువు దప్పిరి జనుల్, వి...

ఆ. పలుకులోనిబిందు వలరంగఁ గావలె
పలుకులోనిదాని పదిలపఱచి
వేడుకైన దాని విత్తఁ బెట్టకుండురు, వి...

ఆ. పాశమునను జూడఁ బరఁగ దేహమునకు
హానివచ్చుఁ గాన నదియుఁ జూచి
జ్ఞానదీపకళిక కడకొత్తవలెనయా, వి... 1891

ఆ. ప్రాణమందు శివుని భావించి తేఱక
ముద్ర లనుచు బడెడిమూఢులార
ముద్రలందు లేదు మూలమందే కాక, వి....

ఆ. బ్రదుకువార లెవరు బ్రదుకకుండు రెవరు
బ్రదికి బ్రదుక లేనిప్రాణు లెగ్గ

జీతిని శోధజేసి స్థిరముగాఁ జూడరా, వి...1893

క. భగవంతుఁ డైనదేవుఁడు
జగముల దనలోనఁ బెంచి జాలముజూపుం
దగురీతిని దా నన్నిఁటి
నగణితుఁడై వెలయుచుండు ననువుగ వేమా!

క. భగవంతుని ప్రతిబింబం
బగు నీశుం డొరసి మాయ నగులోకమునం
దగభోజ్యమునగు జీవుం
డొగి భోక్తయె విష్ణ గూడి యొప్పుఁగ వేమా!

ఆ. భద్రమైనమనసు బలపడినంతట
వద్దఁ దగును పరము వశముగాను
నిద్రలోనినిద్ర నిలుపుకొనుచుఁ జూడు, వి....

క. భయముసుమీ యజ్ఞానము
భయ ముడిగిన నిశ్చయంబు పరమార్థంబౌ
లయముసుమీ యీదేహము
జయము సుమీ జీవుఁ డనుచు సాటర వేమా!

ఆ. భానుసోమవహ్నిభవ్యలోచను మదిఁ
దలఁపకున్న ఫలము గలుగఁ బోదు
ఇహపరంబులకు మహేశ్వరుఁ డతఁడౌట, వి...

ఆ. భార్యమీఁద నాశ పరఁగు బురుషునకు
మగనిమీఁద నాస మగువకుండు
శివునిమీఁద నాశ సిద్ధున కుండురా, వి...1899

ఆ. భావ మరయ వేఱె పరదేశమున లేదు
తాను జేయుపనులఁ దగిలియుండు
భావమందు శివుని పరికింపుచుండుము, వి...

క. భావాభావము లంటక
సేవించెడు బట్టబయలు స్థిరమతిలోనం
కేవలము శివధ్యానము
తావరమును గన్న వాఁడె ధన్యుఁడు వేమా!

తే. భాష లెన్నిటిలో నైన భాష యొకటె
వేషములలోన జిక్కి వివిధ మెఱుంగు
ఘోషకుండని తలఁచుట పొందు గాదు
దోషమున్న నెఱుంగుము తొలుత వేమ! 1902

క. భువనాకారుని మదిలోఁ
బ్రవిమలశుభమూర్తిగాను బరికించినచో
భువనాశమగును బూర్ణుఁడు
శివదేవుఁడు చిన్మయుండు స్థిరుఁడగు వేమా!

ఆ. మంట లోహమందు మాఁకుల శిలలందు
పటములందు గోడ బ్రతిమలందు
దన్నుఁ దెలియుకొలఁకుఁ దగులదా పరమాత్మ, వి.

ఆ. మంటికుండవంటి మాయశరీరంబు
చచ్చు నెన్నఁడైనఁ జావ దాత్మ
ఘటము లెన్నియైన గనన మొక్కటికదా, వి...

ఆ. మడియువాఁ డెవండు మడియని దెవ్వఁడు

పాటుఁ జేసి చూడ బట్టబయలు
సౌరది జలఘటమున సూర్యునిచందము, వి...

ఆ. మది నెఱిఁగినవాని మహి గాన మెందును
మది నెఱుంగువాఁడె మహి మనుజుఁడు
వెనకి తనువులోన వేడ్కతో నిను జూచు, వి...

ఆ. మనముఁ జూచి గెల్చి మనములో సుఖియింప
గడకు మోక్షపదము గను నచటనె
చెట్టుఁ బెట్టి ఫలము చేకురదే దాన, వి...1908

ఆ. మనసునందు ముక్తి మలయుచు నుండఁగ
మనసు నెఱుఁగ లేనిమనుజు లెల్ల
మనసు నంట లేక మాయమై పోయిరి, వి...

ఆ. మనసు ముక్తి యనుచు మది నెఱుఁగఁగ లేరు
మనసు చేతఁ దగిలి మాయ మైరి
మనసు తానయైన మర్మజ్ఞుఁ డగుయోగి, వి...

ఆ. మనసులోన శివుని మానక నిల్పిన
యోగి యగు నతండె యుర్విలోన
శివుని దలఁపలేనిచిత్తం బదేలనో? వి... 1911

ఆ. మాయరూపు రూపుమాయగాఁ జేసియు
మాయరూపును బెనుమాయఁ జేసి
మాయలోనిమాయ మఱి పరంజ్యోతిరా, వి...

ఆ. ముగురిలోన వెన్క ముందు గానఁగ లేక
నరకమునకుఁ బోవునరులు గలరు

ముగురికందనట్టిమూలమూ ర్తి యొకండు, వి.

ఆ. ముగురుమూర్తు లన్నమూలభావ మెఱిఁగి
మూలవానితోడ ముచ్చటాడి
సత్తు చిత్తు లోనిసారంబు తెలియురా, వి...

ఆ. మూఢజనుల కెల్ల మూలమై తగుయోగి
తారకంబు గాను దైవరూపు
బట్టబయలు జేసి పరమాత్మఁ జూపఁడో? వి...

ఆ. మేకచంకఁ బెట్టి మేలఁగుచు మందలో
భ్రమసి తిరుగు గొల్లపగిదిగాను
దేవు నెఱుఁగక పెఱదేవతల దలంచు, వి...

ఆ. మ్రానుఁ గాలవేసి మహిమీఁద నొకజాణ
పూని తిరుగుచుండెఁ బొందుగాను
కాలివేయు మ్రాను కడురమ్యమై యుండు, వి.

క. మ్రాఁకున ననలంబుండును
మ్రాఁకున నాయనలమువలె మనుజులలోనన్
డీకొని తా రాజిల్లుచు
నేకంబగు బ్రహ్మముండు నెప్పుడు వేమా! 1918

ఆ. రతి యొనర్పఁ బూని సతిని వేఁడినయట్టి
మతిని వేఁడి పరముమఱుఁగుఁ దెలిసి
గతిని గోరుచుండ్రు ఘనయోగు లిలలోన, వి.

ఆ. రమ్యమైన మనసు రాజని యెంచుచు

గమ్యముగను దాని గట్టు దెలిసి
మఱిగి పూర్ణపదవి మహిలోనఁ గానరా, వి...
ఆ. రూపమడఁగ జీవరూపంబు గనరాదు
అట్టిరూప మడప నలవి గాదు
బ్రహ్మ మడఁగకున్న బ్రహ్మంబు గనరాదు, వి...
ఆ. రూపవంతులట్లు రూపులు మర్దురు
వారివారి సెఱిఁగి గారవింప
మొదల తానె యుండి మోక్షంబు గల్గురా, వి.
ఆ. రూపుఁ జూచి మెచ్చి రూపింప నేరక
వేదశాస్త్రములను వెదకుచెల
దాపుగానె యున్న దర్పణ మట్టుల
శివుఁడు భావమందు జెలఁగు వేమ! 1923
క. లలితశివతత్త్వపదమునఁ
గలిసిన శివయోగి యేల గలియు జగములన్
జలబిందువు ముత్తియమై
కలియునె తొల్లింటినీటఁ గనరా వేమా! 1924
ఆ. లేదు జగతి నంచు వాదు సేయఁగ వచ్చు
పోది సెప్పరాదు సూక్ష్మ మెఱిఁగి
పాదుకొల్పి బుద్ధిఁ బరికించి చూడరా, వి...
ఆ. వాఁడు వాఁడు గాఁడు వానిలోపలనుండు
వాఁడె వాఁడు వాఁడు వాఁడు గాఁడు
వాఁడు వాని గూర్చువాఁడె పో బ్రహ్మంబు, వి.

క. వినవలె నాదము తనలోఁ
గనవలె బ్రహ్మంబు విడక కౌతుకమొప్పన్
గనవలె సోహంభావము
తను దానై పరమునంద దగులక వేమా!. 1927

ఆ. విన్నవాఁ డెవండొ కన్నవాఁ డెవ్వఁడొ
విన్నకన్న వానివివర మేమొ
అరసి చూడవలయు నంబుధి నైనను, వి...

ఆ. విమలదృష్టిఁ బూని విజ్ఞానమందమి
తమము బాయనగునె తథ్యముగను
దమము మీఱినంతఁ దత్త్వజ్ఞుఁ డగునయా, వి.

తే. వేదగీతంబులను మించి వెలయువాని
నాదబిందువు కళలంటి నయము గాను
సాధకంబున జొచ్చుటె సన్మతంబు
జన్మసార్థక మప్పుడె జనును వేమ! 1930

ఆ. వేదముఁ జదివియు విఱ్ఱవీగుటకాని
యధమగతిని బడిరి యయ్యలెల్ల
బ్రహ్మమహిమఁ దెలిసి బ్రదికిన బ్రదుకయా, వి.

ఆ. వేదవిప్రులెల్ల విశ్వోపకారులు
సాక్షి యున్నవాఁడు జగతిలోన
నట్టివారి నరులు నరయ రిదేలొకో, వి...1932

తే. వేదశాస్త్రపురాణముల్ వెదుక నేల ?
ఆది తుదియును లేకయ యచల మగును

సారమిది మించి వెలిగెడి సత్యమగును
వాదములఁ గానరాకుండి వరలు వేమ! 1933

ఆ. వెన్ను దగిలియుండు కన్ను గాననినాఁడు
చిన్ననాఁటినుండి చెలిమిఁ జూపు
అన్నదమ్ములకును నాప్తుఁడై యుండును, వి...

ఆ. వేదసార మెల్ల వెదకి తాఁ జూచియు
లీనమైన బ్రహ్మరీతి దెలిసి
పరము గనెడివాఁడు పరమాత్మఁ డగునయా, వి.

క. వేదాంతసారగుణ సం
వాదితుఁ డగు గురుని వేఁడి పరిపూర్ణుఁడవై
మోదంబున గుణినుంచుము
సాధనలో ముక్తి గలుగు సత్యము వేమా!

## గురుభక్తి పద్ధతి.

ఆ. అంజనంబు కనుల కంటించి చూచిన
సొమ్ముదొరకుభువిని సూత్రముగను
గురునినమ్మి కరుణ గుణమంటిచూడరా, వి...

ఆ. అన్నిదానములను నన్నదానమె గొప్ప
కన్నవారికంటె ఘనులు లేరు
ఎన్న గురున కన్న నెక్కువలేదయా, వి... 1938

ఆ. ఆత్మయందె దృష్టి ననువుగా నొనరించి
నిశ్చలముగ దృష్టి నిలిపెనేని
అతఁడు నీవె సుమ్మి యనుమాన మేలరా? వి.

క. ఇతరాపేక్షలు పోనిడి
సతతము గురుభక్తి యుక్తి సారముగనకే
గతి యగు బ్రహ్మానందము
మతి కింపుగ దొరఁకఁబోదు మహిలో వేమా!

క. ఇరుపదియాఱవతత్త్వం
బరయగ జీవాత్మునెలవు నఁబరమాత్ము
న్నిరువొందఁ గూర్చు గురుపద
మెరయంగా గురువటంచు నెంతురు వేమా!

ఆ. ఇహమునందు గురున కీదేహ మిచ్చిన
పరముఁ జూపి గుఱుతు బట్టియిచ్చు
స్థిరముగాను బుద్ధి చెడనీక చూడరా, వి...1942

ఆ. ఇహమునందు నేమి యిడుములఁ బడినను
బరమసాధనార్థపథము గాదు
గురునియుక్తి మీఱి గుర్తించి చూడరా, వి....

ఆ. ఇహము విడచి ఫలము లింపుగ గలవని
మహిని బల్కువారి మాట కల్ల
ఇహములోనె పరము నెసఁగుట కానరా, వి....

ఆ. ఈఘటమునందుఁ జూచియు
ఏఘటమున వింతె యనుచు నెఱుఁగక మదిలో

నేఘటముమీఁద వాంఛయు
మోఘుం బని కొనఁగవలయు ముఖ్యము వేమా!

ఆ. ఈదవచ్చు నేరు బాధ లేకుండనే
యాదిగురువు లేక యందరాదు
సోదిఁ జెప్పు టేల చొక్కినమది చూడు, వి...

తే. ఈషణాదుల నన్నిటి నీడ్చిపట్టి
మోసపోకయు మదిలోన గాసిపడక
రోసి బయలున జేరుట వాసి యగును
ఇట్టులగు నాతఁ డెన్నిక కెక్కు వేమ! 1947

క. ఉచితాహారమువల్లనె
యుచితంబుగ బుద్ధిస్థిరత నొప్పునటులనే
యుచితగురుబోధవల్లను
సుచరితుఁడై పరము గాంచు సువ్వుర వేమా!

క. ఉచ్చకు త్రోవగు తావున
ద్రచ్చంగా జగము పుట్టె తాతలనాఁడే
హెచ్చగు కులజుం డెవ్వఁడు
మచ్చిక మది దోయుమయ్య మాన్యత వేమా!

ఆ. ఉండునుండు జ్ఞాని యుగములు చనినను
ప్రాణహాని లేదు ప్రళయమునను
బ్రాణహానిరైన పరమాత్మ గలియురా, వి...

క. ఉడుగక క్రతువులఁ జపముల
నడవుల తీర్థములఁ దిరిగినంతనె ధరలో

నొడయని గనుగొనఁ జాలఁడు
కడుధీరత గురుఁడు సెప్పఁగలఁడిది వేమా! 1951
తే. ఉత్తమజ్ఞాననిలయమహా నుపము చేత
భక్తి సాధించి పూర్ణత బడయవచ్చు
ముక్తి కిరవగు గురునాజ్ఞ మొదటిదయ్యె
నది లభించిన సర్వంబు నబ్బు వేమ! 1952
తే. ఉదధి లంఘించి దాఁటినయుత్తముండు
మదిని రామాజ్ఞమీఱక మాయ లడఁచి
హృదయమందున రాముని బదిలపఱచె
నౌర మారుతి తత్త్వజ్ఞుఁ డగుట వేమ! 1953
ఆ. ఉన్నదన్న దెఱుక నూహను రెట్టించి
మన్ను మిన్ను నడుమ మాఱు లేక
యున్నవాఁడె పరము గన్నవాఁ డగునురా, వి.
ఆ. ఉపము చేత గురుని దపమునఁ జూడక
జపము చేయువాఁడు చపలుఁ డగును
నెపము వడక మించి నేర్పున జూడరా, వి....
ఆ. ఉపము గలుగునాతఁ డూఱకుండఁగ రాదు
గురునితోడ బొందు కూడవలయు
గురుఁడు సెప్పురీతి గుఱిమీఱరాదయా, వి...
ఆ. ఉపముతోడ గురుని నొప్పుగా సేవించి
జపము హృదిని జేయు జాడ లెఱిఁగి
తపముఁ జేయువాఁడు తత్త్వజ్ఞుఁ డగుయోగి, వి.

ఆ. ఉపము దోఁపనట్టియుపవాసముల లేదు
తపము చేయనైన తగులరాదు
జపములోన గురుని జవదాటకుండరా, వి...

ఆ. ఉబ్బి గురుని వేఁడి నిబ్బరపడువాఁడు
దబ్బరాడఁబోఁడు తత్త్వమున
నిబ్బరంపుమదిని నిర్వాణతను గాంచు, వి....1959

ఆ. ఉసురులేనితిత్తి యిసుమంత నూఁదిన
పంచలోహములును భస్మమగును
పెద్ద లుసురు మన్న పెనుమంట లెగయవా, వి.

క. ఎక్కడ వెదకిన తానై
మ్రొక్కను తా వెందు లేక మూలము తానై
చక్కగ నిర్భయుఁ డగుచును
నిక్కము నిన్నంటియుండు నిజముగ వేమా!

తే. ఎక్కువెట్టిన రూపము చిక్కువెట్టి
నిక్కఁబట్టుము నిజ మని సొక్కి ముట్టి
చిక్కగను బూర్ణమందుము చిక్కువెందు
గురుని బెడియ కుపాయంబు కుదురు వేమ!

ఆ. ఎట్టిమంత్రమైన నెంగిలి గాకుండు
బలుకవశము గాదు బ్రహ్మకైన
ఎంగి లెంగి లందు రీనాటితోడనే, వి... 1965

క. ఎడపక క్రతువులు తపములు
నడపులవాసంబు తీర్థయాత్రలచేయన్

ఒడయని ళ్లనుగొనఁజాలఁడు
కడువడి గురునిష్ఠ పరుఁడు కావలె వేమా! 1964

క. ఏపాపమైనఁ జక్కఁగఁ
బాపును గురుమర్మఘటిక బహుజన్మతతిన్
జూపట్టి యడఁగఁద్రొక్కుచు
కాపై మదిలోన వెలుఁగు ఘనమున వేమా!

ఆ. కపట ముడిగి గురునికై దండ యొనరించి
యుపముతోడ భక్తి నునికిఁ జేసి
తప మెఱింగినంత ధన్యత వాడమును, వి...

ఆ. కారుకారు గురులు కాగుణితముఁ జెప్ప
శాస్త్రపాఠములను జదివి చెప్ప
ముక్తిదారిఁ జూపు మూలము గురుఁడురా, వి.

తే. గుట్టుగురుభక్తిలో ముట్టి విఁట్టిపడక
జెట్టివలె బోరి లోమర్మ మిట్టి దనుచు
నట్టుపడఁ జూచి మించుట నాణె మరయ
పిట్టకబురులచే నేమి గిట్టు వేమ! 1968

ఆ. గురుచరణము బట్టఁ గుక్కలు గఱచునా
గురుచరణము విడువ గుక్క కఱచుఁ
గుక్కకున్న గుణము గురునకు లేదురా, వి...

క. గుఱిగాన లేక మర్త్యులు
పరిచితశాస్త్రముల వాదపద్ధతి గన ర

గ్గుటి గురువు జ్యోతి నిచ్చును
దరిదెలిసినవాఁడె యోగి ధరలో వేమా!.1970

క. గురుఁడగు నాత్ముఁడు శిష్యుఁడు
పరగంగా జీవుఁడనుచు బరికించుచు నీ
గురుశిష్యపరమయోగం
బురుతరముగ గూర్చువాఁడు యోగిర వేమా!

క. గురుఁ డనఁగ ధేనువై తగు
పరశిష్యుఁడు వత్స మగుచు వర్తింపంగా
దఱి గలిగినప్పు డొసఁగును
నిరుపమలక్ష్యామృతంబు నిజముగ వేమా!

క. గురుఁ డనఁగా బరమాత్ముఁడు
పరగంగా శిష్యుఁ డనఁగ బటుజీవుఁ డగుఁ
గురుశిష్యజీవసంపద
గురుతరమునఁ గూర్పు నతఁడె గురువగు వేమా!

క. గురుఁడనఁగా మొదలంతకు
గురుశిష్యు లనంగ నెల్ల కొమ్మలు కానం
గురువును గానఁగఁ జాతురు
ధరలోపల మనుజులెల్ల దలఁపగ వేమా! 1974

ఆ. గురువు శిష్యుఁ డనఁగ గొన లెట్టు మొద లెట్టు
గురువు శిష్యుఁ డనెడి గుఱుతు లెట్లు
గురునకుండఁ దగినపరువు లేకుండిన, వి....1975

ఆ. గుఱుతు గనుచుఁ జెప్పు గురు వెవ్వఁడును లేఁడు
గురుతెఱుంగు శిష్యనరుఁడు లేఁడు
గురుఁడు శిష్యుఁ డనుట గ్రుడ్డెద్దుచేనురా, వి.

ఆ. గురుని గూడు చేసి గుణము వత్తిగఁజేసి
సరవి గర్మసమితిఁ జమురు జేసి
మూల నొక్కజ్యోతి ముట్టించి చూడరా, వి.

ఆ. గుఱుతు తిథులవలనఁ గులమెల్లఁ జెడిపోయె
స్త్రీలనడతవలసిన సిగ్గుపోయె
నేహ్యపల్వలముల నిల యెల్లఁ జెడెనయా, వి.

ఆ. గురునితోడఁ బొందు గూడి యుండినవాఁడు
చేరి బ్రహ్మమంటి చెలఁగి యుండు
మఱుఁగు తెలిసెనేని మర్మంబు లేదయా, వి...

ఆ. గురుని నిందఁ జేసి గు ట్టెఱుంగనివాఁడు
యమునిబాధ నొందు క్రమముగాను
దేసెలోనియీఁగ తెఱఁగున నగునయా, వి...

ఆ. గురునిపరమగురుని గుఱుతుగా దెలియక
గురు వటంచుఁ దలఁప గ్రుడ్డిరీతి
గురునకు గురువైన గురుఁడు ప్రాణేశుండు, వి.

ఆ. గురుని శిష్యునియతి గుఱుతుగా మదిలోన
కానలేఁడు భ్రాంతి మానలేఁడు
గురునిశిష్యుఁ డెంచు గుటిలయదె యగునురా, వి.

తే. గురుపరంపర నీవిద్య గూఢ మెఱిఁగి

పరిమపరిపూర్ణ మందుట పరవశతర
నిరుపమానందసుఖకేళి నెఱపవలెను
బరశివుం డన భాసిల్లవలెను వేమ! 1983

సీ. గురుబోధ తెలియని కుటిలశాస్త్రంబులు
పరికింపగా నేమి ఫలముగలదు
ఆత్మైక్యమెఱుంగక యఖిలయోగంబులు
సాధింపఁగా నేమి సాధ్యమగును
తన్మయత్వంబును తాసెఱుంగనివారి
సేవఁజేసిన నేమి సిద్ధికలుగు
తుదిచే తెలుంగక చదువులు పెక్కులు
చదివిన ఫలమేమి సత్యముగను
తే. అనుచు సద్గురుబోధగా ననవరతము
వేయినోరులఁ జెప్పిన మాయజగము
వానిచేఁ జేయఁ జాతురు వాస్తవంబు
మదిని దెలియంగలేరిశు మహిమ వేమ! 1984

ఆ. గురువు తానయ్యెను గుణమించుకయు లేక
చందమామ కిచ్చె శాప మతఁడు
గురుఁడు కోప మూనఁగూడ దెప్పటికైన, వి.

తే. గురుముఖంబున నెఱిఁగిన గుర్తు విడక
నిస్తరంగసముద్రంబు నియత మనసు
నిలిపి యపరోక్షమందుట నిర్గుణంబు
దాన పరిపూర్ణసంతోష మాను వేమ! 1986

ఆ. గురువు కలుగు నాత్మ గురు తెఱింగెద మని
కాల మెల్ల రిత్త గడిపి రయ్య
గురువు దొరకునపుడు కూలు నీదేహంబు, వి.

ఆ. గురువు చిల్లగింజ కుంభ మీదేహంబు
ఆత్మకలుషపంక మడుగుఁబట్టు
తేరి నిలిచెనేని దివ్యామృతమ్మురా, వి.... 1988

ఆ. గురువు తా నయినను హరుని తాఁ జూపును
బ్రహ్మలోక మితఁడు హాఱఁజూపు
శిష్యు నణఁసి తట్టి చీకటి బాపురా, వి... 1989

ఆ. గురువునకును పుచ్చకూరైన నీయరు
అరయ వేశ్యకిత్తు రర్థ మెల్ల
గురుఁడు వేశ్యకన్న గుణహీనుఁ డగునొకో, వి.

ఆ. గురువు లేక విద్య గురుతుగా దొరకదు
నృపతి లేక భూమి నియతిగాదు
గురువు విద్య లేక గురుతరద్విజుఁ డౌనె? వి...

ఆ. గురుని శిక్ష లేక గుఱు తెట్లు కల్గునో
అర్జునికైన వానియబ్బకైన
తాళపుఁజెవి లేక తలు పెట్లులూడును, వి...

ఆ. గురువు వచ్చుచున్నఁ గూర్చుండి లేవని
తుంటరులకు నెట్లు దొరకు ముక్తి
మగని లెక్కగొనని ముగుద కాగతి పట్టు, వి

తే. గురువు సెప్పినయుక్తుఁలు కూడి మిగిలి

మఱవు లేదని నిజమాడి మహితుఁ డగుచు
నెఱవుచుండును శివయోగి నేర్పుతోడ
బరము సాధింప నతని కేర్పడును వేమ! 1590

ఆ. ఘటములోన నున్న గతు లన్నియును ద్రెంచి
దిటవు చేసి మనసు తేటపఱచి
ఘటము నిల్పువాఁడు ఘనతత్వయోగిరా, వి...

ఆ. చపలచిత్తవృత్తి సాధించి నిలిపినఁ
ద్రిపుటిబిలముఁ జేరు దెంపుగలిగి
జపము లోనిజపము జయశీలతను మించు,వి...

తే. చర్చమీఱినజ్ఞానంబు సంతరించి
మూర్ఛజెందినయట్లున్న ముక్తిగలుగు
గూర్చి మెచ్చఁడె గుఱిదాఁటి కోవిదుండు
తీర్చు గురుదరి జేరంగ దివిరి వేమ! 1593

ఆ. చెడుగుణంబు లెల్లఁ జేపట్టి శిక్షించి
పరమపదవి సిద్ధపడఁగఁజూపు
నట్టి గురుని వేఁడి యపరోక్ష మందరా, వి...

ఆ. చదువురా దటన్న సామాన్యత యిఁకేల
బుద్ధి కుదురకున్న బొంది కేల
గురుని గూర్ప ముక్తి కరతలామలకమౌ, వి....

క. చుట్టుకొనియున్న మాయను
నెట్టుము గురుభక్తి మీఱి నియతాత్ముఁడవై
ముట్టుము తత్పరతను మన

మట్టిట్టును జెందనీక మాన్యత వేమా! 2000

క. చూచెడివఱకే సాధన
చూచిన మది యందు దోఁచి సులభం బగునా
తోచెడిమర్మము నీవని
కాచుకొనియు గురుని గోరి కనవలె వేమా!

ఆ. ఛాత్రధర్మ మెఱిఁగి చక్కని భక్తితో
గురుని సేవఁ జేయ గుదిరినపుడె
సర్వమర్మములును జక్కగా విడిపోవు, వి....

ఆ. ఛాయనోసఁగుఁజెట్టు సాధువు బోధట్టు
లడఁగి దరిని జేరి బడయవచ్చు
నట్టునిట్టు దాఁట నది పోవు నిది రాదు, వి...

క. జగమున గురుఁ డుదయించిన
జగమునఁ గలజనులు శరణుశరణనఁ బోకో
జగ మెఱిఁగి మ్రొక్కఁ జూచెడి
నిగమాగమ నిర్వికారనిపుణుఁడు వేమా! 2004

ఆ. జననమరణము లన స్వప్నసుషుప్తులు
జగములందు నెండ జగములుండు
నరుఁడు జగమునంట నగుబాటుగాదొకో, వి.

తే. జాగుసేయక గురుసేవఁ జరిపి వాన
యోగయోగాంగముల నేర్చి యోగు లగుచు
ఆశలను మానుటను కాదె యచలతపము
సిద్ధిపొందును ముక్తికిఁ జేర్చ వేమ! 2006

ఆ. జ్ఞానులమని యంద్రు చపలాత్ము లగువారు
తెలివి లేకతమ్ము తెలియ లేరు
కష్టమైనయడవి గాసిలుచున్నారు, వి... 2007

ఆ. జ్ఞానమెన్న గురువు జ్ఞానహైన్యము బుద్ధి
రెంటిసందు రిమ్మ రేచునపుడు
రిమ్మ తెలిసెనేని రెండొకరూపురా, వి...

ఆ. జ్ఞానవంతునికడు కర్మసంబద్ధులు
వెఱ్ఱియంద్రు ప్రకృతి విడువలేక
వెఱ్ఱి కనని ప్రకృతి వెదకినఁ గల్గునా, వి...

ఆ. జ్ఞాని యనెడువాఁడు ఘనతేజమందును
బూని సుఖము జెందు పుట్టఁబోఁడు
తానె తానటయ్యు తనలోనె వెల్గును, వి...

ఆ. టీక వ్రాసిన ట్లనేకులు పెద్దలు
లోకమందు జెప్పి రేక మనుచు
కాకులట్టిజనులు కాన రీమర్మము, వి... 2011

ఆ. తత్త్వ మెఱుఁగువాఁడు దైవంబు నెఱుఁగును
సర్వసారములను జావఁ జేయు
కదళి మ్రింగువాఁడు గరళంబు మ్రింగఁడు, వి...

ఆ. తనదుమనసుచేత దర్శించి జ్యోతిష
మెంతఁ జేసె ననుచు నెంచి చూచు
తనయదృష్టమంత దైవ మెఱుంగఁడా? వి...

ఆ. తనవిరక్తి యనెడి దాసిచేతను చిక్కి

మిగిలి వెడల లేక మినుకుచున్న
నరుని కేడ ముక్తి వరలెడి చెప్పఁడీ, వి...2014

ఆ. తనివి దీఱ గురుని ధ్యానించి మదిలోన
దనువుమఱచి గురుని దాఁకి నపుడె
తనరుచుండు బ్రహ్మతత్త్వమందురు దాని, వి.

ఆ. తలఁపులోనఁ గలుగు దాదైన మేప్రొద్దు
తలఁచి చూడ నరయ తత్త్వ మగును
ఊరకుండ నేర్వ నుత్తమయోగిరా, వి...2016

ఆ. తలఁపులోనిమరులు తలఁపు లెఱుంగక
తలలు బోడులైన ధన్యు లేమి
తలఁపులోనితలఁపు తత్త్వమం చెఱుఁగుము, వి.

తే. తలవరులకైన నెప్పుడు ధర్మ మొప్పు
సామియానతిఁ జేయుచు తామెఱుఁగమి
గురులహితబోధ మీఱెడికూళలకును
నరకకూపంబె శరణమౌ యరయ వేమ! 2018

ఆ. తల్లిదండ్రిమీఁద దయలేనిపుత్త్రుండు
పుట్టి నేమి లేక గిట్ట నేమి
పుట్టలోనఁ జెదలుపుట్టదా? గిట్టదా? వి...2019

ఆ. తల్లిదండ్రు లెన్నఁదగు తొలిగురువులు
పార్వతీభవులిల పరమగురులు
కూలివాండ్ర జగతి గురులన ద్రోహము, వి...

ఆ. తల్లిబిడ్డలకును తగవు పుట్టించెడి

ధనము సుఖము గూర్చు నని గడింత్రు
కాని యెల్లయెడల ఘనదుఃఖకర మది, వి....
ఆ. తల్లి యాలు నయ్యె తగఁ గోడలును నయ్యె
గోడ లనఁగ నంగ గూఁతు రాయె
మాయవిడక ముక్తి మహి నీకఁ గల్గదు, వి...
ఆ. తాను నిర్మలుఁడుగ దనరుగుణము లన్ని
చేయలేని గురుఁడు చెడుగురుండు
గుడ్డితట్టు నెక్క గుణికినట్లగునురా, వి....2023
ఆ. తాను విమలుఁడైన దనగుణ మంతయు
శివున కీని గురువు చెడుగు గురువు
గుడ్డిగుఱ్ఱ మెక్కి గుడిఁ జుట్టినట్లగు, వి...
ఆ. తామసించి చేయఁ దగ దెట్టికార్యంబు
వేగిరింప నదియు విషమ మగును
పచ్చికాయఁ దెచ్చి పడవేయ ఫలమౌనె? వి...
ఆ. తిత్తిలోనిశివుని స్థిరముగా దెలియక
తిక్కపట్టి నరుఁడు తిరుగుచుండు
దిక్కుదెల్ప గురుఁడె యొక్కఁడె దిక్కురా, వి...
ఆ. తిరిగి తిరిగి నరుఁడు మరులు కొనుటె గాక
యందువలననేమి యధికమగును
అంతరంగ మెఱుఁగ నప్పుడు శివుఁడగు, వి...
ఆ. తొత్తుతోడిపొందు తొఱ్ఱిపెసలమూట
ముచ్చుతోడిపొందు తెచ్చు నింద

తలవరిదగుపొందు తలతోనె తీరురో, వి...

తే. తొల్లి జేసినపాపంబు తొలఁగుకొఱకె
పుట్టిచచ్చుచు మఱలను బుట్టుచుంద్రు
గురుని జేరియు వేఁడి తా గొల్చునేని
పుట్టుదుఃఖము బాడయి పోవు వేమ! 2029

ఆ. త్రాడు మెడకు వేసి తనకు శూద్రత్వంబు
పోయె ననెడి దెల్ల బుద్ధిలేమి
మది నిలునక త్రాడు మఱి వన్నె దెచ్చునా? వి.

ఆ. దగ్గఱున్నవాఁడు తప్పక దక్షుఁడు
ఎడము పడినవాఁడు దుడుకు గడుసు
అనుసరించువారి కయ్యెడు గార్యముల్, వి...

ఆ. దశగలారి నెల్ల తనబంధువు లటంద్రు
దశయ లేమి నెంత్రు తక్కువగను
దశ యనంగను ధనదశ యొక్కటే దశ, వి....

ఆ. దర్శనంబునందు ధర షణ్మతములందు
వర్ణ మాశ్రమమును వదల కెవ్వఁడు
తిరుగుచున్నవాఁడు ధరలోన నజ్ఞాని, వి...

ఆ. దాత లేనికొంప దయ్యాలపెనువాడ
నీతి లేనిమాట రాతివేట
ప్రీతి లేనిలంజె ప్రేతవాహనమయా, వి...2034

ఆ. దాస రనఁగవచ్చు వేసార్లకైనను
జంగ మనఁగవచ్చు లింగ మున్న

బాప డనఁగరాదు పదివేలకైనను, వి... 2035

క. దినముల వ్యర్థము పుచ్చక
కనుచుండుమి యాత్మ నెపుడు ఘనగురుబోధ
న్నినుసీ వెఱుఁగక యున్నను
గొనకొని మది చెఱచుసిన్ను గొబ్బున వేమా!

తే. దురితముల నెల్ల ఖండించుగురుని జేరి
పరమనిర్గుణమననంబు ప్రాఁకినంత
గురుతరంబుగ గుణములు కొట్టువడును
పరశివుం డన భాసిల్లు ధరను వేమ! 2037

తే. దివ్యపరతత్త్వ మనుజ్ఞప్తి ధీజయుండు
మరలి పుట్టనిగురుభక్తి మహిమతోడ
నక్షయాత్మకపరమంది యమలుఁ డగును
ఏమలిన మాతనికి నంట దెపుడు వేమ! 2038

తే. దివ్యమైనట్టి పరశివతేజ మూని
భవ్య మగుయుక్తి మదిలోన భద్రపఱచి
సేవ్యుఁడై యుండుటేముక్తి స్థిరముగాను
కావ్యముల రాదు గురుబోధ కలదు వేమ!

ఆ. దేవభూములందు దేవాలయములందు
దేవుఁ డనుచు మ్రొక్కి తెలియలేక
తిరుగుచుండువాఁడు దేవాదిదేవుఁడా, వి...

ఆ. దేహ మాత్మరూపు తేటతెల్లము జేసి
యవలి చూపు జూచు నతఁడె గురువు

భ్రమరము తనరూపు క్రిముల కిచ్చినరీతి, వి...

తే. దేహ మాత్మలు వేఱని తెలియలేక
మోహమునఁ జిక్కి నిద్రలో మునుఁగు టేల?
సాహసంబున గురుభక్తి సలుపవలెను
వివర మాతండు దెలిపెడి వేగ వేమ! 2042

ఆ. ధర్మమునకు గీడు తలఁచినవాఁడు తా
దుష్టుఁ డగుచు తుదకు ద్రోహియై చెడు
గురువుపత్ని గవయ గోరెడునీచుండు
మొదలు చెడఁడెముప్పు మూఁడి వేమ! 2043

ఆ. నిజగురూపదేశ నిశ్చయాత్మకవిద్య
రక్షకం బటంచు రాజవీథి
మధ్యమార్గమందు మాన్యతఁ జూడరా, వి...

ఆ. నిజము కల్ల రెండు నీలకంఠుఁ డెఱుంగు
నిజము లాడకున్న నీతి దప్పు
నిజములాడునపుడు నీరూప మనవచ్చు, వి...

క. నిందించు భ్రమలఁ జెందక
పొందినమదిఁ జేర నొక్కి పోడిమితో నీ
వందుకొని గురురహస్యము
సందియ్యక పూర్ణుఁ డగుము సరగున వేమా!

తే. నిరత మాత్మచిదానందనిలయమందు
సరవితోడుత పరిపూర్ణసౌఖ్య మెఱిఁగి
యరిది యగుభయ లేరుట యనుభవంబు, వి.

ఆ. నూటెనిమిదిగళ్ల నోముల పుణ్యాలు
కలవా జీవులకును గణనలేదు
చెడినసీళ్లు నదుల చేరెడినట్లయా, వి... 2048

ఆ. నూఱు పలుకవచ్చు నుడి వ్రాయఁగారాదు
వ్రాఁతకన్న సాక్షి వలవ దెన్న
బరగ లేనివ్రాఁత భంగపాటుం దెచ్చు, వి...

ఆ. నేర్చి నడతు నన్న నేరమి తా వచ్చు
నోర్చి నడతు నన్న నోర్వరాదు
కూర్చి నడతు నన్న కూడంగ నీయదు, వి...

ఆ. పట్టుగొమ్మ వదలి పలవింప నేటికి
ఇట్టె గురుని వేడి గుట్టు నెఱిఁగి
నిట్టనిలువు గాంచి నిర్గుణ మందరా, వి. 2051

ఆ. పడఁతి మోసె నొకఁడు పడఁతి మెసె నొకండు
పడఁతి నురము జేర్చి బ్రదికె నొకఁడు
పడఁతికొఱకె పెక్కుపాట్లను బడిరయా, వి...

ఆ. పడుచుమాటలాడి పరితపింపఁగ నేల
వెడగుచర్య లడచి వేఁడి గురుని
యడుగులంటిమ్రొక్కియాపనువిడఁద్రొక్కు, వి

ఆ. పడచు నూరకేలఁ బార చూచెదరొక్కొ
యెంతవారలైన భ్రాంతి నొంది
లోన మీఱుకామ లొంగఁజేయఁగలేక, వి.

ఆ. పరఁగ దేవుఁ జేసి ప్రజలను మ్రొక్కించి

తొక్కుభూమి కెల్ల దొరను జేసి
మనుజవరులకు నిల మాంగల్యమును జేసి
యాజ్ఞచేసి యేలె నతఁడు వేమ! 2055

ఆ. పరఁగ నింతదనుకఁ బడినపాటెఱుఁగఁడో
ఘనత నొప్పమనుజుఁ డనఁగఁ బుట్టి
కీడు మే లెఱుఁగక క్రిందగు చిత్రము,వి...

ఆ. పరధనంబులకును ప్రాణము లిచ్చును
సత్య మింత లేక జారుఁ డగును
ద్విజులమంచు నెంత్రు తేజ మించుకలేదు, వి.

ఆ. పరపురుషునిమీఁదఁ బ్రాణంబు వెట్టుక
మగువ సేయుచుండు మంచితనము
అట్టిభంగి యోగి యాత్మ భావించును, వి...

క. పరమాత్మునిచింతనలోఁ
దఱుచుగ నుండుట యె తగును ధర నొక్కటికిన్
దిరిపము నెత్తి భుజించుచు
దొరవలె గృహవేదికందు తొంగుము వేమా!

క. పరిపక్వ మొప్ప శిష్యున
కురమందలి బయలు చూపి యుద్ధతి మీఁజన్
పరిపూర్ణ మందఁ జేసెడు
గురుఁడు పరబ్రహ్మమైన గుణసిధి వేమా! 2060

ఆ. పరులవిత్తమందు భ్రాంతి వాసినయట్టి
పురుషుఁ డవనిలోనఁ బుణ్యమూర్తి

పరులవిత్త మరయ పాపసంచితమగు, వి...

ఆ. పక్షిజాతి బట్టి పరఁగ హింసలు బెట్టి
గుళ్లు గట్టి యందు గుదురఁబెట్టి
యుంచువారి కట్టివంచన రాదొకో, వి... 2062

క. పాదుకొని హృదయమందును
సాధారణవృత్తు లడఁచి సన్నుతిగను జీ
వాధారచక్రమందును
మోదంబున విఘ్నపతికి మ్రొక్కుము వేమా!

ఆ. పాలగలియు నీరు పాలెయై రాజిల్లు
నట్లు గురునివలన కోవిదుఁడగు
సాధుసజ్జనముల సంగతు లిట్లురా, వి... 2064

ఆ. పాలనీటికలఁత పరహంస మెఱుఁగును
నీరుపాల నెట్లు నేర్చు నెమలి
అజ్ఞుఁడైన హీనుఁ డలశివు నెఱుఁగునా, వి...

ఆ. పాలప్రియము చేతఁ బరఁగ నేడ్చెడిబిడ్డ
క్షుత్తు దప్పుల కిల శోకపడఁగ
దల్లిపనులు తీర్చి తనయుని ముద్దాడు, వి...

ఆ. పాలరాళ్లె దెచ్చి పరఁగంగ గుడిగట్టి
చెలఁగి శిలల పూజ చేయుచుంద్రు
శిలలసేవఁ జేయఁ జిక్కున దేమిటి వి... 2067

ఆ. పాలు పెరుగు వెన్న పాయసంబును నేయి
జున్ను లెన్నియైనఁ జూడ పాలె

పాలవంటికులము బ్రహ్మంబు గానరో, వి...

ఆ. కల్లలాడుకంటె కష్టంబు మఱి లేదు
కష్ట మెపుడొ కీడు కలుగఁజేయు
ద్విజుఁడ ననుట చూడ త్రిమ్మరితనమురా, వి...

ఆ. కల్లుద్రాగువాని కల్లుముచ్చనరాదు
కల్లలాడువాఁడె కల్లుముచ్చు
కల్లుద్రాగుకంట కల్లలాడుట కీడు, వి... 2070

ఆ. నిజము లాడునతఁడు నిర్మలుఁడై యుండు
నిజము నాడునతఁడు నీతిపరుఁడు
నిజము బల్కకున్న నీచచండాలుఁడు, వి...

క. పగ లుడుగ నాశ లుడుగును
వగ పుడుగం గోర్కె లుడుగు వడి జన్మంబుల్
తగు లుడుగు భోగ ముడిగిన
త్రిగుణంబును నుడుగ ముక్తి తెరువగు వేమా!

ఆ. పుట్టు పుట్టలేదె పుడమిని జనులెల్ల
పుట్టి గిట్టలేదె పూర్వు లెవరు?
పుట్టి గిట్టు టెల్ల వట్టి భ్రాంతులు సుమీ, వి...

ఆ. పూసపోగుపసిఁడి పుష్పంబు మొదలగు
సంపద గలవాఁడు జగతియందు
హీనకులజుఁడైన హెచ్చనియందురు, వి...2074

ఆ. పెట్టి పోయలేని వట్టిదేబెలు భూమి
బుట్టిరేమి వారు గిట్టిరేమి

పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా, వి... 2075

ఆ. పొత్తు గుడువ వచ్చు పుత్రుఁడే వయసైన
దొత్తుకొడుకు నెంగి లెత్తుకుంద్రె
కాని వానిజోలిఁ గాన రీరీతిగా, వి... 2076

ఆ. ప్రభువు క్రోతిఖైన ప్రగ్గడ పంజియా
సైనికుండు పక్కి సేన పసులు
నేన్గు లశ్వములును నెలుకలు పిల్లులు,వి. 2077

ఆ. ఫణికి గోర లుండ భయ మొందునట్టులే
వెరతు రయ్య దుష్టవిభవమునకు
కోరలూడఁ ద్రాఁచు మీఁటునా దుష్టత, వి...

ఆ. బాపఁ డనఁగ నేమి భక్తుఁ డనఁగ నేమి
జోగి యనఁగ నేమి స్రుక్క నేమి
ఇన్ని యేల వెనుక నినజుండు పని దీర్చు, వి ..

ఆ. బాలచనులఁ బూలబంతులఁ బోల్తురు
ప్రాలుమాలినట్టి భ్రాంతు లవని
మాంసఖండమందు మఱి యేమి యున్నది? వి.

ఆ. బాల్యమందు తాను బహువిధముల పట్టి
చప్పరించినట్టి స్తనములకును
మోహ మింత యేల మూఢాత్మ తెలియరా,వి.

ఆ. బూతులేనిలంజె భూతంబు కూఁతురు
ప్రీతి లేనిపాటు చేతచేటు
దాత లేనియూరు దయ్యాలపేటరా,వి. ..2082

ఆ. బ్రాహ్మణునకు మ్రొక్క బహుదీవన లొసంగు
నాత్మశుద్ధి గలుగు నాతఁడైనఁ
గలుగు నన్ని కామి గంతశోషయె సుమీ, వి.

క. భక్తికి మూలము జ్ఞానము
రక్తిగ గురు చెంతఁ జేరి రక్షకునిసంతన్
యుక్తిగ నెఱుకై తోఁచును
ముక్తికి నిలయమగు దారి మునుకొని వేమా!

ఆ. బత్తి లేక లంజె పలుమారు పిలచిన
బత్తి గాదు లయపుమిత్తిగాని
మిత్తి చొరఁగ నిల్లు మ్రింగక పోవునా? వి...

ఆ. భక్తి ముక్తి గలుగు భాగ్యంబు గలుగును
చిత్త మెఱుఁగుపడఁతిచెంతఁ బతికి
జిత్త మెఱుఁగనిసతిః జేరంగరాదురా, వి...

ఆ. భక్తి యున్నచోటఁ బరమేశ్వరుండుండు
భక్తి లేనిచోటఁ బాపముండు
భక్తిగలుగ వాఁడు పరమాత్ముఁడగునయా, వి.

ఆ. భగము గోరువారె పలువురు గాన్పింత్రు
భగము గోరకున్కి జగతి లేదు
భగము గలుగువాఁడు భగవంతుఁడగునయా,వి.

క. భల్లుకము లోఁలి ప్రాజ్ఞులు
యిల్లోకమునందు గురుని నెఱుఁగరు తమలో
ముల్లోకము లెఱిఁగినటుల

గొల్లున బొగడుకొనుచుండ్రు గొనకొని వేమా!

ఆ. భవుఁడు చిత్రముగను భార్యల మోయును
అట్లు మోయగలుగు దిట్ట మైన
అతనివలెనె బూది యలఁదిన మెఱుఁగగు, వి.

తే. భోగభాగ్యంపుసుఖములఁ బొందవచ్చు
రాగవైషమ్యములనెడు దీగె దెంచి
వేగ మదియందు గురుభక్తి సాగనిమ్ము
యోగివరులకు దీటుగా నుందు వేమ! 2091

తే. భ్రాంతిచేతను మర్త్యులు భక్తి విడువ
భయదమౌ పుట్టుచావులు ప్రాప్తములగు
నిట్టినరులకు కష్టంబు లెట్లు తీఱు
గురుని సన్నిధి తీర్చునా కొఱత వేమ! 2092

ఆ. మంటలోహములను మ్రానుచీలలయందు
పటముగోడలందు బరగ నిసుక
బెట్టునంటునట్లు పెనఁగుదేహము జీవి, వి...

ఆ. మంటిలోనఁ బుట్టి మంటిలోనఁ బెరఁగి
మంటిలోనె తిరిగి మనుజుఁ డాయె
మన్ను మంటిఁ గలుప మనుజుఁడే తత్వము, వి...

ఆ. మఠములోనియోగి మాయ లన్నియు గోసి
ఘటములోన నున్నఘనుని దెలిసి
మాటమాటకు గురు మఱువక తెలుపురా, వి.

ఆ. మంత్ర మొకటి చెప్పి మఱి దేవతార్చనఁ

జేసి కరుణ తమకు జెందినదని
వేదపఠనఁ జేసి వెఱ్ఱులై పోదురు, వి... 2096

ఆ. మతిని గానలేరు మఱి బ్రహ్మమూర్తిని
మదిని గన్నవారు మహిని లేరు
వెదకి తనువులోన వేడ్కతో నెఱిఁగిన
యతఁడె యోగివర్యుఁ డంద్రు వేమ! 2097

ఆ. మదమువలనఁ గలుగుమాటల మఱి బల్కి
ముచ్చుసుద్దుల నొగి మోసపుచ్చి
కాసురాఁ బెనఁగెడు కష్టుండు గురుఁడౌనె? వి...

ఆ. మదిఁ గలిగినపూజ మదనారి మెచ్చును
మనసు నిల్పినంత మహితుఁ డగును
మనసు లేనిపూజ మట్టిసమానము, వి... 2099

ఆ. మనసులోనఁ బుట్టు మదికోర్కె లన్నియుఁ
గోర్కెలందు ముక్తి కుదురుపడదు
మనము బ్రహ్మమనుచు మది నెఱుంగఁగ లేరు,వి.

ఆ. మనసునందు ముక్తి మఱి యెఱుంగఁగ లేక
మనసుచేతఁ దగిలి మాయ మైరి
మనసు తానయైన మర్మజ్ఞుఁ డగుయోగి, వి...

ఆ. మనసులోనివాని మనసులోనె కలిసి
మనసులోనివాని మగ్న మంది
మనసుఁ దెలియువాఁడు మర్మజ్ఞుఁడై యుండు,వి.

ఆ. మనసులోనె పుట్టె మాయసంసారము

మనసు విఱిగె నేని మాయ తొలఁగు
మనసు నిల్పె నేని మహి దాని బ్రహ్మము, వి.

ఆ. మన్ను కుప్పఁ జేసి మంటిలో గోరాడి
మంటికుండ నంటి మరగి తిరిగి
మన్ను మంటఁగలియ మఱియెందుఁబోయెనో,వి.

క. మని యుండెడిజగ మెల్లను
చనిపోయినవారిపుణ్యసత్కథ లెలమి
న్వినవలె మనవలె చనవలె
ననిమిషులకు నైన తెలియ దంత్యము వేమా!

ఆ. మనసు వాక్కు కర్మ మఱియేమి లేకయె
రాకపోక లేని రాజవీథి
పరఁగ హాని కలదె పరతత్త్వయోగికి, వి...

క. మనసే మాయామృగమా
మన సేమిటి పైకిఁ గాని మఱిపోనీకా
మనసున మనసును జంపిన
మనసందే ముక్తి గలదు మహిలో వేమా!

ఆ. మన్ను పాఱఁ బట్టి మన కేమిలాభము
ధాన్యమట్లు చేయఁదగును గాని
ఘనునిలోప మెన్న గారాదు విడువుము, వి...

ఆ. మన్ను మిన్ను నంటి మహిమీఁద నొకకోట
కొమ్ము లమరియుండుకొనలు మిగిలి
దివ్వె లేనివెలుఁగు తేజరిల్లుచు నుండు, వి...

క. మాటల మాటలు వచ్చును
మాటలనే కలుగుచుండు మణిమంత్రంబుల్
మాటలపొందిక తెలిసిన
మాటలనే ముక్తికలుగు మహిలో వేమా!

ఆ. మాదిగ యనఁగనె మఱి తక్కువందురు
మాదిగ యిలసురల మామగాదె
మాదిగకును బిడ్డ మనయరుంధతి గదా, వి...

ఆ. మాయ నరక మనుచు మాయ రోయక సాటి
సమముగ నరదేవసభలయందు
నందఱు ఘనులైన హరునకు దా వేఁ? వి...

ఆ. మోహమునను గురుముఖ్యులకరుణచేఁ
దొమ్మిదిస్థలముల దొడువాయ
సర్వజీవుఁ డాయె సర్వంబు తా నాయె, వి...

ఆ. మోహజలధిలోన మునిఁగి చచ్చుటె కాని
హరిపరాయణత్వ మమరఁబోదు
ముట్టిగురుని పాద మూలము నొందుము, వి.

ఆ. మోహమనెడి బుద్ధి మూలంబు నెఱిఁగి తా
మోహరించి గురునిమోముఁ జూచి
మోహమందు ముక్తి ముక్కొను నిక్కము, వి.

ఆ. యోనియందు బుట్టి యుత్తమకులజుఁడై
బ్రహ్మకులమునందు బ్రదుకుచుండ్రు
బ్రహ్మ నెఱుఁగలేక పడి చత్తు రిదె వింత, వి.

ఆ. రద్దిమాని మనసు రాపాడి ధ్వనిఁ జూపి
ముద్దుగులుకునాత్మ మూల మంది
సద్దు సేయకున్న సంసారి యోగియా, వి...

ఆ. రాకపోక లడఁచు రాజమార్గముఁ బూని
నాక మనెడిగుర్తు నీక నెఱిఁగి
పోకి మించ బయలు సూత్రంబు గాదొకో? వి.

ఆ. రాకపోక లేని రాజమార్గములోన
నేకరూపు దలఁచి యెన్ను టరుదు
పోకి పోకి మాయ పొక్కించు టరుదురా, వి.

ఆ. రాజయోగమాని తేజ మందుట ముక్తి
తేజ మందకున్న దేబెలె కప
మర్మ మంత లేక మహి గురుఁ జూడుము, వి.

ఆ. రాజయోగమునను రాజత్వమును బొంగి
రాజరాజు దొడ్డరా జనంగ
రాజయోగమునని రాజశేఖరుఁ డాయె, వి....

ఆ. రాజసంబుచేత రాజ్యభారం బందు
నోర్పు లేనియాతఁ డుభయతఁ జెడు
నీటిపైన గుండు నిలుచునా మునుఁగక, వి....

ఆ. రాజసంబు జెంది రమణులపొందాస
పడెడువాఁడు గురునిప్రాపెఱుఁగునె
విటులమరుగుయువతి విభుభక్తియెఱుఁగునా? వి.

ఆ. రూఢిగాను భక్తి రూపించి చెప్పిన

వాఁడె పరమగురుఁడు వసుధలోన
వేఁడి పరము గనుటె వేదాంతవేద్యము, వి...

ఆ. రూఢి మదిని మించి రొదవినఁ జాలక
కాఁడు జేర నేమి ఘనము గలుగు
నీటిలోన రసము విన్నంద వినుచుండు, వి...

ఆ. రోగియైనవాఁడె రోగి నెఱుంగును
రోగి నరసి చూచి రూఢిగాను
రోగి కిడినవాని రాగి బంగారమా, వి... 2126

ఆ. లజ్జలజ్జ యనుచు లలనలమీఁదికి
లజ్జ విడిచి తిరుగు లావరియయి
లజ్జ తెలిసె నేని లలనలఁ దాఁకునా? వి... 2127

ఆ. లేఁడు లేఁ డనినను లేఁడు లేనే లేఁడు
కాఁడు కాఁ డటన్న గానెగాఁడు
తోడు తో డనినను దోడనే తోడగు, వి...

ఆ. లోకమందుఁ బుట్టి లోకమందె పెరిగి
లోకవిభవ మోర్వలేక జనుఁడు
లోకమందు జవికి లోఁబడి చెడిపోవు, వి...

ఆ. లోకములకు గురువు లోకులకును గురు
వదియుఁ దెలిసి మోక్షమందఁ గోరి
గురుని గనక నరకకూపముఁ జెందును, వి...

ఆ. లోను జూచినతఁడు లోకంబు లెఱుఁగును
బయలఁ జూచినతఁడు పరమయోగి
తన్నుఁ జూచినతఁడు తానె తాను సర్వము, వి.

క. వంచనచేసెడి యెఱుకను
మించినపరతత్త్వ మమరు మేలిమి గన నా
శించును గన్గొని యుండిన
సంచారము లేనిబయలు సరగున వేమా! 2132

ఆ. వట్టిమమతఁ జిక్కి వావివరుస లంచుఁ
దిక్కుపట్టి నరుఁడు తిరుగుఁ గాని
యెక్కుడితలిదండ్రు లేమియుఁ దన కేల? వి.

ఆ. వక్షమందు గురుని వర్ణించి చూడరా
రక్షకత్వమునకు రాచబాట
అక్షమాల జపమె యవని దొంగలరీతి, వి...

ఆ. వాక్కువలనఁ గలుగు వరమగు మోక్షంబు
వాక్కువలనఁ గలుగు వరలు ఘనత
వాక్కువలనఁ గలుగు నెక్కుడై శ్వర్యముల్, వి.

ఆ. వాక్కునందు గురువు వక్తృతను గురువు
చీఁకటినటు గురుఁడు చిక్కియుండు
అఖిలమునకు గురువె యాధారమై యుండు, వి

ఆ. వారకాంత లెల్ల వలపించి వత్తురు
బుద్ధులెల్ల తొలఁగఁ బుచ్చుకొఱకు
మాట రూఢిగాఁగ మగ లెల్ల వత్తురు, వి. 2137

ఆ. విటునిఁ జేరఁ గోరి వీథిని మది నుంచు
పడఁతిరీతి పరము బ్రాఁక నగును
గుణము లన్ని మఱచి గుర్తించి చూడరా, వి.

ఆ. విటులఁ జూడఁగానె మటుమాయఁ జేయును
కిటికియందుఁ జేరి కేకరించు
పటిమ మీఱ స్త్రీలఁ బరికింప లేరయా, వి...

ఆ. వెఱపు లేక గురుని వేఁడుచు వేసారి
స్థిరముగాను పూజ చేసి చేసి
వరము గన్నవాఁడు పరిపూర్ణ యోగిరా,వి...

## ప్రపంచస్వభావ పద్ధతి.

ఆ. అండములను బుట్టునలరు ప్రాణులు కొన్ని
బుద్బుదములఁ బుట్టు పురుగులెల్ల
స్వేదములను బుట్టు జీవులు కొన్నిరా, వి....

ఆ. అందె యింద్రజాల మయ్యె లోకంబులై
మించె నొకటికొకటి మింటియందు
తన్నుఁ దానె జూడ తలఁపులు మఱచెను, వి...

ఆ. అన్ని జాతులకును నాధార మైనట్టు
లున్నసాన గాది మన్నెబుషుల
నెన్ని జన్మములను నెక్కడగానము, వి... 2143

క. అరిషడ్వర్గంబులచే
నరు లెల్లను జిక్కి సొక్కి నైజము విడకే
యరుగుదురు గాక యెఱుఁగక
మఱుఁగైనది బ్రహ్మమనుచు మహిలో వేమా!

ఆ. ఆలివంకవార లాత్మ బంధువు లైరి
తల్లివంకవారు తగినపాటి
తండ్రివంకవారు దాయాదు లైరయా, వి...

ఆ. ఆలి నొంచలేక యధమత నొందుచు
వెనుక నుంటి ననుట వెఱ్ఱితనము
చెట్టుముదురనేని చిదిమిన బోవునా? వి...

ఆ. ఆలు రంభ యైన నతిశీలవతి యైన
జారపురుషుఁ డేల జాడ మాను
మాలవాడ కుక్క మరగిన విడుచునా? వి...

ఆ. ఇచ్చి పుచ్చుకొన్న హితులును మనువులు
తగ్గు లేక యల్లుఁ దామరవలె
కాచి పూచి పండి కడు రమ్యమై యుండు, వి.

ఆ. ఇలను శూద్రు లౌట నెఱుఁగరు మొదలను
మనసు నతనిమీఁద మరులుకొల్పి
కొల్వఁగారొ ద్విజులు కోటానుకోట్లుగా, వి....

ఆ. ఈకె లంటఁ జేసెఁ దోఁకలంటఁగఁ జేసె
గోక లంటఁజేసె లోకమునకు
మానరక్షణంబు మర్యాద యని తెల్ప, వి...

క. ఈఘనసూత్ర మెఱుంగుము
నీఘటమున శివుఁడు జేరి యిరవుకొనంగా
నేఘటపటముల కందక
తా ఘనుఁడై యాడుచుండు తథ్యము వేమా!

క. ఈచెవిగోఱికిన నొల్లరు
వాచవులకు విందు మన్న వాక్యంబులచే
పూచను బడుచులు వెఱచిన
ఆచందము లాయె జగము లన్నియు వేమా!

క. ఈతనువునందుఁ జూచిన
నేతనువుల కింతె యనుచు నెదిరిని దన్నుం
జూతురు లోఁగాఁ జూపున
నాతురముగఁ దపసు లెల్ల నమరఁగ వేమా!

ఆ. ఉత్తమోత్తముఁ డగ్గు నుర్వి తత్త్వజ్ఞుఁడు
మహిమ జూపువాఁడు మధ్యముండు
వేషధారి యుదరపోషకుఁ డధముండు, వి....

ఆ. ఉదకమందు మొసలి యుబ్బి యేనుఁగుఁ బట్టు
మతక మే మొ బయల మసలబోదు
ఎఱుక మఱుఁగుఁ దెలిసి యేకమై యట్లుండు,వి.

ఆ. అనయ మీసు బాపి యనలంబుఁ జలార్చి
గోఁచి బిగియఁగట్టి గోప మడఁచి
యాస విడచెనేని నతఁడు దా యోగియౌ, వి.

ఆ. అన్నము తినువేళ నాత్మ రుచుల గోరు
మదియు నాల్క సెప్ప నడుగుచుండు
ఆత్మకు తృణమైన నయ్యారో యనరాదు, వి.

ఆ. ఆశకన్న దుఃఖ మతిశయింపఁగ లేదు
చూపు నిలుపకున్న సుఖము లేదు
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి.

ఆ. ఆశ గననివాని నాశ్రయింపఁగ రాదు
ఆశ దీర్చువాని నడుగవలయు
ఆశ గలుగునంత కమలుండు గాఁడయా, వి....

ఆ. ఆశ గోసి వేసి యనలంబు చల్లార్చి
గోఁచి బిగియఁగట్టి కోప మడఁచి
యాస విడుచునాఁడు నగు నిల యోగిగా, వి.

ఆ. ఆశచేత మనుజు లాయువు గలనాళ్లు
దిరుగుచుండ్రు భ్రమలఁ ద్రిప్ప లేక
ముఱికిభాండమందు మూసరు నీఁగలభంగి, వి.

క. ఆశను విడువనిజీవికి
క్లేశము విడిపింప దరమె కేశవునకు నా
యాశాపాశము లెల్లను
రోసిన క్లేశంబు విడుచు రూఢిగ వేమా! 2162

ఆ. ఆశపాపజాతి యన్నిటికంటె నా
యాసచేత యతులు మోసపోరె
చూచి విడుచువారు శుద్ధాత్ము లెందైన, వి...

ఆ. ఆశపాశము మొదలంటగా దెగఁగోసి
పారవేయకున్న ఫలము గలదె
కొక్కుబోనులోనఁ జిక్కినచందము, వి...2164

ఆ. ఆశపాశ మెల్ల గోసి వేసినవాని
చిత్త మెపుడు గురుని చేరియుండు
మోహపాశ మున్న మోక్ష మెక్కడిదయా? వి.

ఆ. ఆశయనెడిదాని కోసి వేయఁగ లేక
మోసబుద్ధివలన మునుఁగువారు
కాశివాసులైనఁ గనఁబోరు మోక్షము, వి...

క. ఆశయె యిహపరసౌఖ్యవి
నాశము భవబంధములకు నయముగ తానే
యీశుని గనుఁగొన నీయదు
ఆశవినాశంబె పరమ మవనిని వేమా! 2167

ఆ. ఆశలనెడిత్రాళ్ల నఖిలజనంబులు
కట్టుపడుచు ముక్తి గానరైరి
జ్ఞానఖడ్గమునను ఖండింపరాదొకో, వి... 2168

ఆ. ఆశ లుడుగఁ గాని పాశముక్తుఁడు గాఁడు
ముక్తుఁ డైనఁగాని మునియు గాఁడు
మునియు నైనఁగాని మోహంబులుడుగవు, వి.

ఆ. ఇంత వగవ నేల యేకాంతబుద్ధిని
హరిహరాదులందు నాస లుడిగి
వాసన దెలిసినవాఁడెపో బ్రహ్మము, వి...2170

ఆ. ఇంద్రపదవి గోరి యింపుగా యజ్ఞముల్
కలిమిచేతఁ జేసి కాముతైరి
పరమయోగ మూని పట్టఁగలేమిని, వి...1171

క. ఇది నాకుఁ జాల దనుచును
మదిలో దా నెపుడు దలఁచి మమతగను మతిం
పొదలుచు విడువం జాలని
దదియే సంసారబీజ మనఁబడు వేమా! 2172

ఆ. ఇదియె పరమటంచు మదికి దోఁచినఁ జాలు
మనసు చెదరుకోర్కె మట్టుపఱచి
సుధను గ్రోలువాఁడు సుడిఁబడి చచ్చునా? వి.

ఆ. ఎక్కడైన యాశ లినుమడియై యుండఁ
దిక్కపట్టి నరుఁడు తిరుగుచుండు
కుక్కవంటియాస గూర్చుండ నీయదు, వి...

సీ. కమలభవాండంబు కర్పటం బది యెంత
దానిలోపలి జగత్త్రయ మదెంత
దానినాల్గవపాలు ధారుణి యది యెంత
దీనియేడవపాలు దీవి యెంత
యందు తొమ్మిదవది యగుతునియ యదెంత
యాతునియలభాష లమితమయ్యె
అట్టిభాషలతోడ ననువుమీఱఁగఁ గడు
పొలుపొందుచున్నట్టి భూము లెన్ని

తే. అట్టిభూముల నేలువా రమితనృపులు
ఘనులు పెక్కండ్రుగలరని కడకు నెఱిఁగి
యొకరిదయ చాలగానమ్మి యుండుమనుజు
విభవ మేమనఁగావచ్చు వెఱ్ఱివేమ! 2175

క. కన్నెల నవలోకింపఁగ
జన్నులపై దృష్టిపాఱు సహజం బిలలో
కన్నుల కింపగుదృష్టిని
తన్నెఱుఁగుట ముక్తికిరవు తగునిది వేమా! 2176

ఆ. కన్నె వరుఁడు చేరి కదియంగ నొక్కప్పు
డుచ్చుయందు పిండ ముద్భవించు
హెచ్చుకులజుఁ డెవఁడు హీనుఁ డెవ్వండురా, వి.

ఆ. కమలభవుఁడు సేయుఁ గడుసృష్టి యందురు
హరి భరించు చంపు హరుఁ డటండ్రు
మూర్తు లిందఱైన మూల మొక్కటియెరా, వి.

ఆ. కల్య మారగించి కన్నులు ముకుళించి
బిఱ్ఱబిగిసియుండు బీదయోగి
మేఁకపోతువలెను మెఱమెచ్చులకు నయి,వి...

ఆ. కలిగినట్టులుండు కలుగక యుండును
మఱియు లేక యుండు మఱియుఁ గలుగు
నాశకాలఁదిని శివుఁ డందించుచుండును, వి...

ఆ. కావవలయు మగఁడు కాంత నెల్లప్పుడు
కావలేనివాఁడు చావ వలయు

కాపులేనిదానికాపురం బడుగనా? వి... 2181

ఆ. కాశి మధుర కంచి గయప్రయాగలు సేతు
వాసతోడ వీని నాత్మజూచి
వాసన నెఱుఁగమి పట్టి వెట్టిఁ౹ధంబు, వి...2182

ఆ. కుక్కయే మెఱుఁగును గురులింగదేవర
నక్కపో తెలుఁగునె మొక్కప్రొద్దు
మొక్కఁడీడికెపుడు మోక్షు మందఁగ నౌనొ?వి.

ఆ. కోమటికికి దురాశ కొండలు వాములు
చందనంబు పోన చంద్రకళలు
ఆశకు మితి లేదికక్కడ గతి లేదు, వి...2184

ఆ. కోమటి నిష్ఠలు గుఱికిరా వెన్నడు
లోభిగుణముచూడ రూఢి యగును
బలిని దాసరి కిడఁ బొలుపడ నగునొకో? వి...

ఆ. చిత్తమనెడివేరు శిథిలమైనప్పుడే
ప్రకృతి యనెడిచెట్టుపడును పిదపఁ
గోర్కులనెడి పెద్దకొమ్మ లెండునుగదా! వి.

తే. చిత్తవృత్తులు మదియందుఁ జేరనీక
రిత్తబయలున గుఱిమించి రేయి బవలు
మత్తుఁడై యుండువాఁడెపో మాన్యుఁడరయ
సత్తఁ దెలిసియె దరిజేర సరవివేమ! 2187

క. చక్కెర గలిపి తినంగా
ముక్కినతవుఁడైన లెస్స మోహము గదుర

న్నొక్కఁడు బానిసయైన
న్మక్కువగను దివ్యభామ మహిలో వేమా!

ఆ. చదువులందు రాజపదవులందును పాడి
మొదవులందు స్త్రీలపెదవులందు
నాశ లుడిగినట్టి యయ్యలు ముక్తులు, వి...

క. చనువారెల్లను జనులం
జనిపోయిన వారిపుణ్యసత్కథ లెల్లన్
వినవలె గనవలె మనవలె
ననిమిషులకుఁ దెలుపఁగూడ దంత్యము వేమా!

ఆ. జననమునకు మున్ను జననిగర్భములోన
మునుపు జేసినట్టి ముష్కరంబు
ననుభవించి యునికి నాశలు విడువరు, వి...

క. జన్మము నెత్తినమనుజుఁడు
చిన్మయపరిపూర్ణమహిమఁ జిత్తము నెఱుఁగన్
దన్మయత నొందనేర్చును
చిన్మయుఁ బరమేశు మదిని జేర్చును వేమా!

ఆ. జాతివార లెల్ల జాతివిద్యలు నేర్చి
జాణలైరి మీఱి జగతిలోన
బ్రాహ్మణు లనువారు బ్రహ్మము నెఱుఁగరు, వి.

ఆ. జిహ్వ రుచుల గోరు జీవించునంతకు
సతియుఁ బతియుఁ గోరు సుతుల ధనము
హవ్యవహుఁడు చూడ నందఱఁ గోరును, వి.

ఆ. జిహ్వాలంపటంబు జీవనంబై యుండు
జిహ్వాలంపటంబె జీవపోష
జిహ్వచేత నరులు చీకాకువడిరయా, వి...2195

ఆ. జీవము దెలిసినఁ జెలఁగి మది చలించు
దైవ మగుపడినను దగులు బుద్ధి
దీప్తభానుని గని తిమిరంబు నిలుచునా? వి...

క. జీవాధారము నీరము
జీవాధారంబు గాలి చెలఁగుచు నుండున్
కావలసిన నవి యొక్కరి
యీవిని కోరకయె చిక్కు నిలలో వేమా!2197

క. ఎక్కడిసుతు లెక్కడిసతు
లెక్కడిబంధువులు సఖులు నెక్కడిభృత్యుల్
డొక్కువడి పోవువేళలఁ
జక్కటికిని నెవరురారు సహజము వేమా! 2198

ఆ. ఏది కులము నీకు నేది స్థలంబురా
పాదుకొనుము మదిని పక్వ మెఱిఁగి
యాదరించుదాని నవలీల ముట్టరా, వి...2199

ఆ. ఒక్కతనువున కిలఁ బెక్కుపాట్లను బడి
పెక్కుదినము లెల్లఁ బ్రేలి ప్రేలి
అగ్నిలోనఁ బడునొ యలనక్కపాలౌనొ
తెలియుమయ్య యిఁకను దీని వేమ! 2200

తే. కచముఁ గత్యంబు నోరును గనులు మేను

నాభియును బాహుమూలంబు నాతి కెపుడు
నోర్వఁ దగనట్టిగొలుతో నొప్పుచుండు
నింతకే యేల నింతిపై భ్రాంతి వేమ! 2201

తే. కండ లెముకలు నెత్తురు గలిగి తనువు
మూత్రమలములతో నుండు ముట్టరాక
కాయజుని బాణమం చాస గల్గఁ జెడును
ఆస బాపెడివిధమును నరయు వేమ! 2202

ఆ. కడుపులోని మలము కడమవి యెముకల
కలదు మాంస మింత కప్పుతోలు
మలము నెత్తిమీఁద మానెట్టు కలుగురా, వి.

ఆ. కడుపులోనిరోఁత కడు నోటియెంగిలి
కడుగ వశమె బ్రహ్మకొడుకునకును
సత్యమున్నఁ గొంత జగతిపై సిద్ధించు, వి...

ఆ. కన్నెదానిమేను కస్తూరివాసన
ముసలిదానిమేను ముఱికి కంపు
వయసుదానిమేను వర్ణింప శక్యమా? వి...

క. కాలములమహిమ దెలియక
వాలాయము నిత్య మనుచు వరలుదు రింతే
యేలనొ కాలము దెలియరు
వాలాయము జూటుమయ్యె వసుమతి వేమా!

ఆ. కాలవశముఁ బట్టి కర్మజీవిగణంబు

మత్తులగుచు నుండి మఱచినారు
మత్తులైనజనుల మనసేటి మనసయా, వి...

ఆ. కాలిసంకెలయగు గరిమతోఁ దనభార్య
చేతివిఱచి కట్లు శిశువులెల్ల
సరిపడచెఱసాల సంసారకూపంబు, వి... 2208

ఆ. కైపువస్తువులను గాంక్షించి సేవింప
కానిపను లొనర్చు మేనెఱుఁగక
అట్లుపూనువారి నధము లటందురు, వి...2209

ఆ. జన్మముల నిఁకెన్ని జన్మంబు లెత్తును
కర్మధర్మములకు గణన యెంతొ
కర్మధర్మములను కడ తేఱలేరయా, వి... 2210

ఆ. జన్మ వదలి వేఱు జన్మంబు లెత్తంగ
కర్మధర్మములకు గణన గలదె
కర్మధర్మములను కడ తేఱవచ్చునా? వి.... 2211

క. ధన మెచ్చిన మద మెచ్చును
మదమెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధన ముడిగిన మద ముడుగును
మదముడిగిన దుర్గుణంబు మానును వేమా!

ఆ. ధర విరక్తితోడ తలఁపుల విడువమి
తనకు తగులునట్లు తత్వ మరయఁ
దత్త్వ మరయఁ దాను దానగు బ్రహ్మంబు, వి..

క. నడజీవులు స్థావరములు
వడి చని పోవంగ నెఱిఁగి భావములోన
న్విడువక బ్రహ్మము దలఁపరు
వడి చని పోకుందురే మొ వసుధను వేమా!

క. ధర గిరులు జలధు లన్నియు
బరికింపఁగఁ బ్రళయమునను భస్మములయ్యా
సురలును మునులును జనఁగా
నెఱయోధు లిటుండఁ గలరె నేర్పున వేమా!

క. ధరఁ బుట్టి భోగి నయితిని
బరమం దిచ్చునటు మాని పడఁతులకై నే
తిరిగి యలసితిని ద్రవ్యము
మఱి యార్జించితిని కడకు మరణమె వేమా!

క. భుక్తిని మిక్కిలి విషయా
సక్తత తా దిరుగుచుండు సత్రములందున్
భుక్తిని ముక్తి లభింపదు
భక్తిని జీవునకు ముక్తి భద్రము వేమా! 2217

క. భోగంబుల కాశింపక
రాగద్వేషంబు లుడిగి రంగుగ దమలో
వేగమె మోక్షపదంబును
రాఁగను నాతండు యోగి రాయుఁడు వేమా!

ఆ. భోగవాంఛచేతఁ బోలుపేదో యెఱుఁగక
ద్రోహబుద్ధి నొరుల దూరుచుండ

సాహసించువాఁడు సర్వదా చెడునురా, వి...

తే. ముక్కు గోరును సద్గంధములను నల్లె
చెవులు కరములు గన్నులు జిహ్వ యొడలు
ఇన్నియును గోరునటువంటియిల్లురోసి
తన్ను గనుగొని సుఖియింపఁదగును వేమ! 2220

ఆ. ముండమోపితోడ మునుఁగుచు తేలుచు
నుండఁగానె మోహ ముండెఁ గాక
అండఁబాయు వెనుక నాయాశలే లేవు, వి....

ఆ. అతిథిరాకఁ జూచి యదలించి పడవైచి
కఠినచిత్తు లగుచుఁ గానలేరు
కర్మమునకు ముందు ధర్మము గానరో, వి...

ఆ. ఊరుసూరు దిరిగి యున్నది గనలేదు
మోరయెత్తి చూచి మొనయలేరు
పాఱఁ జూచుటదియె పరముగాఁ గాదొకో, వి.

క. ఎండినమానొక టడవిని
నుండిన నం దగ్నిఁ బుట్టి యూడ్చును చెట్లన్
దండి గలవంశ మెల్లను
చండాలుం డొకఁడు పుట్టి చదుపును వేమా!.

ఆ. ఔ ననంగ వచ్చు నైనది కానిది
యన్యుఁ డెదుట నుండి యడుగఁడేని
నిలిచి యడుగువాఁడు కలిగిన నిలువఁడు, వి...

ఆ. కట్టుబట్టఁ జూచి ఘనతఁ జెప్పఁగరాదు

కానరాదు లోనిఘనత లెల్ల
జంగమైనవాని జాతినెంచఁగ నిట్లు, వి... 2226

క. కలలోనిసంప దెల్లను
కలగని మేల్కనినపిదప కనఁబడ కేగున్
బలుభోగభాగ్యగుణములు
కలరీతిగ నమ్మవలెను ఘనముగ వేమా! 2227

ఆ. కలిమి గల్లనేమి కరుణ లేకుండిన
కలిమి తగునె దుష్టకర్ములకును
తేనె గూర్ప నీఁగ తెరువునఁ బోవదా? వి...

ఆ. గతికి పతి యటంచు గమకించినంతలో
మతికి గతియుగల్గు మహితముగను
సతికి సుతులు పుట్టి సంతుష్టిఁ జేయరా? వి...

ఆ. జీవిజీవి జంపి జీవికి బెట్టంగ
జీవి తాన బలసి చెలఁగుచుండు
జీవహింసకులకు చిక్కునా మోక్షంబు? వి...

ఆ. శీవి లేదటంచు డెందంబులో నెంచి
జ్ఞాని నెఱుఁగ లేనిమానవుండు
డాంబికునకు లొంగి డయ్యును కడపట, వి...

ఆ. తత్త్వహీను లుండ్రు తఱచుగా భువిలోన
తత్త్వ మెఱుఁగువారు తఱచు లేరు
కలిగి లేని వారు కాన్పింపరారయా, వి... 2232

ఆ. తనకు నొప్పిపుట్టి తనువెంత బడలిన
కూళవిటుఁడు యువతి గూడు సుమ్మి
పండ్లుపడిన గుక్క పసరంబు గఱవదా, వి...

క. తనకులగోత్రము లాకృతి
తనసంపదకలిమి బలిమి తనకేలనయా
తనవెంట రావు నిజ మిది
తనసత్యమె తోడ వచ్చు తనతో వేమా! 2234

క. తనకేనాఁడు సుభిక్షము
తన కేనాఁడును భగంబు తనరపఁయునం
చును దనపశికై యెల్లెడ
మనసందున చీవుకుచుండు మనుజుఁడు వేమా!

క. తనతల్లిలోప మెఱిఁగిన
మనుజుఁడు చింతిల్లు నెపుడు మానసమందున్
తనయాలిలోప మెఱిఁగిన
ఘనుఁడైనను దానివిడుచు గదరా వేమా!

ఆ. తనదుభ్రాతృవరులు ధర నేలుచుండఁగా
దనకు నుండునండ్రు వెనుక వారు
తనదు కాలు గోయ తమ్ముఁడు ఏడ్చునా, వి...

ఆ. తనవిపత్తు తెలియ దప్పించుకోనఁ జూచు
నెట్టిమనుజుఁడైన నెట్టులైన
నరకబాధ వినుచు నరయఁడా ధర్మము; వి...

క. తను వలచిన దా వలచును
తను వలవకయున్న నెవఁడు- తా వలవ డిలం
దనదుపటాటోపంబులు
తనమాయలు పనికిరావు ధరలో వేమా! 2239

ఆ. తనువు తా ననుకొను తనకు వాసనఁ బట్టి
జననమరణములను జక్కఁ జిక్కి
పొలుపున నెఱుఁగక పొర్లాడుచుండెడి, వి....

ఆ. తనువుపోవువేళ దనువును బాంధవుల్
వెంటరారు నిజము వెఱ్ఱులార
తనువు విడచిపోక దనకు తోడౌ గుణి, వి...

ఆ. తనువు విడిచి తాను దరలిపోయెడివేళ
తనదుభార్యసుతులు తగినవారు
లొక్కరైన నేగ రసుమాత్రమె కాని
తనదుమంచితోడు తనకు వేమ! 2242

ఆ. తమకు పెక్కుగలుగు తప్పు లటుండఁగా
నొరుల నేర మెంచు నొగెవుడును
జక్కిలంబుఁ జూచి జంతి కేరినయట్లు, వి....

ఆ. తరుణి యన్నఁ గన్నఁ దనయుని జూచిన
మరునికళల మించు మనసుపాఱు
పాపజాతిమనసుఁ బట్టంగరాకుండు, వి... 2244

చ. తరుణుని బెండ్లియాడి తగ
తమ్ములు నన్న లు బావయం చనక

వరుసలఁ జిక్కి-సొక్కి మతి
వాంఛలచేతనె తేనెటీఁగ౯యై
సరవి మునింగి నాతనికి సత్పథ
మబ్బునె నిన్నుఁ గానకే
ధరణిని ముక్తిలేదు ఇఁక
దాఁపక చెప్పుమి వెఱ్ఱివేమనా. 2245

ఆ. తల్లి దండ్రి చావఁ దనయుఁడు తానేడ్చు
మగఁడు చావ నాలు వగచుచుండు
కార్యవశమె కాని కలుగునా మోహము, వి.

ఆ. తల్లి దండ్రి హితులు తగినచుట్టము లెల్ల
నేరి కోరి పోరు నెగుడు చూచి
పడుచు నిత్తు రంతె భాగ్య మీయఁగ లేరు, వి

ఆ. తాను దినక తగిన ధర్మము సేయక
కొడుకుల కని ధనముఁ గూడఁ బెట్టి
తెలియఁజెప్పలేక తీఱిపోదురు వెన్క-
సొమ్ము పరులఁ జేరు జూడు వేమ! 2248

ఆ. తానును జను లేమనుకొనఁ
బూనుదురో దాని నరసి పొందిక జెడసీ
రానిపథంబున నడచిన
దానసె ధర్మాత్ముఁ డండ్రు తన్నిట వేమా! 2249

ఆ. తిరిగి వచ్చువేళ మఱలిపోయెడువేళ

తానెటకుఁ జనునొ ధనమెందు బోవునో, వి...

ఆ. దేహమనెడియింటి దినదినంబును నూడ్చి
యలికి పూసి మెత్తి యనువుపఱచి
కాపు విడిచి పోవు కడపట నీజీవి, వి... 2251

ఆ. దోఁపునిచ్చువాఁడు తులలేనినెఱదాత
దోఁచుకొన్నవాఁడు ద్రోహి యయ్యె
బ్రాపుఁ జూపువాఁడు పరమపూజ్యుండట
బ్రాపుఁ జెఱచువాఁడు పశువు వేమ! 2252

ఆ. ద్విజవరుండు చెడ్డ దిక్కులేకయ భూమి
మనుజు లెల్లఁజెడుదు రనుట కేమి
కాలగతులు మాఱ కలియు ధర్మము మాఱు,వి.

ఆ, దానధర్మములను తాఁజేసి పుట్టమి
కర్మగతిని యముఁడు కష్టపఱచు
కర్మధర్మములను కడవీడ బ్రహ్మంబు, వి ...2254

ఆ. ధనవిహీనుఁడయ్యు దండ్రి పుణ్యము చేయు
భాగ్యమునను నరుఁడు పట్టి యగుచు
బహుళధనము గూర్చు భద్రమార్గంబున
పరుల కిచ్చు కీర్తిఁ బడయు వేమ! 225

క. నదియుదకంబును ప్రియమగు
మదినొదవెడి తత్త్వబుద్ధి మగ్నత నెన్నం
దుదిపదవి గలియ ఘనమగు

క. నరకులమునఁ దాఁ బుట్టియు
నరకులమునఁ దాను బెరిగి నరుఁడయ్యును దా
నరకులమును ఛీఛీ యని
హరకులమునఁ దిరుగునేని హరుఁడౌ వేమా!

ఆ. నరుఁడు జాగరమున నటియించుచుండును
నరుని కిలను జాగ్ర తరుదుసుమ్ము
నరుఁడు జాగ్రతనుట ధరణిలో పరమాత్మ, వి.

ఆ. నీరుపైనిఁబడిన నిప్పులు బొగ్గులౌ
నిప్పుమీఁద కుండనీరు పెట్ట
గళపెళనుచు ప్రాలు కడు చోద్యమిది కదా, వి.

ఆ. నీరు మొదలు పెట్ట నీరమే మొలకయ్యె
మొలక విశ్వమగుచు మొనయుచుండు
నీరు విశ్వమగుట నేర్పుతో తెలియుము, వి...

ఆ. నీళ్లలోనిమీను నిగిడి దూరము పాఱు
బయల మూరెడైనఁ బాఱలేదు
స్థానబలిమికాని తనబలిమి కాదయా, వి...

ఆ. నేయిలేనికూడు నీయాన కసవది
కూరలేనితిండి కుక్కతిండి
ప్రియము లేనికూడు పిండవుకూడురా, వి...

క. నోరెటెఁగి తా మవేవియు
నేరనిజంతులఁ జంపి నెమ్మది దిను నా

క్రూరపుసంకరజాతుల
మారణమే మందు రింక మహిలో వేమా!

ఆ. న్యాయశాస్త్ర మరయ నన్యాయ మొనరించు
ధర్మశాస్త్ర మొసఁగు దుర్మతంబు
జ్యోతిషంబు జనుల నీతులు దప్పించు, వి...

ఆ. పంకజాక్షి గన్న బంగరు పొడగన్న
దిమ్మబట్టి యుండు తెలివి యొప్ప
మనుజులకును తత్త్వ మహిమ మెట్లు కల్గురా?వి.

క. న్యూనము గల తనభార్యను
కాననమున జంపవచ్చు గడుచిత్రముగా
దా నెలుక మ్రింగురీతిని
మానముఁ గాపాడుకొనెడిమహితుఁడు వేమా!

ఆ. పంచమనిగమంబు భారతం బగునని
పొగడి రేల జనులు బుద్ధిమాలి
హింస నెంచి చూడ నిష్టమె ట్లయ్యెనో, వి...

ఆ. పచ్చదనముఁ జూచి యిచ్చను కాముకు
ల్చిచ్చులో బడుదురు క్షితితలమున
యిచ్చ గలుగఁజేయు నెచ్చుగా మోహము,వి.

ఆ. పచ్చవిల్తుచేత గ్రచ్చుఱ జనులెల్ల
దచ్చనాడ వైరి ధరణిలోన
గులజుఁ డెవ్వఁ డిందుఁ గులహీనుఁ డెవ్వఁడు, వి.

ఆ. పట్టకుండి యధికభాగ్యంబు పట్టైనా
దొడ్డవారిఁ దిట్టి త్రుళ్లిపడును
అల్పజాతికుక్క యధికుల నెఱుఁగునా, వి...

ఆ. పచ్చిమలము దినుచు పండుటాకు నమలి
యుచ్చ దప్పి దీర్చి యుడుకు కోర్చి
కచ్చను బిగియింపఁగలుగునా తత్త్వము? వి.

ఆ. పత్తనమ్ములందు పతులను సతులను
మోహ మెచ్చుదాన యూహలెచ్చు
ముక్తిమార్గమునకు యుక్తియే తెలియదు, వి.

ఆ. పరదళములఁ జూచి ప్రాణంపుబ్రీతిచే
నుఱుకుపిఱికివాఁడటూరిదాక
యముఁడు వచ్చునేని యడ్డ మింకెవ్వరు? వి...

ఆ. పరబలంబుఁ జూచి ప్రాణరక్షణమున
కుఱికి పాఱిపోవు పిఱికివరుఁడు
యముఁడు కుపితుఁడైన నడ్డ మెవ్వఁడు సుఖ?వి.

ఆ. పరమభాగవతులు ప్రజలు సంతోషించు
నాటపాట నేర్చి నీటుగాను
కోట్లకొలఁది తెచ్చి కూటికి లేకుంద్రు, వి...

క. పాతకసంసారార్ణవ
మే తెఱఁగున దాఁటె దీవు హెచ్చరికమెయిన్
చేతనమూర్తిని మదిలో

ఖ్యాతిగ నెన్నంగ దగును ఘనమతి వేమా!

ఆ. పాపజాతినరుఁడు పరసతిఁ గోరుట
చేఁప జిహ్వారుచిఁ జిక్కునట్లు
తీపువంటి యీఁగ తెగువతో నీల్గదా! వి...

ఆ. పాశబంధుచేత బంధువర్గము లెల్లఁ
జిక్కుఁజూతు రరయ జీవము చన
నొక్కఁడైన నేగఁ డుసురుమాత్రమె కాని, వి.

క. పిండంబై యుదరంబున
నుండును గొన్నాళ్లు పిదప నుర్వీస్థలిపై
పిండంబై జనియించును
పిండం బాప్రాణరక్ష పృథివిని వేమా! 2279

ఆ భవము పూర్వకర్మఫలము ననుభవింపఁ
గలిగె ననుచు మదిని గట్టిపఱచి
కష్టసుఖము లేవి గలిగిన తలఁపకు, వి... 2280

ఆ. భవము సాగరంబు భార్యయా మకరము
చేఁప జలగ లగును శిశువు లెల్ల
భవహరుఁ దలఁపక పాఱ మాఁదగ లేఁడు, వి...

ఆ. మంత్రవిద్య లెల్ల మాయలకొఱకిల
సృష్టియందు బ్రహ్మసృష్టిఁ జేసె
మత్తుఁడైనవాఁడు మది నిల్పలేఁడయా, వి...

ఆ. మదముచేత లోకమాయలు దెలియరు
మదముచేత దన్ను మఱచు నెప్పుడు
బుద్ధిలేనిపశువుపోలికఁ జెడుదురు, వి... 2285

క. మరణము దాపగుచున్నను
స్థిరబుద్ధిని బరము కన్నఁ జక్కను మోక్షం
బరయుచుఁ బురిలో నెంచిన
పరమార్థమె బట్టబయలు ప్రాకటము వేమా!

ఆ. మాట మఱుఁగు సిగ్గు మనుజలోకం బెల్ల
చీరె మఱుఁగు సిగ్గు చెప్పనేల
బయట నింటి సిగ్గు బండసంసారంబు, వి...

ఆ. మాయయె చెఱసాల మనసె మోహింపంగఁ
బెద్దశృంఖలంబు భేదములను
ఇట్టు బద్ధవశుని కెన్నడు మోక్షము, వి... 2286

ఆ. ముఖముఁ జూచినంత మోహంబు ఘనమౌను
దిసమొలను గనంగ దీక వద్ది
కూడినపుడె వెల్లి కుత్తరింపఁగ రాదె, వి... 2287

ఆ. మొగముఁ జూచినపుడె మోహంబు ఘనమౌను
ధనముఁ జూచినపుడె తగులు మనసు
కూలి కష్టమైనఁ గోరునే కొఱగావి, వి... 2288

ఆ. మొండివాని కేల ముంజేతికడియాలు
తొట్రివాని కేల సొక్కకంఠ్యా
గాడిదలకు నేల గంధముల్ వీవనల్, వి...

ఆ. మొదట నాసఁ బెట్టి తుది లేదు పొమ్మను
పరమలోభు లైన పాపులకును
వారియుసురు దాఁకి వగచెడిపోవురా, వి...

ఆ. మొలకచనులనాఁడు మూఁడుకోటులు సేయు
కులుకుచనులనాఁడు కోటి సేయు
తటుకుచనులనాఁడు దయ్యాలు నొల్లవు, వి.

ఆ. మృగమదమ్ము చూడ మీఁద నల్లగ నుండు
పరిఢవిల్లు దాని పరిమళంబు
గురువు లయినవారిగుణము లీలాగురా, వి...

ఆ. యోని బోను జేసి యొడలు డంబుగఁ జేసి
నాల్క నిడుపు గట్టి నమలుదు నని
వివర మెఱుఁగ కేర్చు నిటుఁడే జ్వోపాదుండు, వి.

ఆ. యోని గడుగునీటి నొనరంగ ద్రాగిన
బ్రహ్మమత మటంచు బలుకు బొట్టు
బ్రహ్మనిష్ఠవలన బ్రాహ్మణు లావలె, వి... 2294

ఆ. యోనియందె పుట్టి యోనికి రుచిఁ జేయు
చన్ను గుడిచి పెరిగి చన్నుఁ బట్టు
సృష్టిలోని ప్రాణి సిగ్గేల యెఱుఁగదు, వి... 2295

ఆ. రాజసంబు గోరి రాజ్యభారమునందు
నోర్పు లేనియాతఁ డుభయతఁ జెడు
నీటిపైన గుండు నిలుచునా మునుఁగక, వి...

ఆ. రాతిబసవని గని రంగుగా మ్రొక్కుచు
రూఢిబసవని గాల రద్దుచుంద్రు
బసవభక్తులెల్ల పాపులు తలపోయ,వి...2297

ఆ. రాతిప్రతిమ దెచ్చి రాజసంబుగ నుంచి
పూజ సేయునరుఁడు బుద్ధిమాలి
భావమందు నరుఁడు భావింప నేరఁడు, వి....

ఆ. రాతిలింగమునకు రాజులు మొదలుగా
పూజసేయుదు రిల పూలతోడ
ఆత్మలింగమునను నానంద మొందఁడు, వి...

ఆ. రామభక్తుల మని రాతిబొమ్మకు మ్రొక్కి
భజన సేయ నేల భక్తిలేక
భక్తినిల్ప నతఁడు భజనము సేయునా? వి. 2300

ఆ. రూపులేని వనిత రూఢిపతివ్రత
నీటులేనివాఁడు పోటుబంటు
తెలుపవచ్చు నెటు దేవరబంటులఁ, వి .. 2301

ఆ. రూపునంత పేరు రూఢిగా నిలుచును
పేరునంత క్రియలు పెనఁగుచుండు
నాశ మౌను తుదకు నామరూపక్రియల్, వి....

ఆ. రూపువివర మొకట రూఢిగా డాఁగన్న
తలఁచునప్పు డెల్ల మెలఁగు మదిని
అట్లు మెలఁపి కోరు మాగురురూపుని,వి...2302

ఆ. లవణ మెంత దానిలాభంబు గన నెంత
కొద్ది దనుచు నెన్నఁగూడునయ్య
భోగమేటికి నుపయోగంబె లెక్కగు, వి...2304

ఆ. లోభమోహములను ప్రాభవములు దప్పు
దలఁచినపను లెల్ల తప్పి చనును
తా నొకటి దలఁచిన దైవ మొండగుచుండు, వి.

ఆ. లోభివానికల్మి లోలత నాసించి
బడుగువాఁడు తిరుగఁ బరిణమించు
తగరు వెంట నక్క దగిలినచందము, వి...2306

ఆ. లోభిదాత యైన లోకంబు లోపల
పరుల నడుగ బోడు ప్రాలుమాలి
ఒకని కీనివాఁడె యోచింపఁ బెనులోభి, వి...

ఆ. లోభివాని జంప లోకంబులోపల
మందు వేఱుపఁడదు మతమె గలదు
సైకి పడుంగ నతఁడు భగ్గుమని చచ్చు, వి...

ఆ. వనము బిలములందు వరయోగి తా నుండు
పనియె యుండుననక పాటుపడును
తనివిదీర మదిని దలకొని చూచును, వి...2309

ఆ. వరలు రత్నసమితివలె గూర్చు ధాన్యంబుఁ
జక్క దంచి వండి మెక్కుటనుగ
సుష్టుభోజనములఁ జూరగా నిడువాఁడు
చెప్పనేల వాఁడు శిష్టుఁడు వేమ! 2310

ఆ. వలపు గలిగెనేని వనజాక్షి యధరంబు
పంచదార కుప్ప పాలకోవ
చూతఫలరసంబు జున్నుసమానము, వి...2314

ఆ. వలపు దీఱెనేని వనజాక్షియధరంబు
ములకపంటి గిజరు ముష్టిరసము
చింతపొంత యగును జీడిసమానమా, వి...

ఆ. వల్లవైపులేక వార్ధక్త్త మటుచేసి
అదిగో యిదిగో యనుచు నాసవెట్టి
గసువుపెట్టి లేపు గడియగా నిమ్మను, వి...2316

ఆ. వాడువాడనంగ వానికేమిర లోటు
వాడట నరదేవదర్శ్య నెపుడు
వాడు కాక యితఁడె వాడనఁ దప్పేమి? వి.

ఆ. వాతగుణముచేత వగగన్న మగవాడు
లొట్టకనులదాని లోలతకును
బుట్టి జగతి నిలుచు ప్రపదుష్టవించును, వి...

ఆ. వానభయముచేత వడి దూరెదరు లోన
నెంతకెంత స్నాన మొందిచఱతు
రేల లోకజనుల మే లోర్వకుందురు, వి...

ఆ. వారకాంత లెల్ల వలచి యేతెంతురా
పొందుఁజేసి ధనము పుచ్చుకొనక
మాట యాఁడిగాఁగ మగ లెల్ల వత్తురు, వి...

ఆ. విజయుఁ డైనవాఁడు విల్లందినంతనె
కుజను లెల్లవారు కూలిరిగద
భజనచేయునతఁడు విజము గాంచఁడా? వి..

ఆ. విటునిగన్నవలపు విశదమై యుండును
బోటిచూపునకును సాటి గలదె
కంటిలోనిపాప కుంటెనగాఁడయా, వి... 2319

ఆ. విటులకనుల కెంతొ విభ్రమమై తోఁచు
సాటిలేనిపొలఁతి చక్కదనము
కంటిలోనిపాప కుంటెనతనమె కా!, వి...2320

ఆ. విడువవలయు నూరు విశ్రాంతి గాకున్న
విడువవలయు నాలివిధము చెడిన
విడువవలయు రాజు వితరణి గాకున్న, వి...

ఆ. విడువ ముడువ లేక కుడువ కట్టఁగ లేక
వెఱపు లేక విద్యవిధము లేక
వెడలలేనివాని నడపీనుఁగనరొక్కో, వి... 2322

ఆ. విత్తహీనమైన వేళలందును తల్లి
తనయు లాలు సుహృదు లనెడివార
లెల్ల శత్రులగుదు రెందైన నిజ మిది, వి...

ఆ. విత్తు ప్రగ్గనేని వృద్ధి కానేరదు
విత్తు ప్రగ్గకున్న వృద్ధి యగును
విత్తు విశ్వమునకు వివరింప నేదియో!వి...2324

క. విధి లేక జరుగ దనుచును
మదిలో నేవస్తువైన మనసునఁగూడన్
బొదలుచు విడువఁగఁజాలని
యదియే సంసారబీజ మనఁబడు వేమా! 2325

ఆ. విన్నవానికన్నఁ గన్నవాఁ డధికుండు
కన్నవానికన్నఁ గలియువాఁడు
ఉన్నతోన్నతుఁడయి యుర్విలోపలనుండు, వి...

ఆ. వినియు వినకయుండు కనియుఁ గానకయుండు
తలఁచి తలఁపకుండు తాను యోగి
మనుజవరులచేత మతి పూజ గొనుచుండు, వి.

ఆ. విప్రునెంగిలాకు వీథికుక్కలపాలు
మాలపుల్లెైయైన మానితంబు
మంతు కెక్కునాకు మాలపుల్లె యటంద్రు, వి.

ఆ. విశ్వమందు పరుని విదరంబుఁ గానక
పరమహంస నెట్లు పట్టవచ్చు
మానసమున నిష్ఠఁ బూనఁగవలెఁ గాని, వి...

ఆ. విశ్వమందు బ్రహ్మ విస్తరించుట గాక
వేఱె బ్రహ్మ మనుచు వెదుకనేల?
తగిలి యుండుఁగాదె తనలోన బ్రహ్మంబు, వి...

ఆ. విశ్వము నడుపంగ విశ్వేశ్వరుం డుండ
బ్రాహ్మణులకు నేల పట్టుదలలు
వనములోనిక్రోఁతి వసుమతి వసపునా? వి...

ఆ. కానికులముదైన కంటికింపైనప్డు
విటుఁడు తలఁచెనేని విడువలేఁడు
మఱఁగి గ్రుడ్డికుక్క మలమును తినునట్లు, వి...

ఆ. విశ్వసింపఁ దగిన వేషంబు మరి లేదు
కుడువఁ గూడు లేదు కోక లేదు
విశ్వమయుఁడై యైన విభు నేల తెలియరో? వి...

ఆ. విష్ణుభక్తు లిలను విభూతిపాలైరి
శివునిభక్తు లెల్ల సిద్ధులైరి
భక్తు లెల్ల జీవిపాటిని దప్పిరి, వి... 2334

ఆ. వీడవలయువాని గూడిన నెగ్గగు
వీటివాడలందు వెలయువాఁడు
పాడుచేయుపనులు పరిపాటియే గదా! వి...

ఆ. విడుచుడానిపొందు విడువఁ జాలనివాఁడు
చచ్చుదాఁక మోయు చాపగుడిసె
భాగవతులపట్టుఁ బాపంగ నోపఁడు, వి... 2336

ఆ. వెదకి కానలేఁడు వేదాంతవేద్యుని
తత్త్వవేత్త లేఁడు ధరణిలోన
గలిగెనే నతండు కానంగరాఁడయా, వి...

ఆ. వెదకి వెదకి వెదకి వేసారి వేసారి
తిరిగి తిరిగి తిరిగి దిమ్మతిరిగి
బొమ్మలాటఁ జూచి పోఁబడి గంటిరా, వి...

ఆ. వెన్న చేతఁ బట్టి వివరంబు తెలియక
ఘృతముఁ గోరునట్టి యతనిభంగి
తాను దైవమయ్యు దైవంబుఁ దలఁచును, వి.

ఆ. వెనుకఁ జూత మన్న వెసను కష్టపుగుంట
ముందుఁ జూత మన్న ముఱికిగుంట
వెలఁదిఁ జూచి యేల వేడుకపడుదురు? వి...

ఆ. వెఱ్ఱివానికైన వేషధారికి నైనఁ
రోగి కైనఁ బరమయోగికైన
స్త్రీలఁ జూచినపుడు చిత్తము రంజిల్లు, వి...

ఆ. వెలఁదిసొంపుఁ జూచి విఱ్ఱవీగఁగ రాదు
కలికి గుణము కాదె కారణంబు
చపలచిత్తవృత్తి జారిణి కుండదా?, వి... 2342

ఆ. వేదములను జదివి వెఱవేమి గాంచిరి
యరిగి తిరిగి వత్తు రందఱు కద
బ్రహ్మ మేమొ దెలిసి బ్రదుకుట నిజమయా, వి.

ఆ. వేదవిద్య లెల్ల వేశ్యలవంటివి
భ్రమలఁ బెట్టి తేటపడఁగ నీవు
గుప్తవిద్య యొకటె కులకాంతవంటిది, వి...

ఆ. వేదశాస్త్రములను విరివిగాఁ దా నేర్చి
వాద మాడువాఁడు వట్టివాఁడు
సారమైనగుఱుతు సాక్షిగా నెంచుము, వి...

క. వేదాంతుల మని కొందఱు
వాదములకు నడుముగట్టి వత్తురు వారల్
సాధులు గారని చెప్పఁగ
భేదగుణం బొకటి గుఱుతు పెద్దది వేమా!

ఆ. వేషధారి నెపుడు విశ్వసింపఁగరాదు
వేషదోషము లొకవిధమె యగును
రట్టుకాదె మునుపు రావణువేషంబు, వి... 2347

ఆ. వేష మొనరఁ గట్టి వెట్టి శూద్రత్వంబు
తనకు లేదనుకొను ధరణిద్విజుఁడు
అరిది గిట్టువేళ నడఁగు ద్విజత్వంబు, వి...

ఆ. వ్యాధి నెఱుఁగలేనివైద్య మదేలరా?
కొదవఁ దెలియలేనికోర్కె లేల?
మనసు తెలియలేనిమర్మజ్ఞు లేటికి? వి... 2349

ఆ. వ్రతము లాచరింప వట్టికష్టమె గాని
బ్రతుకుమీఁద నాశపడుట లేదు
వ్రతముచేత గురుని వెదుకంగలేరయా, వి...

ఆ. వ్రతము లెన్నియైన వట్టిచిక్కులె కాని
యాత్మచిక్కు గావ నలవికాదు
ఆత్మచిక్కు బాపుసతఁడె పో ఘనయోగి, వి...

ఆ. శాంతమె జనులను జయము నొందించును
శాంతముననె గురుని జాడ దెలియు
శాంతభావమహిమఁ జర్చింప లేమయా, వి...

ఆ. శిలను బ్రతిమఁజేసి చీఁకటిలోఁ బెట్టి
మ్రొక్కవలవ దిఁకను మూఢులార
ఉల్లమందు బ్రహ్మ ముండుటఁ దెలియుఁడీ, వి.

ఆ. శిలలఁ జూచి నరులు శివుఁడని భావింత్రు
శిలలు శిలలె కాని శివుఁడు కాఁడు
తనదులోనిశివుని తా నేల తెలియఁడో, వి...

ఆ. శివుఁడు బ్రహ్మ మనుచు స్మృతు లెల్లఁ బలికినఁ
బరుల నేలఁగొల్చు బ్రాహ్మణుండు
హరునిభక్తు లెల్ల నరయఁగా నరుదెకా, వి...

ఆ. శిష్యవర్గమునకు శివుఁ జూపనేఱక
కాని మతములోనఁ గలుపునట్టి
గురుని నరసి చూడ గ్రుడ్డెద్దుచేనురా, వి...

క. శీలము గలసుందరి తన
యాలైనను స్వర్గమేల నైహికసుఖమే
శీలము లేనిది చూడఁగఁ
గాలునిపటుదూత యగును గదరా వేమా!

ఆ. శూద్రతనము పోయె శూద్రుఁడ గానని
ద్విజుఁ డనుకొను టెల్ల తెలివిలేమి
ఇత్తడెనఁగు పసిఁడి కీడనవచ్చునా? వి.... 2358

ఆ. శూద్రయువతికొడుకు శుద్ధాంతరంగుఁడై
వేదవేద్య మైనపాదు తెలిసి
బ్రహ్మపదవి గన్నఁ బ్రాహ్మణుఁడే కదా!, వి...

ఆ. శూద్రు లనుచు భువిని శూద్రుల బోనాడు
మాలకన్న దుడుకు మహిని లేడు
నరకమునకు నేఁగు నష్టమైన వెనుక, వి...2360

ఆ. సకలజాతిపురుషసాంకర్యమునకును
సతుల నిచ్చి తాము సమ్మతింత్రె
ఉంకునె కనలేని యోగులు బాపలా, వి...

క. సకలము నాఁకలికోఱకే
నికరంబుగఁ బెట్టె మనకు నీచపుగుణముల్
సకలంబందు వసించెడి
యకలంకుఁడె యేమి వింతో యరయర వేమా!

ఆ. సకలరూప మాత్మసాక్షిలో నెంచుట
నికరమైనబయలు నిర్ణయంబు
వికల మింతలేక వెలుఁగును తత్త్వంబు, వి...

ఆ. సకలవిద్య లెఱిఁగి చచ్చి బ్రదుకువిద్య
యొకటినేర మనుచు నుర్విజనులు
కటకటఁబడుదురె కడహానిఁ దెలియరు, వి...

ఆ. సకలశాస్త్రములను జదివియు వ్రాసియుఁ
దెలియఁగలరు చావుఁ దెలియలేరు
చావుఁ దెలియలేనిచదువు లవేలరా? వి...

ఆ. సకలశాస్త్రములను సంపుటంబులు వ్రాసి
చదువ నేర్చియైనఁ జా వెఱుఁగరు
చా వెఱుఁగనిచదువు చదువంగ నేలనో? వి...

ఆ. సతత మాత్మరూపు సాధించి శోధించి
యుత్తముగాను బుద్ధి నూని నొక్క-
గతిని గోరి ము_క్తి గనుటయే లాభంబు, వి...

ఆ. సంతబసివిపొందు చలిపందిలిజలంబు
త్రోవ నమ్ముతోడు తోత్తునంటు
రచ్చసభల నిద్ర రాజులు మెత్తురా, వి...2368

ఆ. సత్యమనఁగ వేఱె జగమున గనలేదు
నిత్య మగుచు నాత్మ నెగడియుండు
నిత్యవస్తు వెలుఁగ నీవెపో బ్రహ్మంబు, వి...

ఆ. సత్యవంతులయెడ సరసమాడఁగరాదు
పేదదారితోడఁ బెనఁగరాదు
కలిమిగలుగువారి గలియనేరాదయా, వి...

ఆ. సతికి బతికి నైన సంపదే సంపద
పుత్రసంపదయును భువిని మేలు
సరగ ముదిసి బ్రదుకు సంపదే సంపద, వి...

ఆ. సతి యొనర్చుచెడుగు పతి కవశ్యము వచ్చు
పతి యొనర్చుపంచి సతికి సగము
పతి యొనర్చుచెడుగు సతి కేలరాదురా? వి.

ఆ. సతులమాయనమ్మి సౌఖ్యంబు గలదని
మతివిహీనులైరి మనుజులెల్ల
గతులు సతులవలనఁ గానంగలేరయా, వి...

ఆ. సంద్రమునకుఁ జూడ సరి యేదియును లేదు
అట్టిజలధినీర మనువు గాదు
అనువుగానినీరె యది యేమి చేయును? వి...

ఆ. సదసునందు వేశ్య సైగలు కనుపింప
ముదితమీఁద నాశ ముడివడంగ
మదిని భ్రమయకెపుడు మార్గానిచూడరా, వి॰

ఆ. సతిని జూచి చూచి సౌఖ్యంబుఁ గోరును
గతిని గానలేఁడు కర్మజీవి
గతులు సతులవలన గానంగ లేరయా, వి...

ఆ. సాటి చెప్పనగునె సాధుసజ్జనునకు
గొప్పచదువుఁ జదివి యొప్పు ననుచు
వాదులాడునతని వదరుట లేలరా, వి... 2377

ఆ. సాటి చేయవచ్చుఁ జదివి వాదములాడు
చదువరులను జెట్టి సముదయమును
పోరి పోరి గెల్చునోరునోవనివాఁడు, వి....

ఆ. సాటి యెవరు లేరు సాంబమూర్తికిఁ బోల్ప
దీటులేని గొప్పదేవుఁ డతఁడె
ధాటి కలుగు నతని ధ్యానించువానికి, వి....

ఆ. సాధనంబు లేక సమకూడ దేదియు
బోధలేనివిద్య పొంద దెపుడు
పాదుకొల్పి మదిని భావించి చూడరా, వి....

ఆ. సాధుజనులచెలిమి చాలింపఁగారాదు
ప్రకృతి విడక యున్నఁ బరము లేదు
పిందె గోసి చూడ బీజంబు గలుగునా? వి...

ఆ. సాధుజనులఁ బట్టి సంతాప మొందింప
కులవినాశమందు క్రూరజనుఁడు
సాధుజనులపూజ సాయుజ్య మిచ్చురా, వి...

ఆ. సారము గలయుక్తి సమముగా మది నిల్పి
నిత్యమైనముక్తి నెల నెఱింగి
భక్తియుక్తి మీఱి బయలంటి యుండుము,వి.

ఆ. సిద్ధులైనవారిచిత్తము రంజిల్లు
నోడలిమెఱుఁగు లెక్క కీడరు గాన
పనసపండు ఘనత పై నేమి కలదురా, వి...

ఆ. సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతు లగుచుఁ బుత్రు లొప్ప
స్వర్గమేటి కయ్యె సంసారి కింకను, వి... 2385

ఆ. సుతులుసతులుమాయ సుఖదుఃఖములు మాయ
సంస్కృతియును మాయ జాలి మాయ
మాయ బ్రతుకున కనె మాయ గల్పించెరా,వి.

ఆ. సురలు మాను లెపుడు సరవి వర్తింతురు
ధర్మమార్గ మొకటి తారకముగ
అట్లు కానివార లసురులై చచ్చిరి, వి.... 2387

ఆ. సూక్ష్మ మరయ నీకు సుఖతత్త్వభావంబు
పుట్టు చావు లేనిపురపుదారి
మానసంబు నంటి మఱవక చూడరా, వి...

ఆ. అడుగ కర్థ మిచ్చునతఁడు బ్రహ్మజ్ఞాని
అడుగ నర్థ మిచ్చు నతఁడు త్యాగి
అడుగ నీయలేనియాతఁడు పెనులోభి, వి...

క. అడుగఁ దగువారి నడుగుట
యిడినయెడం గొసరకుంట యీ లే నన్నఁగాఁ
గడుసై వేఁడకయుండుట
యడిగెడివారలకు నీతి యగురా వేమా! 2390

ఆ. అరుదుగా నడిగినయతఁ డర్థి గాఁబోఁడు
తఱచుగా నొసఁగక దాత గాఁడు
దాత కర్థి కింత తారతమ్యము సుమా, వి...

ఆ. అల్పుఁడైనవాని కధికభాగ్యము గల్గ
దొడ్డవారి తిట్టి తొలఁగఁద్రోలు
అల్పజాతివారు అధికుల నెఱుఁగునా! వి...

ఆ. ఇచ్చి నొచ్చుటేల నిల భాగభోగ్యముల్
వచ్చిపోవుచుండు వాంఛదీఱ
చచ్చినట్లు నరుఁడు శత్రుఁడై సాధించు, వి...

క. ఇచ్చెడివారలసంపద
హెచ్చెడినే గాని లేమి యెట్లు కలుగురా?

నిచ్చెలమనీటఁ జల్లిన
విచ్చలవిడి నూరుచుండు వినరా వేమా! 2394

ఆ. ఇచ్చువాని యొద్ద నియనివాఁడుండిన
చచ్చుఁ గాని యీవి సాగనీఁడు
కల్పతరువుక్రింద గ్రచ్చచెట్టున్నట్లు, వి... 2395

ఆ. ఇంచుకంత బోన మీశ్వరార్పణ మన్న
పుణ్యలోకములకుఁబోవు నరుఁడు
అన్నదానముకన్న నధికదానము లేదు, వి...

క. డంబములు పలుకువాని ని
జంబుగ దా నమ్మునట్టి జన్ముఁ డరయఁగ జ్ఞా
నం బిసుమంతయు లేని వృ
థాం బని యెంచుటకు నడ్డు లేదుర వేమా! 2397

ఆ. తండ్రిసొమ్మదైన దాంపూడిసొమ్మైన
పరులసొమ్ములైనఁ బ్రాప్తధనము
దయను దీనులకును దానము నిచ్చును, వి...

ఆ. తనదుదాన నరయఁ దనబిడ్డ సమమగుఁ
దండ్రిదాన మెల్ల తనకు తోడు
అన్యు లిచ్చుదాన మది తల్లివంటిది, వి... 2399

ఆ. తనదుకర్మచేతఁ దాను లోకములోనఁ
దనదుతల్లిగర్భమునను బుట్టె
తన్ను మఱచి యింకఁ దగనివి చేయునా? వి...

ఆ. తనదు బాగు గోరి ధర్మంబుఁ జెప్పిన
దిట్టుచుండు నధముఁ డెట్టయెదుట
గడ్డివేయఁ బోట్లగొడ్డు కొమ్మాడించు, వి...

ఆ. తల్లిగర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు
నలుతలింగమున్నె యరయుమయ్య
నడుమ లింగమూన నగుఁబాటు గాదొకో, వి...

ఆ. తల్లిదండ్రు లాత్మసఖులు నన్నలు దమ్ము
లెలమి బంధుభృత్యు లెల్ల జనులు
గలిగి వర్ధిలంగ ఘనతతో నుండుము, వి...

ఆ. తాత గన్నతల్లి తండ్రిని గనుతల్లి
తన్ను గన్నతల్లి తల్లితల్లి
తల్లి శూద్రురాలు తా నెట్లు బాపఁడు, వి...

ఆ. తాను తను వటంచు తప్పుచుఁ బలికిన
మోహవార్ధిలోన మునుఁగకున్నె
కాన తా ననునది గానంగలేఁడయా, వి...

ఆ. తాము గడనసేయు ధనమెల్ల దమదని
నమ్మి యుంద్రు వెఱ్ఱినరులు భువిని
తా మొరుల కొసంగఁ దమకును నది కల్గు, వి...

ఆ. తా మొరులకుఁ బెట్టఁ దమకును గలుగును
నడుగ నిడినఁ దాము నడుగఁగలరు
ఇందు నీనివాని కెందును గలుగదు, వి...2407

ఆ. తీర్ప నార్పలేని తీర్పరితనమును
కూర్ప విప్పలేని నేర్పుపనులు
పెట్టిపోయలేని బీరముల్ వ్యర్థముల్, వి...

ఆ. దాతగానివాని తలఁచుగా వేఁడిన
వాఁడు దాత యగునె వసుధ నెందు
నపురు దర్భయగునె యబ్ధిని ముంచిన, వి...

ఆ. దాన మడుగువాఁడు ధరలోన నధముండు
దాన మడుగనతఁడు దైవసముఁడు
దాన మీనివాఁడు ధన్యుఁడు గాఁడయా, వి...

ఆ. దానములను జేసి దరిఁ జేరు నొకవంక
మనసు నొకటి నమ్మ మాయఁ దగులు
జ్ఞాన మెపుడు నమ్మఁ గడ తేర్చు కడగండ్ల, వి...

ఆ. దానములను జేసి ధరఁ గీర్తినొందంగ
బహుధనముల నొసఁగి భక్తిలేక
తుదకు నరుఁడు చెడును గద కడగండ్లురా, వి..

ఆ. దానములను నన్న దానమె దొడ్డది
గానములను సామగాన మెచ్చు
ధ్యానములను శివుని ధ్యానమే శ్రేష్ఠంబు, వి.

ఆ. ధనము చాల గూర్చి తనుదానధర్మముల్
ఒనరుపకయు యిచ్చు తనయులకును
తేనె గూర్చి యీగ తెరువరులకు నీదె? వి..

ఆ. ధనము లేమి యనెడిదావానలం బది
తన్నుఁజెఱుచు మీఱి దాపు చెఱుచు
ధనములేమి మదిని దలఁచినపాపము, వి...
ఆ. ధనము గూడఁబెట్టి ధర్మంబు సేయక
యూరకుంద్రు పాపు లూహ లేక
ధనము వెంటరాదు ధర్మంబు సేయుఁడీ, వి...
ఆ. ధర్మకంటకుండు ధనముచే గర్వించి
సకలసంపదలను సరగఁ గనియు
కడకు తాను మేలు గానక చెడిపోవు, వి...
ఆ. ధర్మమన్న వినరు తనువు నమ్మిన నరుల్
యమునివారు వచ్చి యడలఁ జేసి
చొచ్చి కట్టిఁ దరుముచోఁ బొఱఁగలరొకో, వి.
క. ధనలక్ష్మిని సేవించిన
ధనమార్జింపంగ వచ్చు ధర్మముగానే
ధనహీనులకు నొసంగెడు
ధనమే మూలంబు ముక్తి దారికి వేమా! 2419
తే. ధర్మపరుఁడైన పరిపూర్ణదాత గురుఁడు
దాన మొనరించునంతటఁ దత్వ మమరు
దాను దానగు మనసంబు దాఁకఁగ నగు
దాన సార్థక్య మాపుడటు తనరు వేమ! 2420
ఆ. ధర్మ మరసి పూని ధర్మరాజాదులు
నిర్మలంపు ప్రౌఢి నిల్పికొనిరి

ధర్మమే నృపులకు తారకయోగంబు, వి...

ఆ. నమొనమొ యనవచ్చు నారాయణనవచ్చు
మేలువారిఁ జూచి మెచ్చవచ్చు
కొంగుకాసు నడుగ గొబ్బున నీలేరు, వి...

## స్వభావపద్ధతి.

ఆ. ఆడుదానిబొంకు గోడపెట్టినయట్లు
పురుషవరునిబొంకు పూరితడుక
స్త్రీల నేర్పు మగలఁ జీకాకుపఱచురా, వి...

క. ఆలనఁగల సౌఖ్యములకు
నాలయ మగునేని దాని నాలనవచ్చు
న్నాలాగునఁ గాకుండిన
గాలుని పెనుమాత యదియె కదరా వేమా!

క. ఆ లనఁగా నాత్మసుమీ
యా లనఁగా నమ్మసుమ్మి యరయఁగ మదిలో
నా లక్ష్మి యనఁగ నెవ్వరో
వాలాయము దీని దెలియవలయును వేమా!

ఆ. ఆలిఁ దోలి వెంట నధముఁడై తావెంట
నేల పోవువల్ల నెడ్డెతనము
చెట్టు నుదుర నిచ్చి చిదిమినఁ బోవునా? వి.

ఆ. ఇంతిచనులబిరుసు కొంతకాలమె గాని
పంతగించి చూడ పాలతిత్తి
చెంత విడక యేడ్చి చీరఁడా పుత్త్రుఁడు, వి...

ఆ. ఇంతి తనదుపేరె యెల్లకాలంబును
ప్రజలు దలఁచునట్లు ప్రతిభ గాంచె
నింతికి పతిభక్తి యెంతనవచ్చును? వి... 2128

ఆ. ఇహపరంబులందు నింతులపై నాన
సహజవృత్తి దగిలి సమయుచుండ్రు
రహితమమరు భక్తి రాణింప దేలొకో, వి...

ఆ. ఈఁత వచ్చినపుడు లోఁతనిపించునా
ప్రాతదోషి కెపుడు భయము లేదు
క్రోఁతి కొమ్మ కెక్కి కుప్పించి దూకదా, వి...

ఆ. ఎట్టిజీవికైన నిల కాంత భ్రాంతియే
తెలియరయ్య యెపుడు తేటగాను
మనసుశుద్ధి గన్న మఱియొక్కటగు నయా, వి.

ఆ. ఎట్టిస్త్రీలఁ గనిన నింతింత యనరాదు
కామవహ్ని లక్కగరఁగినట్లు
ఇట్టి గాఢమోహ మెంతైనఁ జేయురా, వి...

ఆ. ఒడలు శిథిలమైన నోరుపు గలసతి
గుణము మేల్మిఁ బట్టి కోటిసేయుఁ
బ్రాఁత యెనుము పాలు రోఁ తనవచ్చునా? వి.

ఆ. ఔర యాఁడుదాని నాబ్రహ్మ సృష్టించె
పురుషుపాలిటి పెనుభూతమట్లు
దానివలను జిక్కి గానివాఁడుండఁడే, వి...2434

ఆ. కాకిగూఁట నాఁడుకోకిల తనగ్రుడ్ల
బెట్టి పెనుపఁ జేయు గుట్టెఱుఁగుఁడి
యాఁడువారిమోస మప్పుడైనఁ దెలియదా? వి.

ఆ. కాంతమేను జూచి కలవరపడెదరు
కడుపులోని రోఁత గానలేక
ఇంతరోఁత గల్గు నీదేహ మేలరా, వి... 2436

ఆ. కూటికి నెడఁబాసి కూర్చున్న మనుజుఁడు
వెలదులఁ గనుఁగొన్న వెతలఁబడును
చెలఁగి యగ్నిఁ జూచు శలభంబుచాడ్పున, వి...

ఆ. కూడుచీరఁ బాసి గుల్లపంచలఁ బడు
నట్లు వ్రాసె బ్రహ్మ యతుల నొసలు
తోయజాక్షి చేర దోసంబు లంటురా, వి...

ఆ. కైక పుట్టి చెఱిచెఁ గా రాముపట్టంబు
సీత పుట్టి లంక చెఱిచెఁ గాదె
కౌరవులను జెఱిచెఁ గద ద్రౌపదియుఁ జూడ, వి

ఆ. కొప్పుసొగసు గన్న కుచకుంభములు గన్న
చెప్పరానితావు చెలిమి గన్న
ముప్పిరి గొనుచుండు మునికైన మోహము, వి.

ఆ. చక్కనైనవాని మక్కువ గన్నంత
తక్కువగనుఁ జూచు తనదువిభుని
ఆఁడుబుద్ధికంటె నపరబుద్ధి యిఁకేది? వి.... 2441

ఆ. చదువులెల్లఁ జదివి సర్వజ్ఞులై యుండి
బ్రహ్మవిద్యలెల్ల పదట గలిపి
పడఁతిఁ దలఁచునంత పరమయోగము మాను,వి.

ఆ. గుణవతి గలగృహము గోము నొందించును
చీఁకటింట దివ్వె చెలఁగునట్లు
దేబె యున్నకొంప దివ్వె మల్పినయట్లు, వి...

క. జిత్తులమాటలు లనందగు
తొత్తులతోఁ గూడ నేమి తుష్టి గలుగురా
చిత్తమున బ్రహ్మ మరయుము
సత్తత నీకప్పు డొప్పుఁ జాలును వేమా! 2444

క. జిలిబిలిమాటలు పలికెడు
కులటల నమ్మంగరాదు కుహనయదగురా
తెలివితో నవహానించుచు
తొలిప్రియముచుచూపకుండతొలఁగుము వేమ!

తె. జారుచనుదోయి పై కొత్తి చేర బిగియఁ
గంచుకము కట్టి కామినీకపటవేష
ధారిణులవలఁబడి నీవు తగులుకొనకు
తలఁగు మది నరకము చేర్చు దారి వేమ!2446

ఆ. జాలలోన నుండి స్త్రీల వీథులవంకఁ
జూడ నీయరాదు సుమ్ము వినక
చేతు రేని యట్లు చేటులు మూఁడురా, వి... 2447

ఆ. జగడమునకు బోదు జారిణి యెప్పుడు
మాయఁ జేసి పురుషు మమతఁ బెట్టు
కానిమాటలాడుగయ్యాళి సతతము, వి...

ఆ. జ్ఞాత యైనవాని నేతగా భావించి
నీతు లెఱుఁగవలయు నియతిగలిగి
జ్ఞాను లున్నలాభ మూను నే తెలియమి, వి...

ఆ. తేనె పంచదార తియ్యమామిడిపండు
దిన్న గాని తీపి తెలియ రాదు
కన్న నింపు పుట్టు కామిని యధరంబు, వి...

ఆ. తొడలమెఱుపుఁ జూడ దొడ్డచనులఁ జూడ
వగలు చూడ వానివన్నెఁ జూడ
నయ్యల కెపుడైన నాశలు పుట్టవా? వి...

క. తొమ్మిదిక్రంతల తిత్తికి
నిమ్మగుసొమ్ములును కులము నేటికి చెప్పుమా?
నమ్మకు దేహము నాదని
నెమ్మది బ్రహ్మంబు తెలియు నేనని వేమా! 2452

ఆ. దేహభావమెల్ల తెలియంగఁ జూచిన
నఖిలహేయములకు నాలయంబు
పరసతిగమనంబు ప్రత్యక్షనాశము, వి... 2453

క. సతిచేసి పతిని వేఁడెడు
సతి మర్మము కానవచ్చు సరసోక్తులనే
మతిపోక లడఁచిపట్టిన
సతిదుర్గతి వీడినదగు సత్యము వేమా! 2454

క. నభమైన నందవచ్చును
ఇభమును బట్టంగ వచ్చు నిముడికగానే
వ్యభిచారిణి మది నిలుపఁగ
ప్రభువులకును సాధ్యపడదు పైకొన వేమా!

ఆ. నరుని బిందువునను నాతిగర్భము దాల్చు
రాతియుప్పుచేత రసము దాల్చు
బుద్ధితెలివియున్న భువనంబు తాల్పదా, వి...

ఆ. నాఁడెమైన చెడిప నయ మెఱింగి తిరుగు
విటుని గుత్తరించు వివర మెఱుఁగు
బానిసైనతొత్తు పాటింపరాదయ, వి... 2457

ఆ. నాతిపైనిప్రేమ నానాఁటికిని రోఁత
జ్యోతిపైని ప్రేమ జూడఁగాను
మాతృప్రేమ యొకటె మర్యాద దాల్చును, వి.

ఆ. నాథుఁ డున్నయట్టి ననబోఁడియాతని
దేవుఁ డనుచు నెంచి సేవఁ జేయఁ
దగును గాని యొరుని తా నంటవచ్చునా? వి.

ఆ. నీళ్లమీఁదఁజూడు నెఱయ నోడల బల్మి
బట్టబయలఁ జూడు బండిబలిమి

ఆఁడుదాని బలిమి నాడనే చూడరా, వి...

ఆ. పలుకనేర్చు నపుడు బంగార మాసించు
మాటలకు వలచుట మహిమ గాదె
కొఱక నేర్చినదియుఁ గొఱికిన చెప్పునా? వి...

ఆ. పతిని తిట్టరాదు పదివేల కైనను
రెట్టి చెప్పరాదు ప్రియముగాను
పతిని మీఱరాదు సతి మానవతి యేని, వి....

ఆ. పతిని నిందఁ జేసి పాటించి యెంచని
సతుల కెట్లు ముక్తి సాధక మగు
ఎట్లు కల్గు నియతి నెంచఁగా శక్యమా, వి...

ఆ. పతిని భావమందు పరమాత్మగా నెంచు
పడఁతి కమరుగతిని పరమటంద్రు
పతిని దూరునట్టి పడతికి దుర్గతి, వి... 2464

ఆ. పరపురుషునిమీఁదఁ బ్రాణంబు పెట్టుక
మగువ సేయఁ జూచు మంచితనము
అట్టిభంగి యోగి యాత్మను భావించు, వి...

ఆ. పరసతిగమనంబు ప్రత్యక్షనరకంబు
అరయ నిందల కెల్ల నాలయంబు
పురుషుఁడు వినఁ జంపు భూపతి నొప్పించు, వి.

ఆ. పిచ్చివాని కైన పేదవానికి నైన
కుష్ఠరోగి కైన కుంటి కైన
భామ కానుపింపఁ బాముల పెట్టురా, వి...2467

ఆ. బోఁటి యొకతె బ్రహ్మ నోటిమీఁదనె తన్నె
కొమ్మ యొకతె విష్ణురొమ్ము తన్నె
సఖియ యొకతె శివుని సగముగాఁ జేసెను, వి.

ఆ. బొల్లిమాటలాడు బోగముదానితో
దొల్లి డుల్ల నిల్లు గుల్లఁజేసి
వెళ్లిర మ్మటంచు వెడలించు నింటిని, వి...2469

ఆ. భాగ్యవంతురాలు పరులయాఁకలి దప్పి
తెలిసి పెట్టనేర్చు తీర్పనేర్చు
తనదు దుష్టభార్య తనయాఁకలినె గాని
పరులయాఁక లెఱుఁగఁబడదు వేమ! 2470

ఆ. భార్య తనదుపాలిభారపుసంకెలల్
చిన్నచిన్నశిశువు జింజరీలు
అరయఁగ చెఱసాల యగును సంసారము, వి.

ఆ. మగఁడు తప్పులేక మనసిచ్చియున్నను
సహజగుణము విడదు జారకాంత
పిండిదిన్నకుక్క పీతికాసింపదా? వి.... 2472

ఆ. మగఁడు మదనుఁడైన మంచికాఁపురమైన
సహజ మేల మాను జారకాంత
పాలుద్రావు కుక్క పరుగెత్తి పోవదా, వి...

ఆ మాటమిగులు నాలు మగనికి యమదూత
యోరపడఁగ పాము కుద్ది యగును
తనకుఁగానియాలు దానవురాలురా, వి...2474

ఆ. మానధనము విడదు మఱిపుణ్యవతి యైన
బూని పతికి భక్తి పొసఁగఁ జేయు
లోన మెచ్చుచుండు లోగుట్టు గనవలె, వి...

ఆ. యోనిలింగమందు నుద్భవమయ్యెను
వాదమేల తనకు భేద మేల
ఆదిహరుఁడె తండ్రి యాహరియే తల్లి, వి....

ఆ. యోనిలోనె పుట్టి యోనిలోనే పెరిగి
యోనిలేని తెరువు గానలేక
యోనిఁ జూచి పరమయోగంబు మఱచురా, వి.

ఆ. వరుఁడు చక్కనైన వజ్రాలగని యైన
తళుకుమెఱుపువంటి తత్త్వమున్న
నన్యపురుష వాంఛ యాఁడుదానికి నుండు, వి.

ఆ. వల్లభునికి నిష్టవస్తువు నందిచ్చి
యతనిమానసమున కతికియున్న
నట్టివనిత మంచికట్టడి కలదగు, వి... 2479

ఆ. వశము గానియాలి వైర మే మనవచ్చు
యశముఁ జెఱుచు గాని యనువుపడదు
కొసరు జెల్ల దానికోరిక నే తీర్చు, వి...2480

ఆ. వాడ సత్యమెల్ల వడిసముద్రములోన
బండి సత్యమెల్ల బట్టబయల
నాఁడుదానిసత్య మేడను జెల్లదు, వి... 2481

ఆ. వాదమాడి తిట్టు వరుస నెవ్వరినైన
జేరరా దటన్నఁ జేటు తెచ్చు
గడుసురాలు తెలియ వడిసెలఁబోలురా, వి...

ఆ. వెడగువేత్త లగుచు వినగన రీనరుల్
వేయిమార్గములను వేలుపజుఁడె
అతఁడు సృష్టికర్త యంతకు గురు తెన్న, వి...

ఆ. వెతలు దీర్చువాఁడు వేదాంతవేద్యుఁడు
రతుల నేలువాఁడు రమణుఁ డగును
పతిని బెనఁగువాఁడు సంసారయోగిరా, వి...

ఆ. వెదక వెదక దొరకు వేదాంతవేద్యుండు
వెదకువానిఁ దాను వెదకు చుండు
వెదుక నేర్చినట్టి వెరవర్లు గలరొకో, వి...2485

ఆ. ముద్దుగుమ్మ కేల ముసలిమగఁడు మది
వశముగాక విటుని వలను జిక్క
వెఱ్ఱి ముద్దునకును వేదశాస్త్రము లేల? వి...

ఆ. సముదయంబునందు సర్వ మొక్కటియైన
వైర మొదవ దేమి వార లేమి
ఎచ్చుతగ్గులందు నేర్పడనే హాని, వి... 2487

తే. సర్వకులధర్మమర్మముల్ సంతరించి
సకలయోగంబులను మించి సమ్మతముగ
బట్టబయలందుఁ జేరుటే బ్రహ్మవిద్య
గుట్టిది యటంచుఁ దెల్పురా గురుఁడు వేమ!

ఆ. సాధుసజ్జనులను సంతరించినవాఁడు
ప్రజలసంతసంబు పఱచువాఁడు
కదిసి శాత్రవులను గరుణఁ జూచినవాఁడు
పాదుకొన్న ముక్తిపరుఁడు వేమ! 2489

ఆ. సిగ్గటంచనఁబడు సిగ్గ దెచ్చో నుండు
నాఁక లెచటనుండు నరయగాను
దాఁగియున్నవాని దా నేల తెలియఁడో, వి...

ఆ. సిగ్గు గల దటంచు సృష్టిలోపలివారు
వెఱ్ఱివేమనఁగని వెఱఁగుపడిరి
తనకుఁ గలుగు సిగ్గు దైవ మెఱుంగఁడా? వి...

ఆ. సిగ్గు దాఁగు నెచట జీఁకటి యెట దాఁగు
నాఁక లేడ దాఁగు నాత్మలోన
దాఁగియున్ననిద్ర దాఁగుట తెలియుఁడీ, విశ్వ.

ఆ. సిగ్గు విడువకున్న శివసౌఖ్యమే లేదు
తగ్గి మొగ్గకున్న సిగ్గు విడదు
సిగ్గు విడుచువాఁడె చిరకాలజీవిరా, వి...2493

ఆ. శీలవ్రతముచేత శిష్యులశిష్యులై
తపసి కర్మములను దార వోసి
విశ్వకర్మకులము వీటిఁ బుచ్చిరి గదా, వి...

ఆ. సున్న మన్న నేదో సూక్తిని దెలిసిన
వన్నె గన్న యట్టి వారు గాక
యెన్నఁగలరె యొరు లింకెన్ని యోజించిన, వి.

ఆ. సొమ్ము గన్నదనుక జ్యోతివెలుఁ గనవలె
సొమ్ము గన్నవెనుక జ్యోతి యేల
దేవుఁడైన వెనుక దేహంబు చీఁకేల, వి...2496

ఆ. సొమ్ము లున్నచోట్ల శోధింపఁగలుగును
సొమ్ము లేనిచోట శోధ యేల
అంజనంబులేక యాసొమ్ము తెలియదు, వి...

ఆ. సోమయాజి ననుచు సొంపుగా వేషంబు
గట్టిమాంస మెల్లఁ గాల్చి తినును
ద్విజుఁడఁ దా ననఁగ నధిక మేమి గల్గును? వి...

ఆ. సోమలతలరసము సోలలకొలఁదిని
ద్రావ నేల తామె మే లటంద్రు
క్రతుఫలంబు కంఠగత మగుఁ గాఁబోలు, వి...

ఆ. స్వప్నమనఁగ మేనిస్వాతంత్ర్యమా గాదు
స్వప్నమనఁగ జీవ సంకటంబు
అల్పనరుఁడు తెలియు టవనిలో నరుదయా, వి.

ఆ. స్నాన మొనరఁ జేసి సద్ధర్మ మీయక
నీళ్లమునుఁగ నగున నేర్పులేక
నీళ్లయందు కోడి నెలవుగా మునుఁగదా! వి.

ఆ. స్నానసంధ్యజపము జరియించు భుజియించు
నిష్ట లెన్నియైన నెఱవుగాని
ఒకని కీయఁడేమి సుకృతంబు కలుగునో, వి...

ఆ. స్వానుభూతిలేక శాస్త్రవాసనలచే
సంశయంబు విడదు సాధకునకు
చిత్రదీపమునను చీఁకటి పోనట్లు, వి... 2503

ఆ. స్త్రీలచనులు పూలచెండ్లుగాఁ బోల్చును
ప్రాలుమాలినట్టి పందకొడుకు
చన్ను లెట్లు పూలసాటియగా చెప్పుము, వి...

ఆ. స్త్రీలఁ జూచి నరుఁడు చిత్తంబు నిలుకడ
చేయలేక తాను చెడును గాదె
ఏటికట్టమ్రాన నెందాఁక నిలుచురా, వి...

ఆ. స్త్రీలు కల్గుచోటఁ జెల్లాటములు కల్గు
స్త్రీలు లేనిచోటు చిన్నవోవు
స్త్రీలచేత నరులు చిక్కులఁ బడుదురు, వి...

క. అతినిద్రావంతునకు
న్నతిపానికి నిరశనునకు నతికోపునకున్
ధృతిహీనున కపకృతునకు
జతపడ దీబ్రహ్మవిద్య చాటర వేమా! 2507

ఆ. అవ నెఱిఁగినమగువ యనువెర్రి చనువెర్రి
ముదముతోడి మగనిమోహ మెఱుఁగు
విభుని శ్రేష్ఠగుణము వేశ్య తా నెఱుఁగునా? వి.

ఆ. అధికజనులతోడ నాప్తులతోడను
పరువు గురు తెలెంగి పలుకకున్న

వచ్చు చెడ్డతనము హెచ్చుగా గాంభీర్య
మహిమ హానిఁ జెందు మహిని వేమ! 2509

ఆ. అనఁగ ననఁగ రాగ మతిరమ్యమై యుండు
వెనఁగఁ బెనఁగ సతికి ప్రేమ పుట్టు
తినఁగఁ దినఁగ వేము దియ్యనై యుండురా, వి.

ఆ. అనువు గానిబంటు నల్పుఁ డేలినయెడ
మాఱుమలయు నొండె మగుడు టొండె
దూలమూతకోల దొరకినచందము, వి... 2511

ఆ. అప్పుడీయ రోఁత హరిహరాదుల కైన
మొప్పెతోడ మైత్రి మొదలె రోఁత
తప్పు పలుక రోఁత తాఁకట్టిడిన రోఁత,వి...2512

ఆ. అరయ లజ్జఁ జూడ నందఱియందుండు
లజ్జ లేనివాఁడు లాలితుండె
లజ్జ గల్గువానిలాభంబు లేమయ? వి... 2513

ఆ. అల్పుఁ డైనవాని కధికార మబ్బినా
దొడ్డ కొంచె మనక తూలఁ బలుకు
చెప్పుకొఱకు కుక్క చెఱకు నే మెఱుఁగురా? వి.

ఆ. అల్లుని కగుమృతికి నాత్మ జింతించును
తనయుమృతికి తాను తల్లడిల్లు
పుణ్యపురుషు మృతియు భూమికి మృతియగు,వి.

ఆ. ఇంగలంబుతోడ నిల నల్పుతోడను
పరునియాలితోడ పతితుతోడ

సరసమాడు టెల్ల చావుకు మూలము, వి...

క. ఇచ్చకము భువి నవశ్యము
కుచ్చితే మిహలోకనింద కోవిదునకు నీ
తచ్చననె హాని వచ్చును
మచ్చరమే తన్ను జెఱచు మహిలో వేమా!

ఆ. ఇహమునందు బాధ లెన్నైన బడవచ్చు
యముని బాధ లేక యమరవలెను
పరుని బాధ లేక బ్రతుకుఁడు నరులార, వి...

ఆ. ఈఁగతల విషంబ దిముడదు నీలోన
తేలు తోఁకవిషము తెంపుఁ జూపు
పాముకోఱవిషము పట్టి చంపును గదా, వి...

ఆ. ఈఁగ తేనెరుచికి నింపుగాఁ జచ్చును
ఓగు కామరుచికి నొదిగి చచ్చు
త్యాగి గానివాని ధర్మ మడిగినఁ జచ్చు, వి...

ఆ. ఉక్కుచూర్ణము దిన నుడుగును కష్టంబు
లుక్కుచూర్ణము దిన నుడుగు క్షయయు
నుక్కుచూర్ణము దిన నుడుగును కర్మముల్, వి.

ఆ. ఊపి రున్నయపుడె యుపదేశ మందుము
రూపుమాయు నెపుడొ రూఢిగాను
బాపఁడైన నేమి బడబాగ్ని మ్రింగునా? వి...

ఆ. ఋణము పెంచి నరుని హీనుగా నొనరించి
విడుచు తండ్రి వైరిపేరుఁ డరయ

అలవిగానియట్టి యాలును నట్టులే, వి... 2523

ఆ. ఎంచి యెంచి పూజ లెన్ని సేసిన నేమి
భక్తిలేని పూజ ఫలములేదు
కానపూజ సేయఁ గారణ మెఱుఁగుఁడీ, వి...

ఆ. ఎఱుక లేనిదొరల నెన్నాళ్లు కొలిచిన
బ్రదుకులేదు వట్టిభ్రాంతికాని
గొడ్డుటావు పాలు గోకిన చేఁపునా? వి... 2525

క. ఏగుణముల నాపదలగు
నాగుణము లడంప వలయు నాసక్తుండై
ఏగుణములు మే లొనరుచు
నాగుణముల ననుసరించి యలరుము వేమా!

ఆ. ఐకమత్య మెన్న నాల్మగలకు వాసి
మగని బుద్ధు లెల్ల మగువ నేర్చు
దానిరక్షణంబె వానిరక్షణ మగు, వి... 2527

ఆ. ఐకమత్య మొక్క టావశ్యకం బెప్డు
దానిబలిమి నెంత ఘనులైనఁ గూడు
గడ్డివెంటిఁ బెట్టి కట్టరా ఏనుంగు? వి... 2528

ఆ. ఐదువ్రేళ్లబలిమి హస్తంబు పనిఁజేయు
నం దొకటియు పీడ బొందిక చెడు
స్వీయుఁ డొకఁడు విడిన చెడుఁగదా పనిబల్మి? వి.

ఆ. ఐనవారలంచు నాప్తు లటంచును
బంధుగులను నమ్మ పాడిగాదు

తనకు నైనవాఁడు తా నొకఁడే యగు, వి...

ఆ. ఔరసుండె నీకు వారసుం డగుఁ గాక
వేశ్యయందుఁ బుట్టు వెధవకొడుకు
నీవు పోయినపుడు నీకైన వదలునా? వి...2531

క. కనరానిది పరపంచన
వినరానిది గురునినింద విని కనియును తా
ననరానిది పెద్దలమతి
మనరానిది మానహాని మహిలో వేమా! 2532

క. కలికంతునికోపముచలె
వరగౌతముశాపమట్టు వర్ణింపంగాఁ
జిరకష్టజీవులై తగు
నరులును వది నొచ్చి తిట్ట నాశమె వేమా!

ఆ. కల్ల నిజము రెండు కలికంతుఁ డెఱుఁగును
నీరు పల్ల మెఱుఁగు నిజముగాను
తనయునిజన్మంబు తల్లి తా నెఱుఁగును, వి...

ఆ. ఖగములందు చూడఁగా ముచ్చటగ నుండు
తెగలు గన్న నైన తేటపడదె
దేవ డీనిసాగసు దేబె నీకేలరా, వి... 2535

ఆ. ఖలులతోడిపొందు కలుషంబు గలిగించు
మాన దెంత మేటిమానికైన
వానిచేరఁ దీయ వలవదు చెడుదువు, వి...

ఆ. చిక్కియున్నవేళ సింహంబు నైనను
బక్కకుక్క యైన బాధసేయు
బలిమి లేనివేళ పంతములు చెల్లవు, వి...2537

ఆ. చెప్పులోనిరాయి చెవిలోనిజోరీగ
కంటిలోనినలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు ఇంతంతకాదయా, వి...2538

ఆ. చక్కదనము లేల సంపద లేలను
విద్యలేల భూమి సిరివి యేల
పుత్రపదవికన్నఁ బుట్టునె పదవులు? వి... 2539

ఆ. చదివినతనికన్న చాకలియే మేలు
కులము వేల్పుకన్న కుక్క మేలు
సకలసురలకన్న జారభామిని మేలు, వి...2540

ఆ. జంత్రమంత్రమహిమ జాతవేదుఁ డెఱుంగు
మంత్రవాదియెఱుఁగు దంత్రమహిమ
తింత్రిణీకమహిమ తినువాఁ డెఱుఁగును, వి...

ఆ. జీవి తొలఁగనపుడె జీవనౌషధ మిచ్చి
జీవి నిలుపవలయు జీవనముగ
జీవి తొలఁగెనేని జీవనౌషధ మేల? వి...2542

ఆ. జన్మములను మఱియు జన్నియల ననేక
ముల నొనర్చి యున్న ఫలము గాన
రాక యుండునీతి లేకున్నమాత్రాన, వి...2543

ఆ. ఝషము నీరు వెడల జచ్చుటే సిద్ధము
నీట నుండె నేని నిక్కిపడును
అండ తొలఁగు వెడల నందఱపని యట్లె, వి...

ఆ. డీకొనంగఁ దగదు డెంద మెఱుంగక
యడుగవచ్చి కొంత యనినవాని
చెప్పునంత వినియు మెప్పుగాఁ బలుకుమీ, వి.

ఆ. తగవు తీర్చువేళ ధర్మంబు దప్పిన
మానవుండు ముక్తి మానియుండు
ధర్మమునె పలికిన దైవంబు తోడగు, వి...

ఆ. తగినకులజుఁడైన తనయెత్తుధనమైన
పరపురుషుని నేల పట్టనిచ్చు
పరమసాధ్వి చూడ నొరుల నంటదు సుమా! వి.

ఆ. తండ్రిమాటలు విని తల్లిని దెగటార్చి
పరశురాముఁ డేమి ఫలము గనెను
నిలువ నీడ లేక కులగిరిఁ జేరఁడా? వి... 2548

ఆ. తనయుఁ డెవ్వఁడేని తనతండ్రికంటెను
పేరు తెచ్చునట్టి పెద్దయైన
జనకు హీను జేయ సాహసించినఁ జేటు
మూఁడు నిహపరముల మొనసి వేమ! 2549

ఆ. తన్ను గన్నయట్టి తల్లివంటిది సుమ్ము
అన్యకాంత న్యాయమరసిచూడ
కన్నదానిజనులు కానంగలేరయా, వి... 2550

ఆ. తప్పుపలుకు పలికి తాటోటు జేసిన
కూడియున్న లక్ష్మి క్రుంగిపోవు
నోటికుండ నీళ్లు నొనరఁగా నిల్చునా? వి...

ఆ. తరుణి పుణ్యవతిగ వరుని పట్టియె యగు
పాపిని యగుమగని ప్రాపువలన
భర్తవర్తనంబె పడఁతులయం దుండు, వి...2552

ఆ. తల్లిదండ్రులందు దారిద్ర్యయుతులందు
నమ్మిన నిరుపేద నరులయందు
ప్రభులయందుఁ జూడ భయభక్తులుంచుము, వి.

ఆ. దళముకొని యొకళ్లు దారిద్ర్య మేర్పడ
హీనకార్యములు సహించి చేయ
బరువు మాయునింతె ఫలమింత చిక్కదు, వి.

ఆ. దానధర్మములును దయయు సత్యము నీతి
వినయధైర్యశౌర్యవితరణములు
రాజుపాలిటి కివి రాజయోగంబులు, వి...2555

ఆ. దొంగతనము అంకు దొరసియుండు జగతి
రంకులాడి కింట శంకపుట్టు
దొంగకెన్న తేవెలుం గొప్పుకానట్టు, వి... 2556

ఆ. దొంగమాటలాడ దొరకునె మోక్షము
చేతగానిపలుకు చేటుదెచ్చు
గురువుపద్దు గాదు గుణహైన్య మది యగు,వి.

ఆ. దొమ్మతెగులుచేత ద్రూలినగేదెకు
వాతవేయ బ్రదికి వచ్చెనేని
ప్రాఁతయెనుముపాలు బోఁతనవచ్చునా, వి... 

ఆ. ద్విజకులంబునందు తేజరిల్లుచుఁ బుట్టి
తాఁ దరించి యొరుల దాఁటఁ జేయ
లేనియాతఁ డున్న లేకున్న నొక్కటె, వి...2559

ఆ. ద్విజుల ఖేదపెట్టి తిట్టఁ దొడఁగువాఁడు
మృతిని బొంది తాను వెతలఁ బడఁగ
గాలుదరిని జేరుఁ గడ తేఱలేఁడయా, వి...2560

ఆ. దోసకారియైన దూసరికాఁడైన
పతితుఁడైన వేదబాహ్యుఁడైన
వట్టిలేనిపేదవాని కీఁదగు నీవి, వి... 2561

క. నందనుఁడు పెరిగి పెద్దల
కందఱకు విధేయుఁ డైన నానందముగుణా
పొందిక చెడి సత్పురుషుల
నిందను బడఁ జింత కలుగు నిక్కము వేమా!

క. నలుగురుగలచోటను దా
దల చూపుచు మెలఁగుచుండి ధన్యత గనఁగాఁ
దలఁచెడియాతఁడు విచ్చలు
గలమాటలె పలుకుచుండఁగాఁ దగు వేమా!

ఆ. నాగుబాము గన్న నంబిబ్రాహ్మణు గన్న
చెవులపిల్లి గన్న చేటువచ్చు

గరుడుని గనుఁగొన్న గలుగును కోరికల్, వి...

ఆ. నిక్కమైన మంచినీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాలు తట్టెఁ డేల
చదువ పద్య మరయ చాలదా యొక్కటి? వి...

ఆ. నిజము లాడువాని నిందించు జగమెల్ల
నిజముఁ బల్కరాదు నీచులకడ
నిజమహాత్ముఁ గూడ నిజ మాడవలయురా, వి...

ఆ. నీతిజ్యోతి లేక నిర్మలం బగు నేది
ఎట్లు కలుగుఁ బరమ దెంత దైన
ధనము గల్గియున్న దైవంబు గలుగదు, వి...

ఆ. నీతి దెలియఁ జెప్ప నిజముగ వేమన
పాతకముల నెల్ల బాఱఁబట్టి
లోతుతత్త్వ మరసి లోకులకును జెప్పె, వి...

క. పగ యుడుగుఁ గోప ముడిగిన
పగయుడుఁగ గోర్కులుడుగుఁ బరజన్మంపుం
దగు లుడుగు భేద ముడిగిన
త్రిగుణము లుడుగంగ ముక్తి స్థిరమగు వేమా!

ఆ. పట్టి విడువరాదు పదిలక్షలకు నైనఁ
బెట్టి చెప్పరాదు పేద కైన
వెట్టిగొలువరాదు విభుఁ డెట్టి ఘనుఁడైన, వి...

తే. పటుతరంబుగ తనయాత్మభావ మంది
నిటలదుర్గముపై నున్న నియతి మీఱి

ఘటీము మఱచినవాఁడు హో ఘనుఁడు సుమ్మి
కుటిలకర్ముల కిది యెట్లు కూడు వేమ! 2571

ఆ. పడుచు నిచ్చినతని బత్తె మిచ్చినవానిఁ
గడుపు చల్లఁ జేసి ఘనత నిడుచు
నడుప నేర నతఁడు నాలిముచ్చే గదా! వి...

ఆ. పతకమందు నొప్పు బలురత్నముల పెంపు
బంగరందు గూర్పఁబరువు గనును
గాని యితరలోహ మైన హీనముకాదె, వి...

ఆ. పత్తనములఁ గలరు ప్రౌఢాంగనలు వారు
పల్లెలందు నిలిచి బ్రదుకఁ గలరె
సుఖులు పరమదారి శోభింపఁజాలరు, వి...

ఆ. పంది పిల్ల లీను పదునైదు నొకటిని
కుంజరంబ దీను కొదమ నొకటి
నుత్తమపురుషుఁ డటు లొక్కఁడు చాలఁడా?వి.

ఆ. పదుగురాఁడు మాట పాటియై ధరఁ జెల్లు
నొక్కఁ డాడుమాట యెక్క దెందు
నూరకుండ వానికూ రెల్ల నోపదు, వి... 2576

ఆ. పనసతొనలకన్న పంచదారలకన్న
జుంటి తేనెకన్న జున్నుకన్న
చెఱకురసముకన్న చెలులమాటలు తీపి, వి...

ఆ. పప్పులేనికూడు పరుల కసహ్యమై
యప్పులేనివాఁడె యధికబలుఁడు

ముప్పులేనివాఁడు మొదటిసుజ్ఞానిరా, వి...

ఆ. పరఁగ రాజకులులు పాతినధన మెల్ల
భటులపాలొ కవుల పాలొ తలఁప
నొనర హీనజనుని ధనము దాయాదుల
పాలొ జారకాంతపాలొ వేమ! 2579

ఆ. పరులదత్త మొప్పి పాలన చేసిన
నిల స్వదత్తమునకు నినుమడియగు
నవనిపరులదత్త మపహరింపఁగ రాదు, వి...

ఆ. పరులమేలు చూచి పలుగాకివలె నెప్డు
పట్టిమాటలాడువాఁ డధముఁడు
అట్టివాని బ్రదుకు టది యేల మంటికా, వి...

ఆ. పరులవిత్తమందు భ్రాంతిమానినయట్టి
పురుషుఁ డవనిలోనఁ బుణ్యమూర్తి
పరులవిత్త మరయ పాపసంచిత మగు, వి...

ఆ. పలుగువాని కేల పరసమృద్ధి దలంపఁ
బలుకు వరుసవానిబలిమితప్ప
చలమువాని కేల సాత్వికధర్మము, వి... 2583

ఆ. పలుతెఱఁగులుగాను బగ యుండుచోటుల
చిటుకు మనఁగ ప్రియముఁ జెప్పవలయు
కాల్పఁదగినకట్టె కడఁకతో మ్రింగదా, వి...

ఆ. పాడి గాదు జగతి పంచాంగములు సెప్పి
కొంచెమైన బుద్ధి నొంచ లేక

బ్రహ్మ మెఱుఁగ కిట్లు పౌరోహితము జేయ, వి.

ఆ. పాపరాశిఁ బుట్టి పాపంబు దెలియక
పాపబుద్ధిచేత బరఁగియుండు
భక్తి గలిగియున్న పాపంబు లేదయా, వి...

ఆ. పాలపతికి శకున ఫల మిచ్చు నందురు
పాలపతికి కేమి ఫలము తెలియు
తనదు మేలు కీళ్లు తనతోడ నుండఁగ, వి...2587

ఆ. అన్న మధిక మైన నరయ మృత్యువు నిజం
బన్న మంట కున్న నాత్మ నొచ్చు
చంపఁ బెంపఁ బువ్వు చాలదా వేయేల? వి...

ఆ. అన్న మిడుటకన్న నధికదానంబుల
నెన్ని చేయనేమి యెన్నబోరు
అన్న మెన్న జీవనాధార మగునయా, వి...

ఆ. ఆరుగురుని జంపి హరిమీఁద ధ్యానంబు
నిలిపి నిశ్చయముగ నెగడి యాత్మ
గతి నెఱుంగుచుండు ఘనుఁడగు యోగిరా, వి.

ఆ. ఇన్ని ఫలములందు నేఫలం బెక్కువ
అన్నఫలముకంటె నధికమేది
కన్నది గననిది కాన్పించునారూపు, వి... 2591

ఆ. ఊకయందుఁ బుట్టి యున్నది యన్నంబు
మ్రాకునందు ఫలము మానితమగు
సోకుగాలిపట్టి శోధించుచుండురా, వి... 2592

ఆ. దానములను నన్నదానమే దొడ్డది
గానములను సామగాన మెచ్చు
ధ్యానములను శివుని ధ్యానమే శ్రేష్ఠంబు, వి.

క. భయమంతయు దేహమునకె
భయ ముడిగిన నిశ్చయంబు పరమాత్మునకే
లయమంతయు జీవునకే
జయ మాత్మకు ననుచు జగతి చాటుర వేమా!

ఆ. భారతమునఁ బలుకు పలుధర్మములయందు
సత్యనిష్ఠమేటిసత్యమె కద
వసుధ దాన కలుగు వన్నియ మిన్నయా, వి.

ఆ. భావ మరసి తన్ను భార్య సేవించిన
నింటి కైన నగును నీశ్వరుండు
అదియు లేక బ్రదుకు టధమము భువిలోన, వి.

ఆ. భాషలాడ కున్న పరులు మెచ్చరు గాన
భాషలాడవలయు పరువుఁ జూచి
భాష పరువు తెలుఁగు పరమాత్ముఁడెలుఁగురా,వి.

ఆ. భూపతికృప నమ్మి భూమి చెఱచువాఁడు
ప్రజలయుసురుదాఁకి పడును పిదప
నెగుర వేయు బంతి యెంతదాఁక నిలుచురా, వి.

ఆ. భూమి నాది యనిన భూమి పక్కున నవ్వు
దానహీనుఁ జూచి ధనము నవ్వు
కదనభీతుఁ జూచి కాలుఁడు నవ్వును, వి...

ఆ. భూమి పేరువల్ల పుణ్యస్థలములాయె
వెలయ రాళ్లవల్ల వేల్పులాయె
నీళ్ల పేరువల్ల నిఖిలతీర్థము లాయె, వి... 2600

ఆ. భూమిమీఁద పుణ్యపురుషులు లేకున్న
జగము లేల వెలుఁగు పగలు రాత్రి
అంత బయలు కాదె యాడకాడకుఁ జూడ, వి.

ఆ. మగువకాలమందు మగువ కష్టించిన
సుతుల కాలమందు సుఖముఁ జెందు
కలిమిలేము లెంత గల వెంతవారికి
బలిమిపుత్త్ర బలిమె బలిమి వేమ! 2602

ఆ. మగనిమీఁద భక్తి మానకుండినకాంత
మూఁడులోకములను ముక్తి గనును
మగువలందఱకును మగలె దేవతలయా, వి...

ఆ. మనసు దెలిసి యొకనిమాటకు బ్రతిచెప్ప
సంతసించు నతఁడు చాల మెచ్చు
మనసు తెలియకున్న గునిసుచు నను నేదొ, వి.

ఆ. మనుట లెల్ల కల్ల మన సెల్ల దొంగ యిం
కేటిప్రాణ మింక నేటిబ్రదుకు
మాట సత్యమైన మరి శతాయుష్యంబు, వి...

ఆ. మైలకోకతోడ మాసినతలతోడ
నొడలిముఱికితోడ నుండెనేని
అధికకులజునైన నట్టిట్టు పిలువరు, వి... 2606

ఆ. మాటఁ జెప్ప వినని మనుజుఁడు మూర్ఖుఁడు
మాట విన్న నరుఁడు మాన్యుఁ డగును
మాట వినఁగఁ జెప్ప మానుట కూడదు, వి...

క. మాయిల్లని మాపాల మని
కాయము తనసొమ్మటంచు గామాతురుఁడై
మాయని పదవిని గోరక
దాయాదులపాలు చేయఁ దగదుర వేమా!

ఆ. మాల మాలగాఁడు మహిమీఁద నేప్రొద్దు
మాట తిరుగువాఁడె మాలగాక
వాని మాల యన్న వాఁడెపో పెనుమాల, వి.

ఆ. మాలవాఁడయినను మఱి యాత్మమీఁదను
మనసునిలిపెనేని మాలగాఁడు
మనసు నిలుపకున్న మహిమీఁద మాలఁడౌ, వి.

ఆ. మాలవానిఁ జూచి యేల నిందింపంగ
పాటిలేనిమాట పలుకుటె గద
వానిలోనఁ బలుకువానికులం బేది? వి... 2611

ఆ. ముండమోపి కేల ముత్యాలపాపట
వన్నె లెల్ల పుణ్యవతికిఁగాక
కుక్కయేపి కేల కుచ్చులపల్లంబు, వి... 2612

ఆ. మేలిపండుఁ జూడ మేలిమై యుండును
పొట్ట విచ్చిచూడ పురుగు లుండు
బెరుకువాని మదిని బింక మీలాగురా, వి...

ఆ. రజ్జు లాడరాదు రణభూమిలోపల
బుజ్జగింపరాదు బొంకువాని
నొజ్జతోడ వాదు లొనరంగ మానరా, వి...

ఆ. లక్ష్మి యేలినట్టిలంకాధిపతిపురి
పిల్లకోఁతి పౌజు కొల్లఁబెట్టె
కలసివచ్చువేళ ఘను లౌదు రల్పులు, వి...2615

ఆ. వసుధ నొడ్డెకేల వైద్యకార్యంబులు
గ్రుడ్డివాని కేల గునుగుపరుగు
బుడ్డవాని కేల పోకుప్పిగంతులు, వి... 2616

ఆ. వావివర్తనలును వరుసలు మర్యాద
దప్పి నడచెనేని తగులుకీడు
వదల దపుడు తాకువందురఁ దప్పదు, వి...

ఆ. విద్య గలిగి యుండి వినయము లేకున్న
నైదువలకు మేలిమైనమణుల
సొమ్ము లుండి కంఠసూత్రము లేనట్లు, వి...

క. విద్యలలోపల నీతియు
వాద్యంబులోన వీణ వరరసికులకుఁ
హృద్యంబై విలసిల్లును
విద్యలలో బ్రహ్మవిద్య విద్యర వేమా! 2319

ఆ. విశ్వనాథునందు విప్రులయందును
విభునియందు వేదవిధులయందు
భక్తిలేనివాఁడు పాపాత్ముఁ డిలలోన, వి. 2620

ఆ. వెలఁదిచక్కఁదనము వెఱవైన యీఁడును
విభునికరుణ లేమి విగతి నుండు
నీదు కరుణ లేమి నేర్పులు కొరగావు, వి...

ఆ. జవ్వనంబునందు జవరాండ్రతో పొందు
గోరకుండువాఁ డి కేడ లేఁడు
కాని దాని గోరకయె యున్న ఘనుఁడురా,వి..

ఆ. జడలు దాలుచుటకు జగము ఛీ యనునట్లు
నొడలు విఱుచుటల్ల యోగమెల్ల
ముక్తికాంతతోడ ముద్దాడుటకెగదా, వి.

ఆ. తలను వ్రేలవేసి తాలిమి లేకయ
యోగి తెఱచు గనులు మూయుచుండు
జ్ఞాన మిఁక నెటుండు కష్టజీవికి చెపుమ, వి...

ఆ. కసవు నేఱి తినెడుపసరముఁ దినువాని
మాల యండ్రుగాదె మహిని నరులు
పట్టి కోడిఁ దిన్న బాప లటందురా? వి...

ఆ. కాననంబుఁ జేరి కడుశ్రమ నొందిన
నాననలుండు రాజ్యమందె మరల
కష్టములకు నోర్వఁగల్గును సుఖములు, వి...

ఆ. కాలకంఠు నెదిరి ఘనముగాఁ బోరిన
నర్జునునకు వశము కర్జమైన
పాశుపతము గలిగె పగతుర దునుమాడ, వి.

ఆ. కావిబట్టఁ గట్టి ఘనయోగివలె నుండి
వెలయ రాత్రిగాఁగ విడిచిపెట్టి
తొడరి తిరుగువాఁడు దొరకోలు సన్యాసి, వి...

ఆ. కాపు కాపు మంచు కరుణకై యేడ్చెడి
శిశువు చేరఁ దీసి చిత్తమలర
పాల నిచ్చునట్టి పడఁతి పుణ్యాత్మరా, వి...2629

ఆ. కాశినీళ్లు మోసి కాళ్లు మొగము వాచి
యెందు సుఖము లేక నెండి యుండి
చచ్చి వెనుక ముక్తి సాధింపఁగలరొకో! వి...

ఆ. కాశియాత్రఁ జేసి గాసినొందఁగ నేల
రోయుగుణవికారరూప మడఁచు
మోసపోక యెఱుక మూలంబు గనుచుండు, వి.

ఆ. కుండ పగిలె నేని క్రొత్తది గొనవచ్చు
భూతలంబునందు పొందుగాను
కూలఁబడిననరుఁడు కుదురుట యరుదయా, వి.

ఆ. కొంపలోన మఱుఁగు కోకలోన మఱుఁగు
కన్నతల్లి మఱుఁగు కడుపుమఱుఁగు
ఇన్ని మఱుఁగు లందు నీశుఁడు మఱుఁగురా, వి.

ఆ. గంగ స్నానమాడి ఘను లైనవారెల్ల
భంగపడిరి పెక్కుబాధ లంది
గంగనీటికన్న గయతీర్థములకన్న
నెన్న వేముతీర్థ మెచ్చు వేమ! 2634

ఆ. గురుని సేవఁ జేసి గురితోడ భుజియింప
వలె నటంచు నరులు వాంఛదీఱఁ
బలుకుచుండ్రు గాని భావంబు గానరు, వి...

ఆ. గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ జేకొని పోవ
పండులూడఁ దన్ను బాల నియదు.
లోభివాని నడుగ లాభంబు లేదయా, వి...

ఆ. చిన్న నాఁటినుండి చేసినకర్మంబు
పిన్న పెద్దలకును బెరిగి వచ్చు
మంటి మింటి నడుమ మది నిల్పి చూడగా, వి.

ఆ. చీము గారుపంట చెదలుపట్టెడియింట
బురుగుముట్టుగుంట బుసులకంటఁ
బిడ్డచీకుచంట బిగి యుండ నేర్చునా? వి...

ఆ. చదువుఁ జదువకున్న సౌఖ్యంబులును లేవు
చదువుఁ జదివెనేని సరసుఁ డగును
చదువు మర్మ మెఱిఁగి చదువఁగఁజూడుము, వి.

ఆ. ఛత్రమున్నఁ దగిన ఛాయ యేర్పడియుండు
శాస్త్ర మెఱుఁగఁ దగినజ్ఞాన మొదవు
నబ్బియున్న వాని కండయున్నట్టులే, వి...2640

ఆ. తావు తెలిసినతఁడు తావీలు వెంబడి
ఏవిధముననైన నిరవు సేరు
భావమెఱుఁగకున్న పర మెఱుంగుట యెట్లు? వి.

ఆ. తావు తప్పకుండ తనమనంబున నిల్పి
తావుఁ జేరునట్లు తంత్రపఱచి
తాను దావుఁ జేర తావుఁ దా నేకమా, వి...

ఆ. తోఁక గల్గువాని దొడరిగొంతులు గోసి
మేఁకజీవముఁ ను మెడలు విఱిచి
కడమవాని నెల్ల గాల్చుక తిందురు, వి...

ఆ. దున్నపోతుమడక దురుతుగా సాగదు
ఎద్దుమడకకం హెచ్చుగాదు
ముద్దరాలి మగఁడు ముదుసలి మెచ్చునా, వి.

ఆ. నియమమునను వేత్త నేమంబు నొనగూర్చి
షోడశోపచారనూక్తు లిలను
జేసి శివుని నెపుడు సేవించుచుండును, వి...

ఆ. నోటిపుప్పి కెల్ల నొప్పి లేకుంటకు
నాకుపోకనున్న మౌషధముగఁ
బెట్టకుండెనేని బెనురోఁత వేయురా, వి...

ఆ. నేర్పు గలుగువారు నెఱతనముగలారు
విద్యచేత విఱ్ఱవీఁగువారు
పసిఁడిగలుగువారి బానిసకొడుకులు, వి...2647

ఆ. పట్టువస్త్రముఁ ను పరఁగ భూషణములను
కుదువ లిడుట లెల్ల గొదువ పద్దు
లనుభవింపకూడ దతఁ డెట్టివాఁడైన, వి...

ఆ. పరుల కుపకరించి పరుసొమ్ముపరునకుఁ
బరఁగ నిచ్చెనేని పరము కలుగు
బరముకన్న నేమి పావన మాసొమ్ము, వి...

ఆ. పరుల మోసపుచ్చి ధర ధన మార్జించి
కడుపు నించికొనుట కానిపద్దు
ఋణము సేయుమనుజుఁ డెక్కు_వ కెక్కు_నా? వి.

ఆ. పరులు చదువఁ జూచి నిరసనబుద్ధితో
వట్టిమాటలాడ వ్యర్థుఁ డగును
అట్టివానిబ్రదుకు లరయఁగా నేటికి? వి...2651

ఆ. పూసపోగుఁ బెట్టి పురుషునిబుజ మెక్కి
కన్నులార్చి వారకాంతఁజేరి
తనకు లొంగువానిఁ దడయక చంపురా, వి...

ఆ. పెట్టెడిపతియింటఁ బెట్టనిలోభున్నఁ
దిట్టితిట్టి తిరుగఁ గొట్టుచుండు
పండినచేనిలో పల్లేరుఁ బోలును, వి.... 2653

ఆ. బాపఁ డెముకకూడు భక్షింపసాగెను
బోవు పేరటంబు బొచ్చుముండ
కులముమానముడుగఁగోర్కు_లు మెండయ్యె, వి.

ఆ. బాపలన్న దొడ్డపరువునఁ జూతురు
కానిపనులు సేయ హీనులండ్రు
కులము లెక్క_యేమి గుణముప్రధానంబు, వి...

ఆ. బిడియ మింత లేక పెద్దను నే నంచు
పొంకములను బలుకు సంకరునకు
పెచ్చు కల్ల దిచటఁ జచ్చినరాదాడ, వి...

ఆ. బ్రహ్మను తలఁగొట్టి పారవైచినయప్పు
డడ్డపడఁగ నోపరైరి సురలు
శివునికరుణ లేమిఁ జెడిపోక పోదురా, వి....

ఆ. మత్తచిత్తులు తమమర్మంబు తెలియక
చిత్తచలనమంది చెడిరి భువిని
బత్తిలేనివాఁడు పరమాత్ము నెఱుఁగునా? వి...

ఆ. మనసున దయలేని మాలకొడుకునొద్దఁ
జేరియున్న ప్రజకుఁ జేటు నిజము
పెద్దతనము లెంచఁ బెంకెలచందము, వి....

ఆ. మనసు నిల్పలేని మాయావిరక్తులు
మనసుపడుదు రేల మగువకొఱకు
ఇంతవ్యర్థజన్మ మింక నెందులకయా? వి....

ఆ. మాటలాడఁ గలుగు మర్మము లెఱిఁగిన
పిన్న పెద్దతనము లెన్నవలదు
పిన్నె చేతిదివ్వె పెద్దగా వెలుఁగదా? వి...2661

ఆ. మాటలాడవచ్చు మనసు నిల్పగలేఁడు
తెలుపవచ్చు దన్ను దెలియలేఁడు
సురియఁబట్టవచ్చు శూరుఁడు గాలేఁడు, వి...

ఆ. మాట విననియాలు మగనికి బందాలు
దారిఁ జేరఁ బ్రాణమానహాని
అట్టియాలి విడిచి యడవి నుండుట మేలు, వి.

ఆ. మాలకన్ని యలకు మంచిరూపంబున్న
ముట్టెనే త్రిశంకుపట్టి నాఁడు
కానిపనులు సేయ ఘను లాసపడుదురా? వి...

ఆ. మాలవానిఁ జూచి యేల నిందింతురు
తూలుమాటపలుక దొమ్మ యేమొ
ఆకుఁ జూచి పలుకు నతనికులం బేది, వి...2665

ఆ. మాలవాని నేల మహిమీఁద నిందింప
నొడల రక్తమాంస మొకటె కాదె
వానిలోన మెలఁగు వానికులం బేది? వి...2666

ఆ. రాజయోగ మూని తేజమందుట ముక్తి
తేజమందకున్న దేబె లరయ
మర్మరహితగురుని మహిఁ జేరవలెనయా, వి...

ఆ. విటుఁడు డాగుఁజేసి విడిచి పెట్టినయది
పేదపెనిమిటికిఁ గని ప్రియము సేయు
కుప్పలోని చెప్పుఁ గుక్క తిన్నట్లయా, వి...

ఆ. విటుఁడు స్త్రీని రోసి విడిచిపెట్టినపిదప
నేడనున్న సిగ్గు నెంచనేల
కుడిచి వేయుపుల్లె గోతుల దొర్లదా, వి...2669

ఆ. విశ్వకర్మమహిమ వినఁగను చిత్రము
విశ్వకర్మమహిమ శాశ్వతంబు
విశ్వకర్మ లేమి విశ్వంబు నిలుచునా? వి... 2670

ఆ. వేషభాష లింకఁ గాషాయవస్త్రముల్
బోఁడినెత్తు లొప్పఁ బొరయుచుంద్రు
తలలు బోడు లైనఁ దలఁపులం బోడులా? వి.

ఆ. సతుల గవయుటయును సుతులఁ బడసెద మని
వెతలఁబడుట యెంతొ వెఱ్ఱితనము
నేల సున్నమాయి నెత్తి కెత్తినయట్లు, వి....

ఆ. హాని కల్గఁ గఁ బోదు వారి మది నెంచెదు
వాని కబ్బు పరము వసుధయందు
పూని నిష్ఠమీఱి పొదలక యుండుము, వి...

# కూటవేదాంతపద్ధతి.

---

సీ. అవనిలో నొకకప్ప యైదుపాములఁబట్టి
విడిఁబడ మ్రింగిన విధ మదేమి?
యొనర నొక్కట రెండు ఘనకపుల్ చెలరేఁగి
యొంటిపిల్లల సీను నోజ యేమి?
కలియుగంబున నక్క గర్భవాసమునందు
కామధేనువు పుట్టుకట్ట డేమి?

అవికారవృక్షంబు నరటిఫలంబులు
పుట్టినయట్టి యాపాలు పదేమి?
తే. అరయ నేర్చిన సర్వజ్ఞులైనవారు
చెప్ప నేర్చినవా రొండు చెప్పనేల?
శివుని గాంతురు భువిలోఁ బ్రసిద్ధముగను
నీకుఁ దెలియని దేముండు నిజము వేమ!

ఇనుమునఁ జేసిన మైనపుకడ్డి
ముంతమొనను నత్తావుల దొడ్డి
కూర్చుండి మేపిన కుందనగడ్డి
విప్పి చెప్పరా వేమా రెడ్డి! 2675

ఆ. ఎడ్లు రెండు తిన్న నిహమున స్తంభించు
నెడ్లుమూఁడు తిన్న నిహము విడుచు
ఎడ్లు తెలియుమనుజుఁ డేర్పడ యోగిరా, వి...

ఆ. కృష్ణసర్పమందు కృత్తిక లైదుండు
కృత్తులైదుపట్టి కృష్ణ మ్రింగె
వలయు కృష్ణలైదు వేమన మ్రింగెరా, వి...

క. చరణంబులు పదితోఁకలు
పరగంగ న్మూఁడుతలలు బయలను తిరుగున్
పరభూమి తల్లడిల్లఁగ
నిరవొందఁగ దీనిదెలియు మిలలో వేమా!

సీ. దినకరచంద్రులు చనుత్రోవలను గట్టి
పాన్పుతోడ విరులు పాదు పెట్టి

మూఁడుమూఁల యింటి మ్రోఁతలు పోకార్చి
పరఁగుముంగిలిమీఁద బదిలపఱిచి
కడుసన్నమగు గుర్తు నడయను నడివీథి
శోధించి మాత్రను మీఁదఁ బెట్టి
అణువను జ్యోతియై యానందరూపమై
దివ్యతేజంబుపై దృష్టినిల్పి
తే. తలఁప నెది లేక భేదంబు తలఁగనీక
జోలలందును నర్థియై జోలలాడు
చున్న యోగీంద్రుఁ డని చెప్ప నుచితమగును
వేమ ననియెడి యోగిని వెలయ భువిని.
ఆ. నాల్గునాలుగింట ననువుగాఁ దగుఁగాని
నాలవయిలు వాని నయ మెఱుఁగరు
అట్టివాని నరయు నాతఁడే శివయోగి, వి...
ఆ. నీరు కార మాయె కారంబు నీరాయె
గారమైన నీరె కారమాయె
కారమందు నీరు కడు రమ్యముగ నుండు, వి...
ఆ. నీరు కార మౌను నీరౌను కారంబు
వానివద్ద నిద్రఁ బోవవచ్చు
నీటిలోన నుండు నిఖిల బ్రహ్మాండముల్, వి...
సీ. మహిలోన నొకయోఁగ మఱికేక లిడుచును
మంచంబు మ్రింగిన మహిమ యేమి
మానుషవంతుఁడై మహిమీఁదఁ బాలుండు

మ్రాను నమలినట్టి మఱి పదేమి
తొడరి దోమలు గిరి నొడిసిపట్టుక తాము
పరఁగ గతించిన బల మదేమి
పంచవన్నెల చిల్కలు పరఁగ నైదును గూడి
పర్వతంబుదిన్న బల మదేమి
తే. గొర్రె దొడ్డిని బడి చెట్టు చిదుమఁజూడ
విరులు పూచినయట్టి విధ మదేమి
అరయ నేర్చిన చెప్పఁడు అఖిలజనులు
వివరముగఁ బల్కినట్టైన వినర వేమ! 2683
సీ. మొదలు మీఁదికిఁ గాను దుద మొదలుగ నున్న
వృక్షంబు మొలచినవింత యేమి
మహిఁ మింటిమీఁదను మదగజం బొక్కటి
వివరించుచున్నట్టి వివర మేమి
చిదిమి పెట్టిన బంటువిధమున నేనుంగు
జీమలు మ్రింగిన చిత్ర మేమి
పులిచింత మీఁదను దలమీఁద నొకచింత
మ్రానుగట్టిన యట్టి మరుగ దేమి
తే. చింతవృక్షముమీఁదఁ జేమంతిపూలు
చెలఁగి పూచినయట్టి విచిత్ర మేమి
అరయ నేర్చిన సర్వజ్ఞులైనవారు
వివరముగఁ బల్కినట్లైన వినర వేమ! 2684

# జీవన్ముక్తి పద్ధతి.

ఆ. జీవసంజ్ఞ గలుగు జీవతత్త్వంబును
జీవపరుని గురుని జెందఁజేసి
తనువు నిలుపువాఁడు తత్త్వజ్ఞుఁ డగుయోగి,వి.

ఆ. జ్ఞానియైనవాని మానక పూజించు
మనుజుఁ డెల్ల పరమునను ముదంబు
సుఖము నందు చుండు సూరులు వర్ణింప, వి...

ఆ. తత్త్వము తిరమైన తావుల వెదకుచు
తాను తత్త్వ మగుట దలఁచి యోగి
తలఁపు లన్ని యుడుగ తత్త్వము తానగు, వి.

తే. తత్త్వములలోనఁ బరమాత్మతత్త్వ మెఱిఁగి
నిత్యనిర్ముక్తపరిపూర్ణనిలయమంది
సరి పరబ్రహ్మమయమని సంచరించు
నతఁడె పో పరశివుఁ డన నగును వేమ! 2688

ఆ. తత్త్వ మెఱుఁగువాఁడు దైవంబు నెఱుఁగును
సర్వసారములను జూఁడఁజేయు
కదలిమ్రింగునట్లె గరళంబు మ్రింగును, వి...

ఆ. తనదు దేహమందు తత్త్వార్థ మెన్నుచు
మందబుద్ధి కాక మహితుఁ డగుచు
లోనిగుట్టు దెలిసి లోకములో నుండు, వి...

ఆ. తనువు నస్థిర మని ధనము నస్థిర మని
తెలుప నేర్చు తాను దెలియ నేర్చు

పాత్రుఁడైన యోగి పరమాత్ముఁడే సుమీ, వి.

ఆ. తన్ను తాఁ దెలిసిన దైవంబు మఱిలేదు
తానె దైవ మంచు తత్త్వయోగి
తలఁచుచుండు నెపుడు ధరలోన నరయుము, వి.

ఆ. తన్ను వెదకి చూడ దానె యా జీవుండు
తత్త్వ మరయ నగును తానె యాత్మ
మన్ను మిన్ను లేదు మాయయు లేదయా, వి.

ఆ. తన్నెఱుంగువాఁడు తాను తానై యుండు
తన్నెఱుఁగనివాఁడు తాను తానె
తనదులోనివాఁడు తానె తా నవునయా, వి...

ఆ. తలఁపులోనఁ గలుగు దా దైవ మేప్రొద్దు
తలఁచి చూడ నదియు తత్వమగును
తలఁపులోనితలఁపు దలఁచుచు నుండుము, వి.

ఆ. తల్లి పార్వతి యగు దండ్రియా శంభుఁడు
ప్రమథగణము లఖిలబంధువితతి
తనకు పుట్టినిల్లు తనరుఁ గైలాసము, వి....2696

ఆ. తాను తానె యనెడి తత్త్వంబు లోపల
నన్వయంబు తెలియఁ డబ్బతోడు
తాను తానె యైన తల్లడం బేలరా? వి....2697

ఆ. తాను నింద్రియముల దనర జయించిన
తత్త్వ మరసి చూడ తానె యగును
రాజయోగి యిట్లు దేజరిల్లఁగవలె. వి... 2698

క. తా నొకటి దెలియు నన్నది
తాను మెయి న్లేక యెల్లతావులు తానై
తా నెఱిఁగి పరిణమించిన
మానవుఁ డిల ముక్తుఁడతఁడె మాన్యుఁడు వేమా!

ఆ. తారుమారుగాక తత్త్వదర్శన మూని
మేరుశిఖర మెక్కి మెలఁగువాఁడు
కేరి యెలుకలోనఁ గీడణఁగించును, వి... 2700

ఆ. తిరిగి తిరిగి యింక దిరుగంగఁ దిరుగంగ
తిరుగు గలదె యెంత తెలివియున్న
తిరుగనట్టి త్రోవఁ దిరుగు మెల్లప్పుడు, వి...

తే. నిక్కమగు జ్ఞాననిష్ఠలో నేర్పుమీఱ
సొక్కి సోలియు భ్రమయక సూక్ష్మ మంది
చిక్కువడకుండువాఁడె సో చిన్మయుండు
దక్కువగ వానిఁ గనలేరు ధరను వేమ! 2702

ఆ. నిజము దెలిసియున్న సుజనుఁ డానిజమునె
పలుకవలయుగాని పరులకొఱకు
దాపఁగూడ దింక నోప దన్యము పల్క, వి...

ఆ. నిజము వరుస నెఱిఁగి నిర్గుణత్వం బంద
పలుకులోని శబ్ద మలరఁ దెలియఁ
బలుకకుండువాఁడె పరమాత్మయగునురా, వి...

# సంకీర్ణపద్ధతి.

తే. ఎంతకాలమొ వ్యర్థమై యంత వీలు
చక్కఁగా జిక్కు వెంటనే జలక మాడి
పాత్రపుష్పము లిడికొని పట్టినాఁడ
గుహాముఖమునొచ్చి కనుఁగొంటి గురుని వేమ!

ఆ. ఒరులకొఱకు భూమి నోదిగించువారలు
నవనిపతికి వశ్యులైనవారు
పాలవంటికులమువారు కాఁపులెఱుంగు, వి...

ఆ. చిగురుచెట్టుచూచి చింతపువ్వులుచూచి
నిమ్మపండు పండు నిమిషమునను
డాలుచెడకమునుపె దానిని తినవలె, వి. 2707

ఆ. చెవిని విల్లుగట్టి చెప్పెను వేమన
బట్టబయలనుండుఁ బ్రహ్మ మనుచు
బుద్ధిగలిగి యందుఁ బొంది సుఖింపుఁడీ, వి....

తే. పరమగురుఁ డభిరామయపాదములకుఁ
జేతులను సాచి మ్రొక్కితి శిరముఁ జేర్చి
తప్పు వినియును క్షమియించె నొప్పిదముగ
దలఁపఁడే నందఁ దనపాటు ఫలము వేమ! 2709

క. ప్రతిదినమును నుదయమ్మున
మితకాలము లెక్కఁగొనక మీఱి పనికి రాఁ

గతమేమి యనుచు రామయ
వ్రత మరయఁగఁ గంటి నిట్టివాసిని వేమా! 2710

తే. రోఁతపుట్టెను మగువపైఁ బ్రీతి దొరఁగె
నాఁటనుండియు నాకేమి పాటు లేమి
కాలమును బుచ్చ నీకర్మశాలయందు
గూరుచుండఁగఁగాదె నీగురుఁడు వేమ! 2711

క. టక్కరులఁ గూడి తిరుగుచు
నెక్కుడు కాలంబు జ్ఞాన మెఱుఁగఁగలేకే
నొక్క వెలయాలిపొందును
మిక్కుట మగుమోక్ష మనుచు మెలఁగితి వేమా!

చ. ధర నతికీర్తిమంతుఁడును దైవసమం డతిగోప్యుఁ
డోర్పు మీఱ రహిని కొండవీటియభిరామయ
నా గురువర్యుఁ డాతఁడు, నృఱియుఁ బ్రభుండ
వీవు ననుమానము లేదిఁక మీఁదునామముల్,
స్థిరముగ నుండుఁగాక యిది సిద్ధము సుమ్ము జగా
న వేమనా! 2713

ఆ. గండికోటలోనఁ గత్తిఁ బట్టినయంత
రాజుగారిదొడ్డరౌతు గాఁడు
ఎంతవారి నైన నెత్తినఁ గొట్టునా? వి....2714

ఆ. పాకనాటిరెడ్డి పరఁగ మోటారెడ్డి
యొనఁగుతోటపెద్దయెఱ్ఱరెడ్డి
మొఱకులందఱుభువి మొనగాండ్లుఅయిరయా, వి.

ఆ. నిమ్మపండుపుట్టె నిజమైనరసముండె
హేమమునకు నేడ్తు రేల జనులు
సత్తుపాత్రుఁజేసి సాధింపలేరొకో, వి... 2716

క. నందనసంవత్సరమునఁ
బొందుగఁ గార్తికమునందుఁ బున్నమనాఁడీ
వింధ్యాద్రిసేతువులకును
సందున నొకవీరుఁ డేలు సాటర వేమా! 2717

క. కాదనఁ డెవ్వరితోడను
వాదాడఁగ బోఁడు వెజ్జివానివిధమునన్
భేదాభేద మెఱుంగును
వేదాంతరహస్యములను వేమన నుడువున్. 2718

క. సమయంబు మంచిదయ్యెను
క్షమియించితిరయ్య నాకు సాధ్యం బయ్యెన్
తమఫల మటంచు చెప్పితిఁ
గ్రమముగ నికమీఁది ముప్పు గడచెను వేమా!

# ఫ ల శ్రు తి.

తే. అరయ వేమన్న చెప్పినయాత్మవిధము
దెలియలేనట్టి యజ్ఞాని దేబెలెల్ల
తలను పీడినవెం డ్రుకదారివలెను
భుక్తిముక్తులఁ బొసఁగఁగా లేరు వేమ! 2720

ఆ. ఇహపరంబులకును నిది సాధనం బని
వ్రాసి చదివి విన్నవారి కెల్ల
మంగళంబు లొనరు మహిలోన నిజ మిది, వి.

క. ఒకపద్యంబును మది నిడి
ప్రకటిత మగుగుట్టు దెలిసి పరికించినచో
సకలంబును శ్రుత్యర్థము
నికటంబగు నిటరహస్యనిలయము వేమా! 2722

ఆ. ముక్తిమార్గమునకు మూలమై తగునట్టి
గ్రంథ మంత జనులు గడఁగి చదువ
విన్నవారి కెల్ల విభవముల్ కలనయా, వి....

క. వేమన చెప్పిన కల్పం
బే మానవుఁ డైనఁ గాని యెద నూహింపన్
దామస మేటికి కల్గును
వేమనయే సిద్ధుఁ డరయ విధ మిది వేమా!

క. వేమన చెప్పినమాటలు
సామంబున సకలవేదసారంబుగదా
సామెత పంచాక్షరితో
నీమహిమలు దెలిసియుంట యింపగు వేమా!

ఆ. వేమ నన<g రోగి వెలసె లోకములోన<
బూజ లిడుఁడు పుణ్యపురుషులార
పూజ లిడినయంత భుక్తిముక్తుల నిచ్చు, వి...

ఆ. వేమ నిట్లు చెప్పె వేలపద్యంబులు
తప్పు లెన్ని యున్న నొప్పియుండు
తత్త్వపడకందు జిత్తము నిల్పుము, వి.... 2727

క. వేమనపద్యము లెల్లను
సామముతోఁ జదివినట్టి సజ్జను లెల్లన్
సోమనతలగలయాతని
సామీప్యము బొందఁ గలరు సత్యము వేమా!

# అనుక్రమణిక.

ఆంధ్రతాత్పర్యసహిత

# శ్రీమద్రామాయణము

ఉత్తరకాండసహా ప్రతి 1-కి రూ. 17 0 0.

కాండలు విడిగాఁగూడ దొరకును.

| | | | |
|---|---|---|---|
| బాలకాండము, | ఆంధ్రతాత్పర్యసహితము | | 2-0-0 |
| అయోధ్యాకాండము | ,, | ,, | 3-0-0 |
| ఆరణ్యకాండము | ,, | ,, | 2-0-0 |
| కిష్కింధాకాండము | ,, | ,, | 2-8-0 |
| సుందరకాండము | ,, | ,, | 2-0-0 |
| యుద్ధకాండము | ,, | ,, | 4-0-0 |
| ఉత్తరకాండము | ,, | ,, | 2-8-0 |
| అధ్యాత్మరామాయణము, | టీకాతాత్పర్యము | | 3-0-0 |

---

కావ్యతీర్థ శ్రీ జనమంచి శేషాద్రిశర్మవిరచిత

# ఆంధ్ర శ్రీమద్రామాయణము

నిర్వచనము.

వ్యాఖ్యానములలోనిభావముకూడ విడువక తెనిఁగింపఁబడినది. ఏశ్లోకమున కేపద్యమో తెలియుటకై శ్లోకసంఖ్యగూడఁ దెలుపఁబడినవి. విశేషార్థములుండుతావులఁ గ్రింద వివరముగ వ్రాయఁబడినది. గొప్పపీఠిక గలదు. 3 సంపుటములప్రతి 12-0-0

7 ,, 14-0-0

# ఆంధ్రగ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తిఅబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| డిటో కాలికో బైండు ... | 0 | 14 |
| అప్పకవీయము (విమర్శతో)నున్నది ... | 2 | 8 |
| ,, విమర్శనముమాత్రము ... | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము)... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము ... | 3 | 8 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైనప్రతులకన్న అన్నివిధములబాగుగనున్నది | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | 8 | 0 |
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | |
| 7 సంపుటములు ప్రతి 1-కి రూ | 15 | 12 |
| 3 సంపుటములప్రతి ... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వముల సంపుటము ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వముల ,, ... | 2 | 4 |
| శాంతిపర్వము ... | 2 | 4 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటే సంపుటము ... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, ... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, ... | 4 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రి | 0 | 8 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు ... | 0 | 12 |
| ,, కాలికోబైండు ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబ నిఘంటువు, టీకానుక్రమణికాసహితము... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| ఉత్తరరామాయణము, కంకంటిపాపరాజప్రణీతము చక్కనికూర్పు ... | 2 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతృచరిత్ర ... | 1 | 8 |
| డిటో మేలుప్రతి కాలికోబైండు ... | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక (భాగవతము) ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువుకృతము ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 10 |

| | | |
|---|---|---|
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనముమిక్కిలి సొంపు. పీఠిక అతివిపులము ... | 7 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | 1 | 0 |
| డిటో కాలికోబైండు ... | 1 | 6 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 2 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము ... | 2 | 8 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడ, క్రొత్తకూర్పు | 1 | 0 |
| డిటో కాలికోబైండు ... | 1 | 6 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| డిటో వేంకటనాథకవికృతము ... | 1 | 4 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు క్రొత్తకూర్పు | 0 | 8 |
| బసవపురాణము, పిడుపర్తిసోమనాథప్రణీతము | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము ... | 1 | 0 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము | 1 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కని క్రొత్తకూర్పు | 4 | 0 |

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| భోగినీదండకము ... | 0 | 1 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితముల మీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నారము ... | 2 | 0 |
| మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు | 0 | 10 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | 3 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి నారాయణకవిప్రణీతము | 0 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | 2 | 4 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి ... | 0 | 8 |
| ,, కాలికోబైండు ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... | 0 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము ... | 1 | 4 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీచినసీతారామస్వామిశాస్త్రికృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | 3 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది ... | 0 | 5 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది | 1 | 0 |

| | ప్రతి 1-కి రూ॥ |
|---|---|
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 |
| డిటో బ్రౌనుదొరగారిఇంగ్లీషుతర్జుమాతో | 1 |
| డిటో ఆంధ్రతాత్పర్యసహితము | 3 |
| వైజయంతీవిలాసము, చక్కనికూర్పు ... | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 |
| శృంగారశాకుంతలము, పిల్లలమఱ్ఱిపినవీరభద్రకవిది | 0 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము ... | 0 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవిప్రణీతము | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | 1 |
| ,, కాలికోబైండు ... | 1 |
| సప్తమస్కంధము, సాధారణప్రతి (భాగవతము) | 0 |
| ,, సటీక, చిన్నసైజు ... | 1 |
| ,, కాలికోబైండు ... | 1 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము | 0 |
| సానందోపాఖ్యానము, శ్రీశివరామకవి విరచితము | 1 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది. సాధారణప్రతి ... | 2 |
| డిటో మేలుప్రతి కాలికోబైండు ... | 3 |
| సులక్షణసారము, సటీక ... | 0 |
| హరవిలాసము ... | 0 |
| హరిశ్చంద్ర నలోపాఖ్యానము, సటీక ... | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
**292**, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ